శ్రీ

# కృష్ణ రుక్మిణీ సంవాదం బను
# సుజ్ఞాన శాస్త్రము.

ఇది

శ్రీమ దచలగురుమూర్తి యగు

పోకల - శేషాచలమునాయనివారి

శిష్యుండగు

పోలకం - నరసింహంసెట్టిగారిచే

రచియింపంబడి,

తద్గురుపుత్రులగు

ఆశుకవి శిఖామణి

పోకల - వేంకటనరసింహారావునాయనిచే

సవరింపంబడి


చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు

వమ్మి - త్యాగరాయసెట్టి & సన్సుగారి

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడి ప్రకటింపంబడియె.

మూడవ కూర్పు. 1000 ప్రతులు.

1933




[దీనివెల 8_అణాలు.

# విషయసూచిక.



III



పోలకం - నరసింహంసెట్టి.



అచలగురుఁడు పోకల - శేషాచలస్వాములవారు.

శ్రీసద్గురవే నమః.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను సుజ్ఞాన శాస్త్రము.

## ప్రథమాశ్వాసము.

ఉ॥ శ్రీగురునాథునిం బరమ * సిద్ధుని నద్వయు నప్రమేయునిన్।
రాగవికారదూరుని ని*రంజను నిర్గుణు నిర్వికారుని। న్నాగమవేద్యు
సర్వమయు * నక్షరు నవ్యయుఁ గేవలాత్మునిన్। బాగుగఁ గొల్చి యేనె
పుడుఁ * బ్రార్థనఁ జేతు నభీష్టసిద్ధికై॥ ౧॥ తోటకము॥ మూర్తులకాది
మ * మూర్తియటంచున్। మూర్తులు వేల్పులు * మున్నుగఁదామే।
మూర్తిగణింతురొ * ముఖ్యముగా నా। మూర్తివినాయక * మూర్తిఁ
దలంతున్॥ ౨॥ ఉ॥ సారసగర్భ చక్రధర * శంకరనాములనాది వేల్పు
లై। శారద లక్ష్మి పార్వతుల * శక్తులు గాఁగొని లోకజాలము। ల్గోరి
యొనర్పఁ గావఁగను * గూల్ప వశీకరులైన ధన్యులన్। గూరిమిఁ గొల్చి
వాణి రమ * గోత్రజ దేవుల సన్నుతించెదన్॥ ౩॥ ఉ॥ ఒక్కపసిండి
పెక్కునగ*లొప్పుగనాక్రియ దేవదానవుల్। దిక్కులు పంచభూతము
లు * దిక్పతులున్మునిమూర్తులంబుధుల్। చుక్కలు మర్త్యులింద్ర రవి *
సోమనగాది సమస్తవస్తువుల్। మక్కువ నొక్కఁడైనపర * మాత్మను
గూర్చి భజింతు నెమ్మదిన్॥ ౪॥ క॥ నరసురలోకము లెల్లన। మరియున్న
ను లేకయున్న * మాయ నెఱుఁగకే। నిరతంబు బట్టబయలగు। పరిపూర్ణ
బ్రహ్మమునకుఁ * బ్రణుతి యొనర్తున్॥ ౫॥ తే-గీ॥ అవని భాగవతోత్త
ము * లనఁగఁ బరఁగు। నట్టి ప్రహ్లాద భీష్మ గ * యాంబరీష। శౌనక
వ్యాసబలి శుక * జనక నార। దార్జునాది మహాత్ముల * నభినుతింతు॥ ౬॥
సీ॥ పరఁగ వేమనయోగిఁ * బ్రకటించి పలుమారు - శ్రీధరస్వామి ప్ర *
సిద్ధిఁ బొగడి। తివిరి శ్రీశివరామ * దీక్షితు సేవించి - శ్రీకృష్ణదాసునిఁ *

జింతసేసి। చెంచు రాజార్యులఁ * జిత్తంబులో నెంచి - కోటప్ప దేవరఁ* గొల్చిభక్తి। వరుసగానాంధ్రగీ* ర్వాణకవులనెల్ల - భావించి వేల్పోలఁ* బ్రస్తుతించి॥ తే.గీ॥ యచలభావజ్ఞులైనట్టి * యఖిలబుధుల। పాద పద్మంబులకు మ్రొక్కి*భక్తిమీఱ। నతులమానీదుకృపనొక్క*కృతిని నిపుడు। సేయఁబూనితి గురురాయ * చిత్తగింపు॥ ౭॥ తే.గీ॥ ఆంధ్ర గీర్వాణతర్కకా * వ్యామరములు। ఛంచవేదాది శాస్త్రముల్ * చదువలేదు। గురువరోత్తమభవదీయ * కరుణఁజేసి। చెలఁగియీకా వ్యమేను ర * చింతునిపుడు॥ ౮॥ చ॥ ధరనపశబ్దయుక్తమయి * దైవ నుతంబుగఁజేయుకావ్యమా। సరసిజబంధుఁడుర్కఁబొడము*సద్దివసంబు విధంబుభాసిల్లుఁ। అరయసుశబ్దయుక్తమయి*యాత్మవిచారములేని కావ్యమా। సరసపుఁజుక్కలుండియును * జంద్రుఁడు దోఁచనిరాత్రి చందమా॥ ౯॥ ఆ వె॥ సత్యవంతునకును * జక్కఁదనంబు లే। కున్న సత్యమునకుఁ*గొఱఁత రాదు। గానఁనట్లుమోక్ష*గ్రంథంబునకు లక్ష। ణములుతొఱఁగియున్న * నాదిచెడునె॥ ౧౦॥ క॥ అనియిందుఁదప్పు గలదిట। ననిదిద్దియునొప్పఁజేతు*రార్యులనుచు నె। మ్మనమున నెంచి వచించెద। నెనయఁగ మజ్జన్మక్రమము * నించుక దెలియఁ॥ ౧౧॥ సీ॥ క్షితిఁ గందుకూరను * సీమతోఁజేరిన - పమిడిపాడనుగ్రామ * పదమునందుఁ। గల గోనుగుంట స * ద్బలిజకులాబ్ధిందుఁ - డలఘు కర్పూరగోత్ర * జలజభానుఁ। డయినపోలకమువెం * గనకునరాంబస- ద్భక్తిమహాసక్తి * కంబనంగ। లక్ష్మీనృసింహుండు * లలినొప్పనా తని - దేవిలక్ష్మీయనంగఁ * దేజరిల్లె॥ తే.గీ॥ ధర్మగుణములనయ్యా రుం * ధతియనంగఁ। బొల్చుసాధ్వికినమ్మహా * పుణ్యునకును। బుట్టితి మియేవురమునొక్క*పుత్త్రియుతము। నారసింహుండ నేనందు*నగ్ర జుండ॥ ౧౨॥ క॥ వరుసఁగఁగొండయవెంగయ। మఱి రామయయనఁ గనక్క*మాంబయనంగాఁ। బరఁగుదుపు కడమవారలు। ధరనుత్తమ గుణులుసత్య * ధనులుసధర్మ్యుల్॥ ౧౩॥ సీ॥ ధారుణిశ్రీపోతు * లూరి వీరబ్రహ్మ-మునకుసద్భక్తుఁడై * ముదముమీఱఁ। జెలఁగెదూదేకుల* సిద్దప్పయతనికి - లీలజంగమమర * లింగమయ్యె। శిష్యుఁడాతనికిని * శేషరాజననొప్పె- రహినతనికిఁజెంచు*రాజుసేవ। కుండయ్యెనతనికిఁ*

గోటప్పదేవర - శేషాచలాహ్వయుల్ * శిష్యులైరి॥ తే-గీ॥ కోరిశివ
రామదీక్షితుఁ గొల్చెరామ। కృష్ణుఁడుమహేశ్వరుఁడతని * కృపను
బడసె। నతనిఁగోటప్ప దేవర*యాశ్రయించె। నతనిసేవించెశేషాచ *
లార్యవరుఁడు॥ ౧౪॥ మ॥ పరిపూర్ణాచల భావశీలుఁడయి త * ద్భా
వంబుగ్రంథంబులన్। విరచింపన్ దనుశిష్య కోటిగొలువన్ * విఖ్యాతి
నింబొంది సు। స్థిరుఁడై చెన్నపురంబునం దెసఁగునా * శేషాచలాభి
ఖ్యమ। ద్గురుమూర్తిన్ మదినెంతు భక్తిమెయి న* త్యుద్బుద్ధినశ్రాం
తమున్॥ ౧౫॥ సీ॥ ఒనరనేనొక్కనాఁ * డొకకావ్యమొనరింపఁ -
దొడఁగియేకథఁజేయఁ * దోపకాత్మఁ। గనమూయమద్దేశి * కుని
యట్లుశ్రీహరి - నాకుఁబ్రసన్నమై * నన్నుఁజేరి। రూఢిగా శ్రీకృష్ణ*
రుక్మిణీసంవాద- మగునట్లునాపేర * నంకితంబుఁ। జేయఁగృతార్థతఁ*
జెందుసర్వాఘముల్ - వాయుభవంబులు* వాయునీకు॥ తే-గీ॥ నను
చుఁజెప్పితిరోహితుం*డయ్యెనంత। నట్టిమేల్కాంచియేనునా* నంద
మొదవ। నాతపంబునుఫలియించె*నాదుకోర్కె। లెల్లసమకూరెనని
పొంగి*యుల్లమునను॥ ౧౬॥ చ॥ తనువుదొలంగిచూచినను*దైవము
దేశికుఁడొక్కఁడంచునా। మనమునయెంచిసర్వమయు*మాటికిఁగొల్చి
ముదంబు నెక్కొనన్। ఘనముగఁ గృష్ణరుక్మిణులఁ*గారణభూతులఁ
జేసి యెంతయున్। దెనుఁగుననేఁ బ్రబంధము కృ * తింపఁగఁబూనితి
దైవతాఖ్యగన్॥ ౧౭॥ షష్ఠ్యంతములు. క॥ సర్వోత్తమునకుగురునకు।
సర్వాత్మకునిర్మలునకు * సర్వసమునకున్। సర్వేశ్వరునకు జ్యోతికి।
సర్వాధారునకుహరికి* సర్వమయునకున్॥ ౧౮॥ క॥ సురమునిగణపూ
జితునకుఁ। బరమాత్మకువిగతగుణికి * భవదూరునకున్। దురితరహి
తునకునిహపర। భరితునకున్ జిన్మయునకు * భగవంతునకున్॥ ౧౯॥
క॥ రూపరహితునకు సర్వ। వ్యాపకునకువాదభేద * వర్జితునకు స।
ద్రూపునకునునఖిలజగ। ద్దీపకునకుఁగామరహిత*దివ్యాత్మునకున్॥ ౨౦॥
క॥ నిరుపమునకు శాశ్వతునకుఁ। బరబయలగు నిర్వికల్ప * పరమపదు
నకున్। నిరతునకుఁగేవలాత్మకుఁ। బరునకునచలునకు సర్వ*పరిపూర్ణు
నకున్॥ ౨౧॥ కథాప్రారంభము. తే-గీ॥ ఒప్పనంబుగనేనిప్డు * చెప్పఁ
బూని। నట్టిగ్రంథంబునకుమొద*లెట్టిదనినఁ। బుడమిలోఁపలద్వారకా*

పురమనంగఁ। బరఁగునొకరమ్యమైనట్టి*పట్టణంబు॥ ౨౨॥ క॥ పదిరెం
డామడలునిడుపుఁబదిరెండామడలు వెలుపుఁ*బట్టణమదియాయుద
ధికినడుమనునెంతో। నుదమొప్పఁగవిశ్వకర్మ * మునుగావించెన్॥
౨౩॥ తే-గీ॥ స్వర్గవైకుంఠకైలాస * సత్యలోక। ములను బురుడించు
వైభవ*ములనుమించి। రౌప్యకాంచనసదమల*రత్నమయము। లగు
చు వెలుఁగొందుగేహంబు లగణితముగ॥ ౨౪॥ క॥ కనకమణిమయము
లగుచును। గొనకొనిగగనంబునంటు * గోపురములచే। ననువొందు
లోహనిర్మిత। ఘనతరప్రాకారసప్త * కంబవ్వీటన్॥ ౨౫॥ క॥ మక
రాదిసకలజలచర। నికరంబులకునిక వగుచు*నెంతోలోతై। ప్రకటిం
పఁజెలఁగుపరిఖయు। నకలంకంబగుచుఁబురికి*నాలుగుదెసలన్॥ ౨౬॥
చ॥ కమలదళాప్తురథ్యముల * కంటెనువేగముగలైనగుఱ్ఱముల్। అమ
రఁగదిగ్గజంబులకు * నారయమించిన హస్తియూధముల్। యమ
భటకోటినైనమఱి*యంతముఁజేయగఁజాలుభృత్యులున్। సమమగు
భూధరంబులకుఁ * జక్కఁసితేరులు నప్పురంబునన్॥ ౨౭॥ తే-గీ॥ దేవ
కాంతలరూపము * లైగడనోపు। నందములచేతఁబెంపొందు*నిందు
ముఖులు। చక్కఁదనమునఁజంద్రుని * ధిక్కరింపఁ। జాలుపురుషులు
గలరందు * లాలితముగ॥ ౨౮॥ క॥ సుందర సుకుమారత్వము। లం
దున నవగానవిద్య * లందున మహదా। నందవయోవిభవంబులఁ।
గందర్పునిముంపఁజాలు * గణికాతతులున్॥ ౨౯॥ చ॥ ఎనయఁగ
బ్రహ్మవేత్తలగు*నిద్ధమనస్కులు భూసురోత్తముల్। ఘనమగువిక్రమ
స్ఫురణ * గల్గియధర్మములేనిక్షత్రియుల్। ధనముననాకుబేరునకుఁ *
దారును హెచ్చినటించు వైశ్యులున్। బనుపడసేవ్యవృత్తిగురు*భక్తి
యుఁగల్గినశూద్రులప్పురిన్॥ ౩౦॥ క॥ కొమరగుమకరతతోరణ। సము
దయములు వెలయుచుండు*సకలదిశలతో। ఘుమఘుమ వాసనలొద
వెడి। రమణీయంబైనయట్టి * రాతెరువులతోన్॥ ౩౧॥ తే-గీ॥ వీధి
వీథులనంగళ్లు*విశాలముగను। గామితార్థంబులెల్లను*గలిగియుండు।
గణనసేయంగరానట్టి * మణులచేత। దానిసరిపోల్పరాదు ర * త్నాక
రంబు॥ ౩౨॥ చ॥ కొనకొని మేడలందు బలు * గోపురపఙ్క్తులనాటి
నట్టియా। ఘనతరమైనసోమరవి * కాంత శిలాతతులందుసొంపుగాఁ।

గనుపడు నీడలంగనియుఁ * గల్వరమొందుచుఁ బెక్కుభంగులన్ ।
జనములనేకసూర్యులని * చంద్రులు పెక్కని చూతురప్పురిన్ ॥ ౩౩ ॥
తే-గీ॥ హంస కోకిల కీరంబు * లమ్మయూర । మాదిపక్షులకెల్లను * నదియునిలయ । మగుచుఁజందనమాకంద * మాదివృక్ష । రాజిచే నొప్పుచుండు నా * రామములును ॥ ౩౪ ॥ క॥ జలజములునల్లకలువలు । సులలితమగు చంద్రకాంత * సోపానగతుల్ । గలిగిబహునిర్మలోదక। ములచేనేకాలమింకి * పోనిసరస్సుల్ ॥ ౩౫ ॥ ఉ॥ ఆపురిరమ్యహర్మ్యములు * నాపురికోటలుగోపురంబులు । న్నాపురిరాజమార్గములు * నాపురిసొంపు విశాలగేహముల్ । ఆపుర రామసీమలును * నాపురదివ్యతటాకవర్గముల్ । ఆపురవైభవంబులును * నారయ బ్రహ్మకునైనశక్యమే ॥ ౩౬ ॥ క॥ కోరిగనుంగొననెంతటి। శూరులకునువశము గాదు*శోధింపఁగనే। చోరులకునలవిగాదిఁక। నేరిపులకుఁజొరనశక్య* మిలనాప్రోలున్ ॥ ౩౭ ॥ క॥ ఆపట్టణంబునకుసరి; యేపట్టణమైనజగతి* నెన్నఁగరాదా। నాపురిఁగాపురముండెడు। నాపుణ్యులభాగ్యమింత* యనఁగావశమే॥ ౩౮ ॥ క॥ ఆనగర మేలుధీరుఁడు। మానితవిజ్ఞానమయుఁడు*మాయాహరుఁడున్। నానాలోకగురుండును। నానిగమాంతుండుకృష్ణుఁ * డనఁగావెలయున్ ॥ ౩౯ ॥ క॥ పదునాలుగుభువనంబులు। పదపడితనయందునిలిపి * బ్రహ్మాదులకున్ । మదిఁదెలియరాక నిర్గుణ।పదమునభాసిల్లునతఁడు*పరిపూర్ణుండై ॥ ౪౦ ॥ తే-గీ॥ అష్టభార్యలతోడను * నధికసౌఖ్య । మనుభవించుచు నిరతంబు * మునులతోడ। గోష్ఠిసల్పుచునేమిటఁ*గొఱఁతలేక। చక్రధరుఁడుండెనత్యంత* సంభ్రమమున॥ ౪౧॥ క॥ ఆరీతినందసూనుఁడు । వారకసాందీపు వలనఁ*బడసినవిద్యన్। గోరినభక్తులకిచ్చుచుఁ। గూరిమిమీఱంగమార* గురుఁడుండుతఱిన్ ॥ ౪౨॥ చ॥ సతతము రుక్మిణీపతియు*సాధుచరిత్రయుముక్తిఁగోరి దాఁ। బతికడభక్తకోటులెడఁ * బాయకభక్తివహించుమార్గమున్ । హితమతిఁజూచి చూచియది*యేగతినాకులభించుఁగాత యం। చతివయు భర్తవేఁడుటకు * సంశయమొందుచు సిగ్గుఁబొందుచున్ ॥ ౪౩॥ తోటకము॥ ఎన్నిదినంబుల*కీగతినున్న। న్నన్నదెసార్థక * మూరకయంచున్ । బన్నుగనప్పుడు * భర్తనువేఁడన్ ।

దిన్నగనా చెలి* తెంపువహించెర్॥ ౨౨॥ వ॥ అంత. ఉ॥ అచ్చపలాక్షి యాఁగల* యచ్యుతుఁజేరఁగలేకయాత్మలో। మచ్చికనెంచెనిట్లుహరి* మానినికేలయటంచు నెంచునో। యిచ్చునొలేక కారణము * నీయక యెంతయుఁగోపగించునో। హెచ్చగునాదుపూర్వఫల* మెట్టులనున్న దో యంచుఁజింతిలుర్॥ ౨౪॥ సీ॥ వనిత మోక్షమునందు * వాంఛ యొక్కటెగాని - కొండొకధర్మంబుఁ * గోరదయ్యె। స్నానంబుఁ జేయదు* వలువలుగట్టదు - పుష్పములెవ్వట్టదు * భూషలిడదు। గంధం బుఁబూయదు * కస్తూరితిలకంబు - దిద్దదుకాటుకఁ * దీర్చదబల। కీరంబుఁబిల్వదు * కేకిహంసలఁబ్రోవ - దలకోకిలలఁబల్కు * లాద రింప॥ తే-గీ॥ దన్నపానాదితమలంబు* లంటదతివ। భోగమునునిద్రఁ గోరదు * పుణ్యచరిత। చెలులఁగన్నెత్తిచూడదు * చెలులవలన। సేవఁగైకోదుపల్కదు * చెలులతోడ॥ ౨౬॥ చ॥ పడఁతుక యింత కాలమును * బాయకనాథునిచెంతనుండియుర్। దడయుటకేమి కారణ మొ* దాముసుజేసినయట్టిపుణ్యమి। య్యెడనొనఁగూడఁగావలయు* నింతికిభానుఁడుగ్రుంకునంతలో। నొడలనుబ్రాణముల్నిలుప*నోపదు తాఁగనునొక్కయేడుగర్॥ ౨౭॥ స్వాగతము॥ వారిజాక్షితన * వల్ల భుఁజేరర్। మారుతండ్రితను * మన్ననసేయర్। గోరియున్నతన* కోర్కెయుఁదీర్। శౌరినెమ్మదిని* సారెకునెంచుర్॥ ౨౮॥ వ॥ అట్టియెడ. సీ॥ నేనున్నవిభుచెంత * నెలఁతపోరాదని - యేగెనోయనుభంగి * నినుఁడుగ్రుంకె। ముద్రలైదునుగాంచు* ముదితయీతెఱఁగన్న - కరణి సాంధ్యరాగ* కాంతిదోఁచె। సకలభూతంబులు* సత్యంబుగనునుప్ప - చంద్రంబుతారకా * బృందమొప్పె। సుజ్ఞానమనువెల్గుఁ * జూడకవిడ నన్న - గతినిలఁదమమెల్లఁ* గప్పుగొనియెఁ॥ తే-గీ॥ దరునియజ్ఞానతమ మెల్ల* దగ్ధమగుచుఁ। దెలివియనుమేటిసుజ్ఞాన* తేజమమరు। ననుచుఁ జాటినగతిఁజంద్రుఁ* డంబరమునఁ। జెలఁగియుదయించెదిమిరేభ* సిం హమగుచు॥ ౨౯॥ ఉత్సాహ॥ సరసమైనహేమరత్న * సౌధమందు నప్పుడా। సరసిజాక్షుఁడంతసార * సౌన్నముల్భుజించియుర్। వరసు భూషణాంబరాది * వస్తులేపనాదులర్। గరముఁదాల్చిహంసతూలి * కంబుఁజేరియుండగర్॥ ౩౦॥ చ॥ అతివయు రాత్రిసుంచిసను* యంబని

యెంచిభుజించిమించి స। మ్మతిఁబతిఁజేరఁగాఁదలఁచి * మంజుసుగంధము
లెల్లఁబూసి తా। నతులిత వస్త్రముల్తొడవు * లాదిగఁబెట్టిత్రిలోక
మోహినీ। గతిఁబొడసూపెనాయువతి * కాంతునిఁజేరుట వింతదోఁ
పఁగన్॥ ౧౧॥ తామరస వృత్తము॥ కలిగెనుమోదము * కాంతకు
నంతన్। దొలఁగెనుశంకయుఁ * దోఁచెనుధైర్యం। బలరెవివేకము*
భక్తిని యుక్తిన్। తెలియఁగ ముక్తిని * దీవ్రమునొందెన్॥ ౧౨॥
సీ॥ పతిదైవమనియాత్మ * భావించుసేవించుఁ * బూజించువందనం
బులనొనర్చు। వరునిఁదక్కనునన్య * పురుషులఁగలనైన - గన్నెత్తి
చూడదా*కమలనయన। ధవునకుఁబరిచర్యఁ * దానొనర్చునుగాని-
సేవకులనునేరిఁ * జేయనీదు। చనువిచ్చినను భర్త * సతిగురుత్వము
భక్తిఁ - దప్పదువిభునాజ్ఞ * దాఁటదెపుడు॥ తే-గీ॥ రామరత్నంబు
పట్టంపు * రాణిసుగుణి। దివ్యచారిత్రరుక్మిణీ * దేవిమిగుల। భక్తివెల
యంగఁజనుదెంచి * పద్మనాభు। పాదపద్మంబులకుమ్రొక్కి * పల్కె
నిట్లు॥ ౧౩॥ ఉ॥ ఓపరమాత్మ విశ్వముఖ * యోపరమేశ్వర యో
పరాత్పరా। యోపరవస్తురూపహరి * యోదురితాంతకయోకృపాని
ధే। యోపరహంస సర్వసమ*యోమునివందిత యోమహాప్రభో। నా
పలుకాదరించిదయ * నన్నిఁకఁబ్రోవుము ప్రాణనాయకా॥ ౧౪॥
ఆ-వె॥ సారిదిజీవునకును * సుఖదుఃఖములురెండు। జన్మజన్మములఁ
ను పంభవించు। జన్మవలననేమి * సౌఖ్యంబుగనరాదు। గానజీవుఁ
డెట్లు * గాంచుముక్తి॥ ౧౫॥ క॥ జన్మంబేలావచ్చెనొ। జన్మముఁ
దప్పించుకొనెడు*సాధనమిఁక నీ। జన్మమునఁగలదొ లేదో। జన్మము
రోసితినిముక్తి*సాధనకొఱకున్॥ ౧౬॥ తే-గీ॥ ఎన్నిదినములుబ్రతికిన*
నేమిఫలము। కాటికేగద యీమాయ * కాయమరయ। చచ్చిచచ్చి
యుఁ బుట్టంగఁ * జాలశ్రమలు। తిరిగిపుట్టని మార్గంబుఁ * దెలుపు
మీశ॥ ౧౭॥ క॥ వరభక్తలోకరక్షక। పరిహరివిధములనునిన్నె * ప్రా
ర్థించెద నా। మొరవినిసతియనిద్రోయక। కరుణించియునాదుజన్మఁ
గడతేర్పఁదగున్॥ ౧౮॥ క॥ అనియిట్లువేఁడు రుక్మిణిఁ। గనియాపురు
షోత్తముండు * కడుమోదమునన్। దనలోనెతాను మెచ్చుచుఁ। దన
సతిమదినరయఁగోరి * తానిట్లనియెన్॥ ౧౯॥ తోటకము॥ భామిని నీ

దగు*పల్కులు, నాహా! । యేమివిచిత్రము! : ఇందులకెందుర్ । గామిత వాంఛలు*గాకను మోక్షం। బేమిపదార్థమొ- యెన్నఁగదానిన్ ॥౬౦॥ ఆ-వె॥ తరుణి నీదుచక్కఁ * దనమునకీయఁలం । కారమునకుఁదగును* కలికినాతోఁ । గలసిపొమ్ము మోక్ష*కాంక్ష నీ కేటికి । సురతకేళికంటె* సుఖముగలదె॥ ౬౧॥ క॥ వినుబ్రహ్మానందసుఖం । బునకంటెను హెచ్చుసుఖము * భోగానందం । బనివచియించుటవినమే । వనజాసనుఁడాది దివిజ * వర్గములెల్లన్॥ ౬౨॥ ఆ-వె॥ అనిననిత్యమైన * యట్టి బ్రహ్మానంద । సుఖముకెనయెపోల్చి*చూడమదన। కేళియల్పసుఖము* కేవలం బని యన । నింతిఁజూచి శౌరి * యిట్టులనియె॥ ౬౩॥ క॥ నీ మాటలు నీ తేఁటలుఁ । నీమానసవృత్తితెగువ * నీనేర్పులునున్। నీమ దికింపగుఁగాకను । నామనమున కింపుగావు * నలినదళాక్షీ॥ ౬౪॥ సీ॥ కాంచన నవరత్న * కలితనిర్మితమైన - మేడ లున్నవి నీకు * మెలఁగుటకును । వెలలేనిభూషణ * వితతులున్నవిదాల్ప - కనకాంబరములాది * గలవుకట్ట । లీలకుహంసతూ * లికపాన్పులున్నవి - పూయుటకు సుగంధ * ములునుగలవు । అష్టభార్యలలోన*నధికురాలవునీవు । పట్టంపురాణివై * పరఁగుచుంటి॥ తే-గీ॥ వఖిలభోగంబులునుగల * వనుభవింపఁ । జెలులు పెక్కండ్రుగలరు నీ * సేవఁజేయఁ। గూర్మి సంతతిగలదేమి * కొదువనీకుఁ । నింతకంటెను మోక్షంబ * దెక్కువగునె॥ ౬౫॥ క॥ సారంబుత్రివర్గముని । స్సారము మోక్షంబు గాఁగ*సర్వజనులకున్। సారంబులేని మోక్షముఁ। గోరుటయిది వెఱ్ఱితనము * కోమలినీకున్॥ ౬౬॥ క॥ జగములయందుఁ ద్రివర్గము । పొగ డొందు సమస్తమునకుఁ * బూర్వక్రియగా । నెగడును మోక్షము నిష్క్రియ । యగుచుండఁగఁ గ్రియగనీకు * నగుపడుటెట్లో॥౬౭॥ సీ॥ నావుడు నావాసు * దేవుని నీక్షించి - తెలివిమైరుక్మిణీ * దేవి పల్కె! నోపుండరీకాక్ష*యొప్పుగానివియెల్ల - వచ్చునపుడుమనము* తెచ్చినామె। పోవునప్పుడునొక్క*పుచ్చినవక్కైనఁ - గొంచుపోవుట యు లే*దెంచిచూడ । సర్వంబుమధ్యనే * సంభవంబయ్యెను - సర్వంబుమధ్యనే * సమసిపోవు॥ తే-గీ॥ కలిమి లేములు శాశ్వత * ములు నుగావు । నీటిపైబుగ్గ తనువును*నిలువఁబోదు । అఖిలమునుమాయ

నిత్యమై * నట్టిపదముఁ। దెలియఁగోరినదానను * జలజనాభ॥౮౮॥
ఉ॥తల్లియుఁదండ్రియుర్ గురుఁడు*దైవమునీవనియెల్లప్రొద్దునా।యుల్ల
మునందునమ్మికొని*యుంటిమహాత్మ దయారసంబుచేఁ।గల్లయునిక్క
మున్ దెలిపి*గ్రక్కునమోక్షమునీవెయన్యమే।నొల్లనునీదుదివ్యపద*
యుగ్మముదక్కనుభక్తవత్సలా॥ ౮౯॥ క॥ మీకుం దెలియనిధర్మము।
లోకంబునఁగలదెసర్వ*లోకశరణ్యా।మీకరుణఁగోరియుంటిని। జేకొని
ననునీళ్లముంపు * చేర్పుముపాలన్॥౭౦॥ క॥ నీతులమీరలెఱుంగని।
రీతినిమీయెదురఁగొన్ని*రిక్తవచనముల్ । ఖ్యాతిగఁబల్కితినిప్పుడు।
నాతప్పు క్షమించి దయను * నన్నేలుహరీ॥ ౭౧॥ తే-గీ॥ అనినసతిఁ
జూచికృష్ణుఁడా * హ్లాదమొంది । సఖియలెల్లనుసామాన్య * సతులె
గాని। యింతినీబుద్ధిఁజూడంగ*నెంతొ పెద్ద । యబలయెవ్వరునీవలె *
నడుగరిట్లు॥౭౨॥ ఉ॥ ఎప్పుడునాదుసన్నిధిని * నిందునిభానన నీవునిల్చి
యీ। యిప్పటియట్లు మోక్షమును*నెన్నఁడుఁగోరవుకోరియుండిరన్।
జెప్పుమునీవుమున్నుధరఁ*చేసినపుణ్యమువెంటనంటిని।న్నిప్పుడుపొం
దెనయ్యదియు * నీకునుగల్గెనమోఘవాక్యమున్॥ఉ॥ లోకమునందు
సంపదయు * లోభములేకయ పుత్రిపుత్రులన్। గైకొనఁగోరుచుందు
దురు * గాకలమోక్షముగోరరెవ్వరున్ । నీకిటువంటివాంఛితము *
నిక్కముగల్గుటచోద్యమయ్యెడిన్। బ్రాకటమైననీవిమల * భాగ్యమె
భాగ్యముహంసగామినీ॥ ౭౪॥ క॥ రత్నములుదినుమరాళము। రత్న
ములనెగానితినునె*రాళ్ళనుగాంతా। రత్నమనీవటుముక్తికి। యత్నిం
చినదానవితర * యత్నములేకే॥ ౭౫॥ తే-గీ॥ పడఁతినీప్రశ్న త్రైలో
క్య*పావనంబు। అబ్జభవునకుఁదలపోసి*యడుగరాని । గోప్యమడిగితి
వదియెనా * కోర్కెఫలము । నదియెనాపెద్దనిక్షేప * మగుధనంబు॥
౭౬॥ క॥ సంతతము నీవునాయెడ । నెంతయునెడతెగనిభక్తి * నెఱి
పుదుగానన్। ఇంతకు నీపైదయ నది। యెంతటిమర్మంబునైన*నెఱిఁ
గింతుఁదగన్॥౭౭॥ ఉ॥ మానిని విత్తమూదిగ స*మస్తముకంటెనుహె
చ్చుప్రాణముల్।ప్రాణముకంటెనెక్కువగు * బ్రహ్మపదంబగుజ్ఞానవిత్త
మున్। బ్రాణమునైననిచ్చుటకుఁ * బ్రాణములొప్పునుగానియేరికిన్ ।
జ్ఞానధనంబు నిచ్చుటకు * సాధుజనంబులు నైప రెంతయున్॥ ౭౮॥

క॥ గురుభక్తిలేనివారికి। నెఱిఁగింపఁగఁ బోల దిట్టి * నిర్మలబోధన్ ।
గురుభక్తి గుదిరియుండిన। నరునకు నుపదేశమీయ * నగునార్యుల
కున్॥ ౨౯॥ చ॥ భువినెవరైనఁగారణముఁ * బొందఁగఁబెద్దల నాశ్ర
యించినన్ । బ్రవిమలచూడ్కి వారినిజ*భావముశోధనఁజేసియాదగున్
నవరసమొల్కు భూతలము * నందునవేయ ఫలించుసస్యముల్।చవిటి
పొలంబుదున్నియును * జల్లినవిత్తులు పండనేర్చునే॥౩౦॥ ఉ॥ గారవ
మొప్పఁబెద్దలనఁ*గాశతవృద్ధులుగారు విద్యలన్ । మీఱినవారుగారు
భువి*మేటినగంబులయంత లేసివా। రారయఁగారుజ్యేష్ఠకుల* మందు
జనించినవారుగారు సూ। ధారుణిఁదప్పుఁదా మెగను* ధన్యులెపెద్దలు
నిశ్చయంబుగన్॥౩౧॥ ఆ-వె॥ అట్టివారివెదకి * పట్టియనుదినము। దేవ
దేవుఁడంచుఁ * దెలిసిగురుని । సేవఁజేసియతని * చిత్తంబుమెప్పించి।
ముక్తిగాంచవలయు * మొదలునరుఁడు॥ ౩౨॥ క॥ వనితామణిమోక్ష
మునకు। ననువొందఁగవలయుసాధ * నంబులునాల్గున్।మును దెలియ
నగునుగావున వినిపించెద వినుమువాని * విధమునుదరుణీ॥ ౩౩॥
సీ॥ వరుస నిత్యానిత్య * వస్తువివేకంబు - గలిగియుండుట యొందు*
ఘనముగాను । ముత్రపమననిష్ఠ * ములకాసలేనట్టు - లిహాస్వర్గ
భోగేచ్ఛ * లేనిదొకటి। సంతతంబుశమాది * షట్కమసంపత్తి -
నలువొందుచుండెడు * నదియునొకటి। మోక్షంబుకొఱకున*పేక్షిం
చుటయు ముము - క్షుత్వమననొకటి * సరవినిట్టి॥ తే-గీ॥ సాధన
చతుష్టయంబిల * సంభవించు। నరుఁడెయధికారిమోక్షంబు * నకును
నర్హుఁ। డట్టిశిష్యునిఁగనిపెట్టి*యాదరమున। వరదయామతిబోధించ*
వలయుగురుఁడు॥ ౩౪॥ క॥ మేధావియైననీకును । సాధనసంపత్తి
గలదు*సద్గుణములకున్। సాధుచరిత్రవునీవీ। బోధకుఁదగుదింతివిమల*
బుద్ధివిగానన్॥ ౩౫॥ క॥ నాగురుఁడగుసాందీపుని । వేగమెమదినిల్పి
యిపుడు*వెలఁదిరొనీకున్।నాగురుమర్మముఁజెప్పెద।బాగుగవినుమింక
భక్తి * భావముమెఱయన్॥ ౩౬॥ తే-గీ॥ అవనిఁబరికించిచూడమా*
నవులయందుఁ। దీవ్రమోక్షేచ్ఛయనియును * దిరముగాను। మంద
మోక్షేచ్ఛయనియు న * మరును రెండు। తెఱఁగులగుచుఁ దద్విధ
ములఁ * దెలియుమీవు॥ ౩౭॥ సీ॥ ఇల్లుగాలుచునుండ * నింటిలోని

మనుజుం - డెంతతీవ్రముబైటి * కేగఁగోరు। ఘోరకాననమందు *
దారిదప్పిననరుఁ * డెంతతీవ్రముమార్గ * మెఱుఁగఁగోరుఁ। బులివెంబ
డించిన*బులివాతఁబడకుండ-నెంతతీవ్రముమర్త్యుఁ*డేగఁగోరు। బాము
పైకొనిరాఁగఁ*బాముచేఁజిక్కక - యెంతతీవ్రమునరుం * డేగఁగోరుఁ,
తే-గీ॥ జోరులు దఱుమఁజిక్కక * చోరులకును। నెంతతీవ్రంబుమాన
వుం*డేగఁగోరు। నంతవేగంబునను బ్రయ * త్నంబుఁజేయు। నదియె
పో తీవ్రమోక్షేచ్ఛ * యనఁగఁబరఁగు॥౭౭॥ క॥ ఒకకాలంబున నిమ్మ
హి। నొకనికినీబాధలెల్ల * నొదవకయున్న। న్నొకయొకనికినొకయొక
తఱి। నొకయొకయాపత్తుగలిగి*యుండఁగవచ్చున్॥౭౮॥ ఆ-వె॥ వనిత
మోక్షమునకు * వలయుసాధనములు। సంఘటింపఁబడక * జనుఁడు
మోక్ష। మతులితముగఁగోరు*నదిమందమోక్షేచ్ఛ। యంచుఁదెలియ
వలయు * హంసగమన॥ ౮౦॥ సీ॥ తాపత్రయాగ్నియీ * తనువుద
హించుచే - యిల్లంటుకొనికాలు * టెంచిచూడఁ। దన్నుఁదానెఱుఁ
గక * తనువుదానను కొంటె-దండకాటవిదారిఁ * దప్పుటయును। బొరి
మనమింద్రియం * బులవెంటఁ బాఱుటే - వ్యాఘ్రంబుదఱుముక *
వచ్చుటయును। నరయదుర్విషయంబు * లందువర్తించుటే - సర్పంబు
గదియుట * సారసాక్షి॥ తే-గీ॥ యెలమిఁగామాదిషడ్వర్గ * ముల
యనంగ। నలరు దొంగలుపొంచుక*నావివేక। మనెడు ధనమును నప
హరిం * పంగఁజూచు। నదియెచోరులు దఱుముట*యతివవినుము॥
౮౧॥ ఆ-వె॥ ఇట్టిబాధలెల్ల*నేకకాలంబున। సంభవించునట్టి*జనుఁడు
గాని। యట్టిశ్రమలఁబాపు*నట్టిసద్గురుఁజేరి। గట్టిగానుముక్తిఁ*గాంచఁ
బోఁడు॥౮౨॥ క॥ హరియిట్లుతెల్పఁగావిని। హరిణేక్షణపల్కెనిట్టు *
లంభోజాక్షా। పురుషార్థమెన్నిభంగులో। యెఱిఁగింపుమటన్నఁగృష్ణుఁ*
డిట్లను సతికిన్॥ ౮౩॥ సీ॥ గణుతింపధర్మార్థ * కామమోక్షములనఁ -
బురుషార్థములునాల్గు * భువిఁజెలంగు। యాత్రదానవ్రత * యజ్ఞంబు
లాది స - త్కర్మములేసేయుట * ధర్మమయ్యె। గాయంబుమిక్కిలి *
కష్టించియుక్తిచే - నర్థంబుఁగూర్చుట*యర్థమయ్యె। బొలఁతులకూ
టంబుఁ * బుత్రులసౌఖ్యంబుఁ - గావలెననువాంఛ * కామమయ్యె।
ఆ-వె॥ నీత్రివర్గమరసి * నిత్యంబుగాదని। యచలగురునిభక్తి * నాశ్ర

యించి। బ్రహ్మమెఱిఁగి జన్మ * బంధంబులను బాసి। ముక్తిఁగనుట
బుధులు * మోక్షమండ్రు॥ ౯౪॥ క॥ పురుషార్థంబులనందగుఁ। బోరిఁ
బోరి ధర్మార్థ కామ*ములనెడుమూఁడుర్। బరమపురుషార్థమనఁగను।స్థిర
ముగ మోక్షంబెయంచుఁ * జెప్పుదురార్యుల్॥ ౯౫॥ తే-గీ॥ చెలఁగి
ధర్మార్థకామముల్ * జీవకోట్ల। కన్నిఁటికి నాచరింపంగ*నగునుగాని।
మహిని మోక్షంబుమాత్రంబు*మానవులకు। నాచరించఁగఁదగినది*
యరసిచూడ॥ ౯౬॥ క॥ జన్మములకెల్లమానవ। జన్మంబెయెఱుకగల్గు*
జన్మమగుటనీ। జన్మమునముక్తిఁగాంచక। జన్మముకడతేరదన్య*జన్మము
లందుర్॥ ౯౭॥ క॥ జన్మంబురోసియింకనే। జన్మంబును రాకమున్నె *జనుఁ
డుపరమునర్।దన్మయమందినమఱిలను।జన్మంబులు లేకజన్మ*సాఫల్యమ
గుర్॥ ౯౮॥ క॥ నరజన్మమెత్తినందుకు। సరగునమోక్షంబుగనుటె * సా
ర్థకమరయర్।మఱియితరజన్మములలోఁ।బరమరయఁగ దెల్విలేక*ప్రచు
రించుటచేర్॥ చ॥ గరిమసమస్తజీవతతి*కంటెను మానవులెక్కుడందు
నర్। గరితలుగాను బుట్టుటల*కంటెను బూరుషజన్మమెక్కుడౌఁ।బురు
షులయందు శాస్త్రపరి*బోధనపండితులెక్కుడందునర్ ।మఱినతిగోప్య
మైన పర * మార్థమెఱింగిన ధన్యులుత్తముల్॥ ౧౦౦॥ ఆ-వె॥ పరమ
గురునికరుణఁ * బడసినసతులైనఁ। బురుషులైనషండ * పురుషులైన।
మాచకమ్మలైన * మందులు చండాలు। రైనముక్తిఁగందు * రంధు
లైన॥ ౧౦౧॥ చ॥ తనువుపటుత్వముర్ వదలి*తాతయునైవెతగాకము
న్నుగా। ఘనకఫవాతపైత్యములు * గప్పి మతిభ్రమరాకమున్నుగాఁ।
బనివడికాలకింకరులు * పైఁబడితన్గొనిపోకమున్నుగాఁ। గనఁదగునా
పరాత్మునిఁ * గాయముఁ బాయకయున్న యంతలోర్॥ ౧౦౨॥ ఆ-వె॥
సతులసుతులహితుల * సంపదఁజుట్టాల। నమ్మితన్నుఁదాను * నరయ
లేక। భ్రాంతినొందువాని * బ్రదుకెల్లను బిసిని। కాయలోనిపురుగు*
గతిదలంప॥ ౧౦౩॥ ఉ॥ గట్టిగమోక్షకాంక్షయును * గల్గనె గల్గదు
భూమినేరికిర్। అట్టి విచారమెవ్వనికి * నైననొకానొక వేళఁగల్గినర్।
గట్టడినేఁడురేపనుచుఁ*గాలముఁబుచ్చును గానిముక్తిచేఁపట్టఁడుబ్రహ్మ
కల్పములు*పాయకతా నిలనుండునట్లుగర్॥ ౧౦౪॥ క॥ మంచివచన
ములువిషమగు। మించినకోపంబువచ్చు * మిక్కిలిపగసా। ధించెదరు

బుధులపల్కులు। మంచివియని తెలియ లేరు*మందాత్ములొగి౯ ॥౧౦౫॥
సీ॥ కప్పకునిలఁగల * కమలతేనియ లేల - పందికిఁబన్నీరు * గంధ
మేల। పండునకునుమంచి * సౌందర్యవతియేల - నంధునకు మెఱుఁగు*
టద్దమేల। కుక్కకునపరంజి * కుళ్లాయియేలకోఁ - తికినిముత్యాలప*
తకమునేల। కొమరొప్పఁబిడుదుకు * గోక్షీరమదియేల - పేడపురుగు
నకు * బెల్లమేల॥ తే-గీ॥ చెవిటివానికిమృదుగాన * చవులవేల। రూఢి
ఖరమునకునమృత * రుచులవేల।తివిరిగాడిదకునుదివ్య * తీర్థమేల।మంకు
జనులకునిజమోక్ష * మార్గమేల॥ ౧౦౬॥ ఆ-వె॥ జంబుకమునకేల *
స్వర్గలోకంబును। గలయరత్నములుపి*కంబు కేల।మాచకమ్మకేల * మ
దనశాస్త్రంబును। మందమతులకేల * మంచిబోధ॥ ఉ॥ చోరజనంబు
లందఱినిఁ * జోరులచందముగందు రెంతయు౯ । జారులునెల్లవార
లను*జారులకై వడిఁజూతు రెన్నఁగాఁ। గ్రూరులుసర్వమానవులఁ*గ్రూ
రులరీతినినెంతురట్టులే।సారెకుఁగాంతురజ్ఞులును*సద్గురుల౯దమవంటి
వారుగ౯॥ ౧౦౭॥ సీ॥ మాటనేర్చినవాని * బూటకుండనియంద్రు -
మాటలాడకయున్న *మందుఁడంద్రు।సతులతోభాషింప*జారపురుషుఁ
డంద్రు - జారుండుకాకున్న * షండుఁడంద్రు। వన్నెవల్కలుగట్ట*బలు
హాయల్‌గాఁడంద్రు-గుడ్డమాసినవాని*మడ్డియందు।కరయఁజక్కని
వాని * నందగాఁడందురు - రూపిగాకున్నఁగు * రూపియంద్రు॥ తే-గీ॥
కల్లనిజమంద్రునిజమును*గల్లయందు। రిట్లునరులకుసహజంబు * లట్లు
గాన। సర్వజనులకునిలలోన * సమ్మతముగ। నడువ లేరెంతసాధులు*
నైనజగతి॥ ౧౦౮॥ చ॥ జనములకెల్లలోకమున*సమ్మతిగానడువంగఁ
గోరిదా।నెనయఁగనెల్లవారిమది*కింపుఘటింపఁగఁబోవనెంచువాఁ।డను
పుగవెండినెవ్వరిని*హర్షమునొందఁగఁజేయలేకతాఁ। జెనఁటి యనంగ
నన్నిఁటికిఁ*జేటువహించినబుద్ధిహీనుఁడౌ॥ ౧౧౦॥ ఉ॥ మంచిగుణంబు
లేమికిని* మంచినిఁజెడ్డగఁజెడ్డమంచిగా। నెంచుచునుంద్రు లోకమున*
నెంచిననేమగుఁజెడ్డ చెడ్డయే। మంచియు మంచియేయగును * మానిని
యిత్తడికాంచనంబుగా।నెంచిననౌ నెహేమమును*నిత్తడిగాఁగననౌ
నెయట్టుల౯॥ ౧౧౧॥ ఆ-వె॥ పేడబెల్లమనిన * బెల్లంబుగాఁబోదు।
పేడయన్నగుడము*పేడగాదు। పేడపేడెయగును*బెల్లంబుబెల్లమే।

జ్ఞానిజ్ఞానెమూఢ * జనుఁడుజనుఁడె॥ ౧౧౨॥ క॥ జ్ఞానులనుజూచియిల
న। జ్ఞానులుదెగడుదురుబుద్ధి* జాడ్యతదిగువన్। శ్వానములకోట్లు మొ
ఱిగిన। నేనుఁగుపైనున్నవాని * కేమిభయమిఁకన్॥ ౧౧౩॥సీ॥ఘనుని
నీచుండన్నఁ * గాఁబోఁడునీచుండు। ఘనుఁడన్న నీచుండు* ఘనుఁడు
గాఁడు। అంచనుబకమన్నఁ * గొంచకానేరదు - గొంచనంచయనఁగ*
నంచగాదు। అవనిభూషణదూష*ణాదితిరస్కార-ములనయఁగా దేహ*
మునకుఁగాని। యాత్మకు లేవురూ * పాతీతమైనామ - గుణవర్జితంబ
యి*నుదురుకతన॥ తే-గీ॥ నెవ్వరే మన్న నాత్మకు*నేమికొదువ। పరులు
భూషింప లేనట్టి* వాసిరాదు।పరులుదూషింపహెచ్చైన*వన్నెచెడదు।
ధరణినొందరుమోదఖే * దములుబుధులు॥ ౧౧౪॥ క॥ ఎవరేపల్కులు
వల్కిన। నవిసాధులువినియువినని*యట్టులుఁదామీ। భువిననటింతురు
వారలు। భవనాశస్థితులు కేని * భావనులగుటన్॥ ఆ-వె॥ తెలివమా
నవులకుఁ*త్రికరణశుద్ధిలే। నట్టికతనమాయ*నమ్మివివిధ। గతులపెక్కు
నమ్మ * కంబులుచెప్పిన। నమ్మలేరునిజము * నళిననేత్ర॥ ౧౧౫॥ ఉ॥
చచ్చినవారెధన్యులని*చాలనుతింతురు లోకమందునన్। జచ్చినవార
లున్మగుడ*జన్మకురాకయెయున్న ధన్యులే।చచ్చియునెప్పటట్టులనె*
జన్మములెత్తుదురట్లుగావునన్। జచ్చియుఁజావకుండియును*సౌఖ్యము
లేదిఁకముక్తిగానకే॥ ౧౧౬॥ ఆ-వె॥ గురునిఁజేరఁగల్గి * గుట్టుగాఁబర
మును దెలియఁగల్గిగొప్ప*తెలివిగల్గి। మొనసిమృగములట్లు*మూఢులై
మిన్నక। చెడుదురల్పమతులు*సిద్ధముగను॥౧౧౭॥క॥ విహగములుమిం
టికెగయుట। సహజంబగు నేలదూరఁ*జాలవటువలెన్। బహువిధమా
యలఁబొందుట। సహజముమూఢులకుముక్తి*సాధ్యంబగునే॥ ౧౧౮॥
సీ॥ అర్థంబుభూములు*నార్జించఁగాదీఱు - ఘనమందిరంబులు* గట్టఁదీ
ఱు।సతులతోభోగింప * సౌఖ్యమొందఁగఁదీఱు - సుతులవేడుకలెల్ల*
జూడఁదీఱుఁ। బుట్టుముచ్చటలను*బ్రొద్దుపుచ్చఁగఁదీఱుఁ। దిరముగాఁ
బొరుగిండ్లు*దిరుగఁదీఱుఁ। గార్యంబుఁబెంచుచుఁ * గలహమాడఁగఁ
దీఱుఁ। జెలువుగాఁబరుల దూ*షింపఁదీఱు॥ తే-గీ॥ కోరినీచాత్ములను
నెల్లఁ*గొల్వఁదీఱు। మందమతులగునీదుష్ట * మానవులకుఁ। బవలు
రాత్రియుఁదీఱదు * పరమగురుని। చెంతఁజేరంగఁబరమార్గ * చింతఁ

జేయ॥ ౧౨౦। చ॥ భరిత తటాకనీరములు * పానముఁ జేయకవాయ
సాదులున్। ముఱిగినకుంభతోయములు * మోదమురంజిల గ్రోలు
కైవడిన్। నరులునుజన్మకర్మములు * నాశమొనర్చెడి ముక్తివీడి
యున్। బరి రినీచమార్గములఁ బట్టినటింతురు కర్మతంత్రులై॥ ౧౨౧॥
తే-గీ॥ మనుజులందఱునొకలోక * మందెయున్న। నొకరిలోకంబులో
నెన్న *నొకరుగల్గ। రెవరిలోకంబువారిదే * యెంచిచూడ। నొక్క
లోకంబులోనుండ * నోపరెవరు॥ ౧౨౨॥ క॥ చోరులకుఁ జోరచిం
తయు। జారులకును జారచింత * జగతీశులకున్। బోరాటంబుల
చింతయు। సారవివేకులకుఁ గల్గు * సద్గతిచింతల్॥ ౧౨౩॥ చ॥ కమ
లమునందుఁదేనియకుఁ * గాఁబహుదూరముపోయి గ్రోలునా। భ్రమ
రమునట్లబోధగను*ప్రాజ్ఞుఁడుతా గురుఁడెందునుండినన్। గమలము
మీఁదఁగప్పయును * గల్గిమరందముగాననట్టులా। కుమతులెఱుంగ
లేరు పర * గోప్యముసద్గురు చెంత నుండియున్॥ ౧౨౪॥ ఆ-వె॥ గురు
ని మహిమఁదెలియు*గురు భక్తునకుఁగాక। యితర జనులకెల్ల*నేమి
యెఱుక। తేనెతెరలజాడఁ * దేనెటీఁగకుఁగాక। యితరమక్షికాళి *
కెఱుకపడునె॥ ౧౨౫॥ క॥ మెఱుఁగైనయద్దమంధుని। కరమునఁదాల్చి
యును మోము*గనలేనట్లా। గురుఁడుతమయొద్దనుండియు। గురు
మర్మముదెలియలేరు * గ్రుడ్డిజనంబుల్॥ ౧౨౬॥ ఆ-వె॥ కడఁగిదర్పణం
బె*గాననియంధుండు। తనదువదనమెట్లు*గనఁగనేర్చు। గురునిఁగాన
లేని*గ్రుడ్డివాఁడిలలోనఁ। బరముగాంచుటెట్లు * పంకజాక్షి॥ ౧౨౭॥
క॥ అద్దముపొడఁగను వానికి। నద్దంబునవానిరూప * మగుపడువిధ
మా। పెద్దలఁబొడఁగనినప్పుడె। తద్దయుఁబరమార్థమతఁడు * తప్పక
గాంచున్॥ ౧౨౮॥ క॥ అనసద్గురుని ప్రభావం। బన నెట్టిదొ దెల్పు
మనినఁ * బడఁతికినిదయా। వనధియగు నందనందనుఁ। డును జెప్పఁ
దొడంగె నిట్టు*లున్నవిధంబున్॥ ౧౨౯॥ క॥ గురుఁడనఁగాఁ బరుడ
నఁదగుఁ। బరుఁడనఁగాఁ గేవలాత్మ * పరిపూర్ణుఁడగున్। బరిపూర్ణుఁ
డె గురుఁడగు న। గ్గుఱుతెఱిఁగినవాఁడె జగతి * గురుఁడగుఁదరుణీ॥
౧౩౦॥ క॥ పరుఁడగు నాభగవంతుని। వరుసఁదెలుపునతఁడెసుగురు *
వరుఁడెవఁడైనన్। గుఱిదెల్పనేరకుండిన।గురుఁడెట్లగు వాఁడు పశువు*
కుంభినిలోనన్॥ ౧౩౧॥ ఆ-వె॥ తల్లిదండ్రిగురుఁడు * దైవంబనుట
చేతఁ। దల్లిబిడ్డకెట్లు * తండ్రిఁజూపు। నట్లుగురుఁడెశిష్య*నకుదైవ
మును జూపు। వలయుఁజుమ్మియట్టి*వాఁడెగురుఁడు॥ ౧౩౨॥ క॥ గురుఁ

డే యజహరిరుద్రులు । గురుఁడేయింద్రుండు దివిజ * కుముదా
ప్తరవుల్ । గురుడే సర్వమయుండగు। గురునకు నితరంబులేదు *
కోరివెదకినన్॥ ౧౩౩॥ క॥ పరమాత్మ నెఱుఁగఁజేసిన । గురుఁడే
భగవంతుఁడిలను* గుర్తెఱిఁగినయా । గురుఁడే యిహపరములకును ।
గురుఁడగు నాగురుఁడెగురుఁడు * గురువులకెల్లన్॥ ౧౩౪॥ క॥ గురు
మహిమదెలియనెవ్వరి । తరమగు దేవతలకైనఁ * దలఁపఁగవశమా ।
హరిహరధాతలునాదిగ । గురుపదమే గతియటంచుఁ * గొల్తురనిశ
మున్॥ ౧౩౫॥ తే-గీ॥ మఱిగువర్ణంబు మొదలింటి * మాయదాని ।
నడఁచునట్టిది యగురువ*ర్ణంబుగాన। నరయగురుశబ్దమిాభువ * నం
బులకును । మించినది గురుమహిమను*నెంచవశమె॥ ౧౩౬॥ క॥ నరుఁ
డెట్లుగురుండగునని । గురుమర్మము దెలియలేక * కూయుకుమతు
లా । నరులకుఁదెల్పునె పశువులు । నరయంగాఁ దెల్పకున్న * నరుఁ
డేగురుఁడా॥ ౧౩౭॥ తే-గీ॥ నరుఁడుగురుఁ డెటులగునని * యనిన
వినుము । నరకులంబునఁ బుట్టిన * నరుఁడులెస్స । గురుకులంబున
మెలఁగిన*గురుఁడెయగును । నన్యజాతికీటం బళి*యైనయట్లు॥౧౩౮॥
క॥ ధరణిసమస్తముకంటెను । గురుఁడధికుఁడు స్మరణకంటె * గుఱి
యధికంబౌ । గుఱికంటె మిగులుముక్తియుఁ । బరికింపఁగముక్తికం
టె * భక్తిఘనంబౌ॥ ౧౩౯॥ క॥ ముక్తికి మూలముభక్తియ । భక్తికి
మూలంబుముక్తి * బ్రహ్మాదులకున్ । ముక్తికి గురుఁడేమూలము ।
భక్తియె లేకున్నముక్తి * పడయఁగవశమే॥ ౧౪౦॥ చ॥ సురముని
యక్షకింపురుష*సోమ దివాకర మూర్తులింద్రుండున్ । గరుడభుజంగ
దిక్పతుల * కల్మషదానవసిద్ధసాధ్య కి । న్నరవర రాజమంత్రులును*
నాదిసమస్త జనాళికీయిలన్ । బరమ పవిత్రమైనదియు * భక్తియగా
దె తరింపఁజేయఁగన్॥౧౪౧॥ క॥ గురుమహిమ యిట్టిదనుచును।గుఱు
తెఱుఁగఁగలేకమాయ*కూపములోనన్ । జొరనయ్యెనరులుసద్గురు।
మఱుగెఱుఁగకయున్న ముక్తి * మార్గముగలదే॥ ఆ-వె॥ నిక్కమైన
గురుడు*చిక్కుటకష్టంబు।టక్కుగురులకెందు*లెక్కలేదు।అరయకాం
చనంబు*నరుదులోకంబునఁ। గల్లపసిడిలేదె*కొల్లగాను॥ తే-గీ॥ వసుధ
దైవంబుఁజూపిన* వాఁడెగురుఁడు । గనినయాతండె శిష్యుండు*గడఁక
తోడఁ।బరముఁజూపింపకయెగాఁడు*పరమగురుఁడు।చూడకయెగాఁడు

శిష్యుండు*సుస్థిరముగ॥ చ॥ సరసులచెంతఁజేరినను*సాధుగుణంబులు
వచ్చునేరికిన్ । దురితజనాళిసఖ్యమున*దుష్టగుణంబులుగల్గు నెట్లన ।
న్నిరవుగ వర్షబిందువులు*నిల్చినరేగడనీరు తియ్యనా । సరసిజనేత్ర
చౌటఁబడి * చవ్వలు నుప్పులుగావె యిమ్మహిన్॥ ఆ-వె॥ సలిలతైల
చేల * ములకుసుగంధసూ । నములచెల్మితావి*నవివహించు । సరణి
సూరిజనుల*సాంగత్యమునవచ్చు।సద్గుణములుమూఢ * జనులకైన॥
౧౪౬॥ క॥ ఖ్యాతిగ సద్గురుజేరియు । జ్యోతినిఁగనలేక బాహ్య*చో
ద్యంబులచేఁ।గోఁతులవలెఁ జరియించెడి।పాతకులకు నెట్లుగల్గు*భవ్య
గుణంబుల్॥౧౪౭॥ క॥అనితెల్పగురుమహాత్మ్యము।వినియద్భుతమంది
బ్రహ్మ*విద్యయనంగా।వినియుందు నెట్టిదోయది।వినిపింపు మటన్నసతి
కి*విభుఁడిట్లనియెన్॥ ౧౪౮॥ ఆ-వె॥ అబలబ్రహ్మవిద్య*యనఁగ వేఱొ
క్కటే । బ్రహ్మనెఱుఁగునదియె*బ్రహ్మవిద్య । యదియ సర్వకర్మ*లడు
గంటఁగాఁజేయు । జన్మబంధములను*సమయఁజేయు॥౧౪౯॥ క॥విద్య
లకెల్లనుమొదలిటి । విద్యయుభావింపబ్రహ్మ*విద్యయెయిఁకనే । విద్య
లు దానికిసమమగు । విద్యలసరయంగలేవు*విశ్వములోనన్॥ ౧౫౦॥
ఆ-వె॥ బ్రహ్మపదముదెలియఁ*బడువిద్యయదిగాన।బ్రహ్మవిద్యయంచుఁ*
బలుకఁబడియె।నట్టివిద్యగురుని*యనుమతివడసిన।యతఁడెబ్రహ్మవేత్త*
యనఁగనొప్పు॥ ౧౫౧॥ క॥ అఱువది నాలుగువిద్యలు । వరుసగ మ
ద్గురునివలనఁ*బడసితినేనున్ । మఱియావిద్యలచేతను।బరమార్థముఁ
బడయరాదు*పరికింపంగన్॥ ౧౫౨॥క॥ ధర నావిద్యలనేర్చిన।నరులకు
నెటువంటిపనులు*నగుఁ గావున నా।గిరినొక్క వ్రేలనెత్తితి । విరివిగ
నేనింకవట్టి*విద్యలగాదే॥ ౧౫౩॥ తే-గీ॥ అట్టివిద్యలచేఁ గాదె * య
రయఁబదియు । నాఱువేలగు గోపిక*లందఱికిని । నన్నిరూపులఁ దోఁ
చితి * నాకునింక । సాధ్యమునుగాని పనులెవ్వి * జగతిలేవు॥ ౧౫౪॥
క॥ కలయేవిద్యలు సర్వము । కలయే యెంతంత పనులు * గావించిన
నా । కలఁబాయఁ ద్రోయనట్టిది । గలయంగా బ్రహ్మవిద్య * గాంచఁగ
వలయున్॥ ౧౫౫॥ తే-గీ॥ బ్రహ్మసూత్రంబుగాన నా * బ్రహ్మవిద్య ।
సాధ్యమునుగాక విడిచిరి * సర్వజనులు । సకల కార్యంబులును జే
య*శక్తియున్నఁ । బడయరాదది మర్మంబు * బ్రహ్మవిద్య॥ ౧౫౬॥

క॥ సురపతికి వాణిపతికిని । సిరిపతికిం గౌరిపతికి * సిద్ధపతులకున్ ।
ధరణీపతులకు మించిన । దరయంగా బ్రహ్మవిద్య*యగునుమృగాక్షీ॥
౧౫౭॥ తే-గీ॥ వివిధకార్యంబులును జేయు * వేళనరులు । బ్రహ్మవి
ద్యయె యిదియని*పల్కుటరయఁ । బరఁగ నీపను లివియెంత*బ్రహ్మ
విద్య । నాచరింపంగ రాదను * నర్థమయ్యె॥ ౧౫౮॥ క॥ కోటికి వి
ద్యలునేర్చినఁ । గూటికె సరిపోయె బ్రతుకు * కుంభినిలోనా । నాటక
ధారునిఁ గన్గొను।పాటియదే బ్రహ్మవిద్య*వడయంగఁదగున్॥ ౧౫౯॥
క॥ పట్టినను బ్రహ్మవిద్యయె । పట్టంగవలెఁ గానియితర*పామరవిద్యల్
పట్టుపడి పారలమరలను । బుట్టయుఁ జావంగనేల*బూటకమాయన్ ॥
తే-గీ॥ కాననా బ్రహ్మవిద్యను * గాంచుటకును । సర్వకాలంబు గురు
సేవ*సల్పునట్టి । ధన్యులకుఁ గాక యన్యుల*తరమెతెలియఁ। గష్ట సా
ధ్యమా నావిద్య * ఘనులకైన॥ ౧౬౧॥ ఉ॥ చక్కఁగనిల్చి ధీరతను*
సద్గురుబోధను నాయుధంబుచేఁ।గుక్కనుజంపి సూకరము*గూల్చి మ
దేభము గెంటిముప్పిరి।న్నుక్కడఁగించి శత్రువుల*నోపిక నార్వురఁ
ద్రుంచిమాయలన్ । జిక్కక మేటిబ్రహ్మమును * జెందినవారికిఁ గల్గు
మోక్షమున్॥ ౧౬౨॥ ఆ-వె॥ తాపత్రయములఁ * దల్లడిల్లుచు నీ
ష । ణత్రయములవాస * నాత్రయాంబి । బద్ధులగుచు నరులు * బడలు
త్రయావస్థ । లోనఁజిక్కిమాయ * గానలేరు॥ ౧౬౩॥ చ॥ తనువుల
నెంత పెంచినను*దప్పదుమృత్యువు వచ్చునెప్పుడో । కనుపడఁగుక్క
నక్కలకుఁ*బొల్పడుమేనులనమ్మి యిమ్మహిన్ । మనుజులు మాయలం
బడుట*మత్తికముల్ మధుకాంక్షఁబోయిరసం। దెనయఁగఁజొచ్చియు
న్వడల * నేరక చిక్కిన చందమౌఁదుగన్॥ ౧౬౪॥ సీ॥ సకలయత్న
ములాది * సతతంబుఁ జేయుట - నఖిల విద్యలునేర్చి * యధికుఁడౌ
ట । భూమిఁబండించుట*భూచక్రమేలుట - కొలువుండుటలు పొట్ట*
కూటికొఱకె । గానిముక్తికిఁగాదు*ఘనముగా బహురీతిఁ-గడగండ్లు
పడనేల * కడుపుకొఱకుఁ । గ్రిమిమృగ పశుపక్షి * కీటకాదులునెల్లఁ-
జెలఁగి యేయత్నముల్ * నేసిబ్రతుకుఁ। గానవాంఛింపకయె తృప్తి*
గలుగునంచు । గట్టిగాఁ దెలిసి శరంబు * గానకున్న । నితరజీవులకం
టెను*నెన్ననరుఁడు । నధముఁడేకాని పరికింప*నధికుఁడగునె॥ ౧౬౫॥

ఉ॥ తల్లులుదండ్రులాప్తులును - దారసుతాదులు బంధుసోదరుల్ । కల్లగు
నేరికెవ్వరికి - గారడిమాయ యటందురందఱుఁ । గల్లనియన్నమాత్ర
మున * గారడిమాయయు వీడఁబోవునే । కల్లనిజంబెఱుంగకయె - గంధ
గజేంద్ర సమానగామినీ ॥ ౧౬౬॥ క॥ అనిశఁ ద్రిమూర్తులె దైవము ।
లనివారల నామజపము * లను ప్రతిపూజా । ధనలునొనర్తురుఫలమే ।
మనియడిగిన సతికిఁగంప - హరుఁడిట్లనియెఁ ॥ ౧౬౭॥ తే-గీ॥ దైవమొ

దైవలక్షణము.

క్కండె యనుమాట * ధాత్రిలోన । సహజముగఁ బల్కుదురుసర్వ *
జనులునతఁడు । నెందునున్నాఁడొ యెవ్వరు * నెఱుఁగ లేరు । అతనిఁగానక
జగమెల్ల * నంధులైరి ॥ ౧౬౮॥ చ॥ విరివిగ బ్రహ్మదేవుని * విష్ణు
నియల్లనియీశ్వరుండునా । హరిహయుఁడంచు విఘ్నపతి * యంచుఁజె
హోవయటంచు భూతముల్ । తరణి సుధాకరాద్యనల * తారలశక్తుల
నాదిగొల్తురి । త్తెఱఁగున నంతకంబెమును * దేవుఁడు లేకయెవీరుపుట్టిరే ॥
౧౬౯॥ క॥ శ్రీవనితయంచుఁ గొందఱు । భావింతురు వాణియంచుఁ *
బలువురు గౌరీ । దేవియని కొందఱిట్లుగ । వేవేలవిధంబులాత్మ * విధము
దెలియకఁ ॥ ౧౭౦॥ ఉ॥ పట్టుగమూడు మూర్తులును * భాను నిశాకర
దేవదైత్యులుఁ । దిట్టత సాగరంబులును * దిక్పతు లల్లయుఁ దారలుఁ
గిరుల్ । నెట్టనఁబంచభూతములు * నింద్రుఁడెహోవయు నెల్లలోకముల్ ।
పుట్టకముఁ గలందుసుమి * పుట్టునుగిట్టును లేనిదైవముఁ ॥ ౧౭౧॥ సీ॥
అజుఁడుదైవంబని * యనుటమాత్రమెగాని - వానికిజన్మరూ * పములు
గలవు । విష్ణుదైవంబని * వివరించుటేగాని - వానికిజన్మరూ * పములు
గలవు । శివుఁడుదైవంబని * చింతసేయుటెగాని - వానికిజన్మరూ *
పములుగలవు । మఱియునింద్రునిదైవ * మనివచించుటెగాని-వానికి
జన్మరూ * పములుగలవు ॥ తే-గీ॥ దలఁపఁగాను మీనాద్యవ * తార
ములును । దైవములనజన్మము లవ * తారములకుఁ । గలవగుట జన్మ
రూపముల్ * గల్గినట్టి । వారలెవ్వరుగారుదై * వములుజగతి ॥ ౭॥ చ॥
పరఁగనెహోవయాదిఁజను * పండొకటిం దినకన్నఁ దిన్నచో । సరగున
నాతనిన్నతని * సంతతి పాపులుగా శపించుటఁ । నరకమునుండి సద్వ్ర
తుని * నక్రమవర్తికి మోక్షమిచ్చుట । స్మరయఁగదైవ మెట్లగును *

నాతఁడుమేను వహించియుండఁగన్‌॥ ౧౭౨॥ చ॥ వరుసగనల్ల వేదము
లు వ్రాసి బ్రహ్మదు కిమ్మటంచుఁదా। నిరవుగ దేవదూతలకు*నిచ్చిన
భంబుననుండిపంపుటన్‌। ధరణిని లేక యుండుటను*దైవముతానెటుల
య్యెనాతఁడున్‌। దిరముగ నింద్రియంబులును*దేహముగల్గిన వాఁడె
చూడఁగన్‌॥ ౧౭౩॥ ఆ-వె॥ ఏమిలేనివాని * కేమియు లేదు సంకల్ప
మున్నయపుడె * గల్గుమనము। మనము గల్గినపుడె * మఱియింద్రియ
ములుండు। నింద్రియంబులున్న*నెగడుఁదనువు॥ ౧౭౪॥ క॥ తనువెపు
డుగలిగియున్నదో। జనియించినవాఁడెయతఁడు*చావునుబొందున్‌।
జననాది మరణములచే। తనుబరఁగిన వాఁడునెట్లు*దైవంబగున్‌॥
౧౭౫॥ ఉ॥ గట్టిగ సర్వజీవులును * గర్మవశంబున జన్మమొందఁగాఁ।
బుట్టినవాని దేవుఁడని*బుద్ధిదలంచుట ధర్మమార్గమే। పుట్టినదెల్లమా
యయగుఁ*బుట్టనిగిట్టని వాఁడు దేవుఁడౌ। నట్టివిధంబు గానకను*నంద
ఱుగ్రుంకిరి మాయవారిధిన్‌॥ ౧౭౬॥ తే-గీ॥ దైవమెవ్వండొ వానినే*
దలఁచవలయుఁ। గానివారలభావింపఁ*గారెవరును। వెలయఁదమతండ్రి
యుండంగ*వేఱెయొకనిఁ। దండ్రిమాటుగభావింపఁ*దండ్రియగునె॥
౧౭౭॥ క॥ శ్రీవిభునినజుని శంభుని। దేవేంద్రుని దేవతలను * దేవు
లటంచున్‌। భావింపనేలతమలో। దేవుఁడు వెలుఁగొందుచుండ*దిన
నిశియనకన్‌॥ ౧౭౮॥ క॥ ఎందునఁజూచిన దేవుఁడు। సందేహము లేక
యుండ*సర్వమయుండై। యెందోకలఁడని వెదకెడి। మందాత్ములకె
ట్లుముక్తి*మార్గముగల్గున్‌॥ ౧౭౯॥ క॥ గురుమూర్తి కరుణలేకయె।
పరతత్వముఁ గాంచరాదు*బ్రహ్మకునైనన్‌। నరులెంత వార్లైనను।
దరమగునే తమకుఁదామె*దర్శింపంగన్‌॥ ౧౮౦॥ క॥ రామా యని
శివశివయని। వేమాఱులునోట గొణఁగి*విపరీతముగా। నేమిఘటించిరి
యాత్మా। రామునిఁగనుఁగొనక ముక్తి*రాదుతలంపన్‌॥ ౧౮౧॥ ఆ-వె॥
అన్నవిన్నమనిన * నాఁకలిదీఱదు। తిననఁగానితుత్తు * దీఱిపోదు।
కాశికాశియనినఁ*గాశికిఁబోరాదు। దీపమన్న వెలుఁగు * రూపుగాదు॥
౧౮౨॥ సీ॥ కూడునీళ్లంటని * వాఁడుదేవుండంద్రు - ప్రీతినైవేద్య
ముల్‌ * పట్టుకెట్లు। దివ్యాన్నములువెట్టఁ * దినునె యాదేవుండు *
దినకున్నఁబెట్టినా*తిప్పలేమి। తమకుఁ బెట్టెడువాఁడు*దైవమే యం

దురు-తాముపెట్టుటయెట్లు*దైవమునకు।దా బ్రమ్మన్న్మయ లోహ * దారుపాషాణాది-ప్రతిమలసేవింప*ఫలముగలదె।బయలుగానక యీ రీతిఁ*బ్రజలుసేయు । చిత్రములనెల్ల మర్కట*చేష్టలను-చు।నింతయును మాని*నిజగురుచెంతఁజేరి । పరముఁగాంచిన మోక్షంబుఁ * బడయ వచ్చు॥ ౧౮౩॥ ఆ-వె॥ దైవమునకు బదులు * దారులోహశిలాది। తతులఁబెట్టికొల్వ*దైవమగునె । పసిఁడికిత్తడినుము-బదులుగాఁ బెట్టి నఁ। బసిఁడియగునె వట్టి * భ్రాంతిగాక॥ ౧౮౪॥ సీ॥ అయమాత్మ బ్రహ్మమా*నను వేద వచనంబు - గలిగియున్నట్టియా * కారణమునఁ। బ్రతిమార్చనముకంటెఁ * బరఁగనాత్మారాధ - నము విశేషంబగు * నట్లుగాన । నాత్మ రూపంబున * నఖిల దేహములందు - భగ వంతుఁడేయుండి * ప్రబలుకతనఁ । దలఁపంగనాత్మ సం * తర్పణంబె పర - మాత్మ సంతర్పణం * బగునుగాన॥ తే-గీ॥ నరులచేఁ గల్పితం బునా * నాత్మలేని । ప్రతిమలర్చించి సంతుష్టి*పఱచుటెట్టు । లిష్టఫల ములు తమకవి*యిచ్చుటెట్లు।నరులచేష్టలు దలపోయ*నవ్వుబాట్లు॥ ౧౮౫॥ ఎ॥ సీ॥ జ్ఞానమార్గమెఱుంగఁ*జాలని జడులచేఁ-బ్రతిమార్చ నంబులు * ప్రబలమాయె । జ్ఞానంబుగురునిచేఁ * గాంచినధన్యులు - ప్రతిమలారాధింపఁ*బరఁగరెపుడు । మూఢులై ప్రతిమలఁ * బూజిం చుటేగాని - చెప్పనేమోక్ష సం * సిద్ధితెరువు । విశ్వంబులోనాత్మ* వేత్తనుసేవించి - పూజించిసాష్టాంగ * ములునొనర్ప॥ తే-గీ॥ సాంఖ్య మును దారకామన * స్కములఁదెల్పి । జ్ఞానమార్గం బెఱింగించి * కడకునచల । భావమెంతయు సూచించి * ప్రజలమోక్ష । గతినిఁ జెందంగఁజేయును*గాకగురుఁడు॥ ౧౮౬॥ బి॥ ఉ॥ తేఁకువ సర్వమేను లకు * దేవుఁడె తారక మాచునెప్పుడు।న్నేకమయాత్మ రూపమున* నెందునఁజూచినఁనందెయుండఁగా।లోకులువేఱుభ్రాంతినవ*లోకన సే తురువానిఁగానకే। మేఁకనుజంకఁబెట్టుకొని*మేదినినారయు గొల్లచం దమై॥ ౧౮౭॥ సీ॥ తామున్నచోటను * దైవంబు లేదని - పామర జనులుర్వి * భ్రాంతులగుచు । శ్రీరంగమునుగాశి * చిత్రకూటము సేతు - మేటితిరుపతులు రా*మేశ్వరంబు । కంచితిరువళ్లూరు * గయ ప్రయాగలు జగ - న్నాథంబు భద్రాద్రి*యాదిగాఁగఁ । గల స్థలం

బులకెల్ల * వలగొని పలుమాఱు - ద్రిమ్మరులై ప్రజలు * దిరుగు
చుంద్రు । కమలమిత్రునిందుఁ * గానని యంధుండు । కాశికేగినైనఁ*
గానఁగలఁడె । దైవ మిచటఁగాంచు * ధన్యాత్ముఁడెందైన । నిందుఁ
జూచినట్టె * యందుఁజూచు॥ ౧౮౬॥ క॥ ఇందున లేఁడని దేవుం ।
డందందునఁ దిరుగుచుందు * రజ్ఞానులిల । న్నిందందునెందు సర్వము
నందునఁగలఁడంచుజ్ఞాని*యారయుచుండుర్॥ ౧౮౭॥ సీ॥ మిక్కిలిగఁ
జదివి * మిడుకుచుందురుగాని - తమలోనిదైవంబుఁ * దలఁపలేరు।
తీర్థయాత్రలకెల్లఁ * దిరుగుచుందురుగాని-తమలోనిదైవంబుఁ * దలఁ
పలేరు।జపతప వ్రతహోమ*పరణిఁజేతురుగాని-తమలోని దైవంబుఁ *
దలఁపలేరు।యజ్ఞదానాదుల*నాచరింతురుగాని-తమలోని దైవంబుఁ*
దలఁపలేరు॥ తే-గీ॥ బూటకములెల్ల సల్పనో*పుదురుగాని । కడఁగి
తమలోని దైవంబుఁ * గాంచలేరు । చొక్కముగ సర్వవస్తువుల్ *
చూడనేర్చి । తన్నుఁజూడంగనేరని*కన్నుఁబోలె॥ ౧౮౮॥ క॥ నేను
నేననుచునెప్పుడు।మానకవచియించుచుండు * మానవుఁడరయన్।నే
నెవ్వఁడననితనుఁదాఁ గానఁడుదేహంబెతాను*గాఁగనుఁగొనుచున్॥
౧౮౯॥ క॥ హరిహరధాతలకైనను । గురుఁడే దెల్పంగవలయు * గు
రుమర్మంబున్।నరులెన్ని పాట్లుపడినను।గురుమర్మము దెలియవశమె*
కుంభినిలోనన్॥౧౯౦॥క॥ కొందఱు వైకుంఠముపైఁ।గొందఱుకైలా
సమందుఁ * గొందఱుస్వర్గం బందునఁగొందఱు నజుపుర।మందున భ్ర
మగొందురవియు।మాయగఁగనుమీ॥ ౧౯౧॥చ॥ అరయఁగసత్యలో
కమున*కై శ్రమలేటికి నందుధాతకున్।దరమిడివచ్చు నూనములు*
దప్పెనెపుత్రినిఁబొందినందుకై।వరసుతులందఱున్ననను*వంచనఁ జేయ
రెమన్మథారిచే।శిరమును గొట్టఁగాఁబడఁడె*సిద్ధముగాఁబరమేష్ఠియొం
తయున్॥ ౧౯౨॥ క।ఘనమే వైకుంఠంబనఁ।బనివడి యచ్చోటద్వార*
పాలకులనఁగా।నొనరిన జయవిజయాదులు।చని మరలనుమరలిరారె*
జన్మంబులకున్ ॥౧౯౩॥ ఆ-వె॥చింతసేయ నేల*శివలోకమునకును।బ్రా
ప్తమునకుమించు*ఫలముగలదె।వెండికొండమీఁద * వెలయంగనుం
డిన। నీశ్వరుండు భిక్ష*మెత్తవలసె॥ ౧౯౪॥ ఉ॥ మానవు లింద్రభోగ
మున*మానసముంతురు స్వర్గనాథుఁడున్।గానని సౌఖ్యమన్యులకుఁ*

గల్గునెగౌతమశాపవహ్నిచే। మేనునఁజీమురక్తములు*మెండుగయో
నులుగల్గియుండఁడే। తానొకపద్మనాళముస*దాఁగఁడెశక్రుఁడుపెద్దకా
లముఁగా॥ ౧౯౫॥ క॥ తమకుంగలిగిననిడుమలు। సమయంగాఁజేసికొ
నఁగఁ*జాలనివారల్। తమకెట్లుసుఖములిత్తురు। తమప్రాప్తము.కొలఁ
దిగాక * తామెందున్నన్॥ ౧౯౬॥ ఆ-వె॥ జన్మసహితులైన * జను
లకునెల్లనీ। పదవులందుభ్రాంతి * పరఁగుజన్మ। శూన్యులిట్టితుచ్ఛ*
సుఖములుగోరరు। స్థిరపదంబువారు*చెందుకతన॥ ౧౯౭॥ క॥ మూ
ర్తులసంగనుగుణములె। మూర్తులుగానెన్నుటకును * మూలమునవి
యే। మూర్తులపనితమదౌటఁద్రి। మూర్తులెయనిగుణములకును *
మూటికివచ్చెన్॥ ౧౯౮॥ ఆ-వె॥ అరయరూపుఁజేయు * నదియకార
ముదానిఁ। బెంచునదియుకార*మెంచిచూడ। నదియులయముఁజేయు*
నది మకారంబగు। వీనిమూటిచేత * విశ్వమొప్పు॥ ౧౯౯॥ క॥ పర
మేష్ఠిహరిహరాదులు। పరికింపఁగవారివారి * పట్టణములకున్। దొర
లగుచుఁబుణ్యజనులకు। స్థిరభోగములిత్తురంచుఁ * జెప్పుటవలనన్॥
౨౦౦॥ ఆ-వె॥ మూడుపురములకును*మువ్వురుప్రభువులై। యలరు
చుంటయు నిజ * మనఘులైన। ప్రజలకొఱకుఁ జేయు * పదవులు
నవిమాయ।వలనఁ గల్పితంబు*వారిజాక్షి॥ ౨౦౧॥ క॥ వారలువారి
పురంబులు। నారయఁ ద్రిగుణములవలన*నైరేగాకన్। వేఱెద్ది పద
వులకు నధి।కారులుగాకెపుడుగారు*కర్తలువారున్॥ ౨౦౨॥ ఆ-వె॥
అరయమూర్తులాది * యఖిలంబుఁద్రిగుణాది। కములచేతనైన * క్ర
మమువలనఁ। గర్తలెవ్వరిందుఁ * గారనిగట్టిగాఁ। జెప్పవలసెనిట్లు *
చిగురుఁబోణి॥ ౨౦౩॥ క॥ నిరతము మూర్తిత్రయమును। గరమరుదుగఁ
బ్రళయమనెడు*గాఢసుషుప్తిన్। బొరలినశించుచునుండఁగ। నెఱివీరలె
కర్తలంచు*నెట్లనవచ్చున్॥ ౨౦౪॥ క॥ రూపును నామముశక్తియు।
వ్యాపారము పత్నిపుత్ర * వాంఛలచేతన్। జూపట్టిపోవుమూర్తులు।
ప్రాపింపఁగ మాయగాని * బ్రహ్మంబగునే॥ ౨౦౫॥ చ॥ అనవుడు

## భా గ వ త ల క్ష ణ ము.

నుర్విభాగవతు * లందురు వారల భావ మెద్దియో। వనములనున్న
యోగులకె* వాసిగమోక్షమటంచుదానసద్ధ్యనవ్రతయాగతీర్థముల*

కంటెను సద్గతి లేదటంచు ని। ట్లనెదరు వారి సద్గతుల * నానతియిమ్మన
శౌరియిట్లనుఁ॥ ౨౦౬॥ క॥ సతినీవడిగిన ప్రశ్నయు। నతివిమలము
నీవడిగిన * యదియేగాక। క్షితిలోనమాయవాదుల। గతులెల్లను
నీకుఁదెలియఁ*గావినిపింతుఁ॥ ౨౦౭॥ ఆ-వె॥ భాగవతులమంచుఁ*బ
రమార్థమెఱుఁగక। ప్రబలితిరుగువారు * భాగవతులె। భాగవతమని
యెదు*పదమునకర్థంబు। పరఁగఁదెలియువారె*భాగవతులు॥ ౨౦౮॥
క॥ భాయనఁగభక్తియనియును। గాయనఁగాజ్ఞానమనియు*గణుతింపఁ
దగుఁ। వాయనవైరాగ్యంబని। తాయనమాయనఁగఁబరఁగు * తత్వ
ముముక్తిఁ॥ ౨౦౯॥ ఆ-వె॥ భాగవతమనినను*భగవంతునకునాఖ్య
యలరుచుండునట్టి*యర్థమెఱిఁగి।భక్తిమీఱునట్టి*భగవంతునెఱిఁగిన।
భక్తులెవ్వరైన*భాగవతులె॥ ౨౧౦॥ క॥ భాగవతార్థముదెలియక।
బాగుగనిలమేముభాగ*వతులమటంచుఁ। రాగిలుచుండెదువారలు।
భాగవతోత్తములుగారు * పామరులరయఁ॥ ౨౧౧॥ ఆ-వె॥ వసు
ధజ్ఞానభక్తి*వైరాగ్యపరతత్వ।మార్గములనుముక్తి*మార్గుఁడగుచు।
విగ్రహార్చనాది*వేల్పులభ్రమవీడి। పరముగన్నవారె * భాగవతులు॥
౨౧౨॥ తే-గీ॥ ఎలమిఁదిరుమణి శ్రీచూర్ణ*ములనుదిద్ది।తులసివేరులు
మెడనిండఁ* దూఁగియాడ। పట్టువస్త్రంబులనుగట్టి * భ్రమసితిరుగు।
పామరులు నెన్నటికిఁగారు * భాగవతులు॥ ౨౧౩॥ క॥ సురపలలసేవ
సతులును। పురుషులు భువి నగ్నలగుచు*భోగింతురదే।పరమ నివా
పులుదలఁపక।ఖరశునిసూకర మృగములు*గలయవెయట్టుల్॥ ౨౧౪॥
ఆ-వె॥ మాసపుష్పరసము * మలమూత్రవీర్యాది। కములెముక్తియం
చుఁ * గఱపువాఁడు। శ్వపశుసూకరాది * సముఁడగుఁగాకప। స్నాన
వుండెయతఁడు*మదిఁదలంపఁ॥ ౨౧౫॥ ఆ-వె॥ అవనినష్టపూరుషులని
తీర్థవళ్లని। నీచ వస్తువులను * నెసఁగఁగూర్చి। గలిపి నీటఁద్రావ *
ఘటశుద్ధియౌనె య। శుద్ధవస్తువుల న * శుద్ధతనువు॥ ౨౧౬॥
ఆ-వె॥ అయ్యలుపెరుమాళ్లు * నారగింపులునేసి। గానిమెక్కఁబోరు*
కడుపునిండ। నారగింపులెన్ని*యైననునాఁకలి। చెడదుకుడువకున్న*
విషదుకుత్తు॥ ౨౧౭॥ బి॥ క॥ కూరిమి వర్ణాశ్రమములు।గోరికనీమం
బులాదిఁ*గొనిభ్రమయకహ్రూ। తాసారసమునఁ దనుఁగాంచిన। వారె

వ్వరునైనభాగ*వతులనఁజెల్లుఁగా॥ ౨౧౫॥ సీ॥ నెలఁతా వైష్ణవధర్మం|
బలరఁగఁగనువాఁడుచూవె * భాగవతుండౌ| నిలనిట్టినీచవర్తన| లలి
వేణి సేయునాతఁ డార్యుండగునే॥ ౨౧౬॥ క॥ దురితాచారంబనఁదగు|
మఱియమ్మధుమాంససంగ*మాదిక్రియలన్| దొరఁగిన ధర్మప్రవర్తనఁ|
బరువడిఁగైకొన్నవారె * భాగవతులిలన్॥ ౨౧౭॥ క॥ శశివదన నీకుఁ
దక్కను| విశదముగాఁ దెలియుతత్వ * విదులకుదక్కన్| పశుతు
ల్యులైనజనులకు| వశమే తెలియంగభాగ * వతధర్మంబుల్॥ ౨౧౮॥
ఆ-వె॥ ఊరనున్న ముక్తి * నొందఁగారాదని| విపినమునకు నేగు*వెఱ్ఱి
నరుఁడు| నడవియందు నెప్పుడు విడువక చరియించు| మృగవిహంగముల
కు * మేలుగలదె॥ ౨౧౯॥ చ॥ జడభరతుండు రాజ్యమును*సర్వము
వీడియు మోక్షకాంక్షచే| నడవికినేగిజింకతగు * లాటము చేతను లేడి
జన్మముల్| బడసియుఁగొన్ని నాళ్ళకును*బాసి శరీరము విప్రజన్ముఁడై|
కడపట ముక్తినొందెనిఁకఁ * గానలనున్నను ముక్తిగల్గునే॥ ౨౨౦॥
తే-గీ॥ ఇల్లునాలినివర్జించి * యిలను విడినఁ| గందమూలంబులనుదిని *
గాననున్నఁ| దపనశీతంబులకునోర్చి * తపసియైనఁ| గాయమును
జిక్కఁజేసిన * మాయదెగునె॥ ౨౨౧॥ క॥ తనుఁదాఁ గనుఁగొను
పురుషుం| డనయంబును నింటనున్న * నందును ముక్తిన్| దనుఁదాఁ
గానని మనుజుఁడు| వనమునఁగల్పంబులున్నఁ * బడయునె ముక్తిన్॥
౨౨౨॥ ఆ-వె॥ మనసు కారణంబు * మఱిమొందునున్నను| నిండ్లు
నడవిముక్తి * నియ్యఁగలవె| మనసులేనివాఁడు*మందిరముననున్నఁ|
గాననముననున్నఁ * గార్యమేమి| ౨౨౩॥ క॥ ఆఁకటికన్నముగుడు
వక| యాకులు కాయలునునమల * నది మోక్షంబే| యాకులనెల్లను
మేసెడు| మేఁకలకును ముక్తిగలదె * మేదినిలోనన్॥ ౨౨౪॥ క॥
నెఱిఁగూడునీళ్లుముట్టక| పరువడిఁబైచీరలేక*పసరమురీతిన్| దిరిగిన
మోక్షముగల్గునె| పరికింపఁగవార్త్రవాత * ఫలమదికాకన్॥ ౨౨౫॥
సీ॥ ఆదియందెనరుల * కన్నంబుబుట్టించె-బసులకుఁగల్పించె * పచ్చి
పూరి| ఫణికినాహారంబు * పవనంబుగాఁజేసె - నెఱ్ఱులకును మన్ను *
నేర్పరించె| వేఱుపుర్వులకెల్ల * వేఱులుగావించె - మేఁకలకలరించె *
నాకులెల్ల| మధుపాళికెల్లను * మకరందమొనరించె - పేడప్రుపుర్వుల

కెల్లఁ * జేసఁజేసె। నిట్టు లాహారమే జీవి * కెట్టులెట్లు । పెట్టవలెనట్లు
దైవంబె*పెట్టియుండఁ। దమకుసృష్టించు నన్నంబుఁ * దాముపెనక।
యితరయాహారములు గొన * నేమిఫలము॥ ౨౨౬॥ తే-గీ॥ ఆత్మలిం
గంబుసేవింప * నలవిగాక। దొంగపశువుకు మెడబొండఁ * దొడఁగి
నట్లు। కంఠమున లింగకాయలు*గట్టినంత। మాత్రమునముక్తిఁ గం
దురే * మనుజులు॥ ౨౨౭॥ క॥ పరమార్థముఁ గనఁజాలక। కోఱ
మాలిన నరులుగర్మ*గురుముద్రలచే। నిరుభుజములు గాల్పింతురు।
పరగంగా ముక్తిగలదె * పశువులుగాకన్॥ ౨౨౮॥ తే-గీ॥ భూతి
దేహంబునకు నెల్లఁ * బూసిహరిణ। చర్మవల్కల రుద్రాక్ష * పరు
లుకాయ। వలువలును గమండలదండ * ములను నోలిఁ। బూని
నంతనె మోక్షంబు * పొందువడునె॥ ౨౨౯॥ క॥ దానముల జన్మ
శూన్యము। గానేరదు నృగునకంటెఁ * గలరే బహుగా। ధేనువు
లు భూములిచ్చిన। భూనాయకుఁ డూసరెల్లి*పుట్టువుఁగాఁడే॥ ౨౩౦॥
ఉ॥ వట్టి వికారమర్త్యు లుప*వాసనుదెట్టిదెఱుంగఁజాలకే। యట్టియ
భీష్టవాసరము * లన్నముమాని వటింతురాఁకలిం। బట్టఁగలేక ప్రాణి
మల*భక్షణఁజేసియగాదె తృప్తుడౌ। నిట్టివ్రతంబులున్ సలుప * నేమి
ఫలంబగు మానవాళికిన్॥ ౨౩౧॥ ఆ-వె॥ మదిర కుంభమునకు*మది
రంబుచేశుద్ధి। పొందనట్లు బుద్ధి * పూర్వకముగ। జీవహింసఁజేసి *
గావించు యాగంబు। పాప వృద్ధిగాని * ఫలముగలదె॥ ౨౩౨॥ క॥
తెలివివిహీనులు కొందఱు। నిలలోఁగల శక్తులకును*నింపెసఁగంగన్।
దలపోయఁ గొన్నిజీవుల। బలియిత్తురు దోషమునక*ఫలమదియగునే॥

## జీవహింస లక్షణము.

౨౩౩॥ క॥ ధరజీవ హింసకంటెను। నిరయము వేఱొండులేదు*నిఖి
లమునందున్। బరమాత్మగల్గుఁగావున। నరుచకుఁదగ దెట్టిప్రాణి*నం
తముఁజేయన్॥ ౨౩౪॥ ఆ-వె॥ యజ్ఞమనఁగనాత్మ*యజ్ఞంబుగావింప।
వలయుఁగాని సుగుణ*వంతులెల్ల। జీవహింసతోడఁ*జెలఁగెడుయజ్ఞం
బుఁ। జేయఁబోలదెంత * చెనటులైన॥ ౨౩౫॥ చ॥ కొనకొని యెన్ని
ప్రాణులను*గోతురొ మానవు లన్నిమాఱులున్। దనరఁగ పానిరూప
ములఁ*దాముపహింతురుమానవాకృతుల్। గనునవివారిచేతఁ దెగు*

కై వడివానినిఁగోయఁగాబడున్।గనుఁగొనదాముసేయునల*కర్మఫలం
బులు రిత్తవోవునే॥ ౨౩౬॥ క॥ అనదుష్ట సింహావృశ్చిక । ఫణులాది
వధించుటెల్లఁ*బాపముగాదే । మనుజులిది సేయవచ్చునె । యనఁబడఁ
తుకఁ జూచిపల్కె * హరిప్రీతుండై॥ ౨౩౭॥ క॥ పరమాత్ముఁ డన్నిట
ను నా।దరమొప్పఁ గపముఁడుగుచుఁ*దన్నెఱిఁగిన స । త్పురుషుఁడు
తానై వెల్గుచు।మరి సకలమునందుసాక్షి*మాత్రుండగుటన్॥ ౨౩౮॥
చ॥తనరఁగ దుష్టజంతువులు*ధాత్రి ననేకులకెగ్గుసేయుఁగా।పునవిను
దుష్టశిక్షణముఁ*బొల్పుగనీయిల శిష్టరక్షణం।బులు నొనరించ ధర్మ మ
గుఁ బొంద దధర్మముదుష్టప్రాణులన్।జనులకు మేలుగోరియును*జం
పినఁ జంపఁగవచ్చు నిమ్మహిన్॥ ౨౩౯॥ ఆ-వె॥ అట్లు చంపకున్న*నవి
కొన్నిప్రాణుల।బాధసేయుఁగొన్ని * పరగఁజంపుఁ । గానసకలజీవ*గణ
సౌఖ్యముగ దుష్ట । జీవతతులనొంపఁ*జెందదఘము॥ ౨౪౦॥క॥ తొలి
యవిచేసిన దుష్కృత।ములవలనను దుష్టజన్మ*ముల నొందుటయు।
న్నిలజనులుగనినవానిని।బొలియించుట వానివాని*పూర్వకృతములే॥
౨౪౧॥ క॥ తననుంబొరిగొన నెదిరిం । చిన వానినిఁ ద్రుంపనఘము *
సెందదులవము।ట్లనుదమకున్ దగమృత్యువు । నొనరించెడివానిఁజంప *
నొప్పగుజగతిన్॥ ౨౪౨॥ ఆ-వె॥ ఒరుల తెరువుపోక * యొగినీటఁ
గొన్నియు।నుర్విగొన్ని బ్రతుకు*నోరులేని । సాధు జంతువులను*జంపు
ట ధర్మమే । మాంసభక్షణంబు * మఱిఁగి ఖలులు॥ ౨౪౩॥ క॥ తీర్థ
స్నానము లాడఁగ । సార్థకమును గలదెయందు * జలచరములకే ।
సార్థకము వచ్చునంతటి।సార్థకమే గల్గునట్టి*స్నానంబులచేన్॥ ౨౪౪॥
ఆ-వె॥ తనువుతోడస్వర్గ*మునకుఁబోయినవారె।ధన్యులంద్రుతనువు*
దగిలినపుడె।చావుగల్గుపిదప*జన్మంబుగలుగును । గానముక్తిపదము*
గాదదియును॥ క॥ సుతులిలను లేనివారికి । గతులే లేవందురెపుడు*
కర్మవిచారుల్।సతిసుతులు లేనిమారుత।సుతుఁడును నాభీష్మసృఁకతి *
సుగతింగనరే॥ ౨౪౬॥ ఆ-వె॥ గృహమునందునుండి * యిలకులంబున
నుండి। యిహమునందునుండి * యింపుమీఱి।సతులసుతులతోడి*జగ
ము మిథ్యయటంచుఁ।గాదెసూరిజనులు*గనుటసుగతి॥ ౨౪౭॥క॥ సతి
పొందుగోరకుండిన । యతఁడేమహనీయుఁడందు*రాషండునకున్।సతి

వాంఛ లేదు గావున । నతడునుగావచ్చు నిలమ * హోత్ముండరయ౯ ॥ క॥ మతములకన్నిఁటికిని మా। మత మే హెచ్చను చువాద*నూడుదు రె వరు౯।మతములకందని పరమును । మతిఁగానఁగ లేనివారి *మత మేమి టికి౯ ॥ ౨౮॥ తే-గీ॥ భూతి రుద్రాక్షలును లింగ*ములునుదాల్చు। నవియు వనమాలవేయుట * నామములును । బెట్టుటయుఁ బట్టుపుట్ట ముల్ *గట్టుటయును । నాది చక్రాంకితంబులు*నగుట భ్రాంతి॥ ౨౯॥ క॥ స్థిర కాలజీవులగుచును। ధరనుందురు కొందఱను చుఁ*దలఁచెద రజ్ఞు ల్। తరుణీ *ణిజాతస్యో। మరణంధ్రువ *న్న శ్రుతిని* మనము౯ వినమే॥ ౩౦॥క॥స్థిర కాలజీవులనఁగను। సురుతరముగఁ దనువుతోడ*నుండుట యును గా।దరయఁగ దేహము చెడినను । బరమైతాముంటనాశ * భవ ములు లేక౯ ॥ ౩౧॥ తే-గీ॥జనములెల్లనుజూచి యా * శ్చర్య మొందఁ। బ్రాణమునుబట్టి తా నెగు * ప్రాణముననును । నంబువులమీఁదఁ గూర్చు న్న *నధికుఁడగునె। నిలిచియుండవె బుడకోళ్ళు * నీటిమీఁద॥ ౩౨॥ క॥ కాళ్లంటజడలుగడ్డము।గోళ్ళాదిగఁ బెంచిపుట్ట*గోఁచియు నమర౯। వ్రేళ్ల జపమాలఁద్రిప్పుచు। నూళ్ళూళ్ళను దిరుగముక్తి*నొందంగలరే॥ ౩౩॥ తే-గీ॥ దేహమును మాయయని తన్నుఁ * దెలియ లేక । పవన భక్షణఁ జేయుచుఁ * బామురీతి।నీచ కాయంబు బహుణాళ్లు * నిలుప నేల । ఘటియుబ్రతుకదె వేయేండ్లు* ఫలముగలదె॥ ౩౪॥ క॥ వాయు వుల వశముఁ జేసుకఁ।బాయక యిలమీఁదఁజదలు*పదమున నిలువ౯। మాయను బాయఁగవచ్చునె। యాయంబర సీమంబులుఁగు*లాడవెదు పుడు౯॥ ౩౫॥ ఆ-వె॥ మౌనభాషలరయ * ముది వికారములంచుఁ। దెలిసి పరముజాడఁ* దెలియ లేక । మాటలాడ కెపుడు * మౌనంబుచే నాలి । ముచ్చువలెనుదిరుగ*ముక్తుఁడగునె॥ ౩౬॥ క॥ ఊరూరుదిరిగి పరులకు। గారడి మహిమలనుజూపఁ * గలదే మోక్షం। బేరిటిఁగల్లుమా యలు। గారడివానికినిముక్తి*గలదేతలఁప౯॥ ౩౭॥ ఆ-వె॥ ఆశ్రమంబు లేమి *యనరాకసర్వంబు । నిండియున్న పరము*నెఱుఁగ లేక । యిలను నాశ్రమంబు లిచ్చునేముక్తిని । మూలమెఱుఁగలేని * మూఢులకును॥ ౩౮॥ క॥ నేలం బవళించుటయును । రేలుపుభుజియించుటన్న * రీ తులు లేక౯।పాలుఫలాదులుగొనుటయుఁ। గీలెఱుఁగని మాయజనుల.

క్రియలుతలంపన్॥ ౨౬౦॥ ఆ-వె॥ హోమగుండములను * నొనరించి హెచ్చుగా। నాజ్యధారలిడుచు * నగ్నిలోన। ఘోరముగను వేద * ఘోషలు గావింతు। రందుఁగానఁబడునె * నాత్మతెరవు॥ ౨౬౧॥ క॥ సతిసుతగృహవిత్తంబులఁ। జతురత విడనాడి నేను*సన్యాసినన। న్నతఁడె పుడు గాఁడు దేహము।సతతముగొని తిరుగునపుడె*సకలమునుండున్॥ ౨౬౨॥ క॥ సంసారమనఁగ దేహమె। సంసారమనంగఁ గాదు * సతిసుత గృహముల్।సంసారమను చువదలిన। సంసారేతనువువిడువ * సన్యాసియగున్॥ ౨౬౩॥ క॥ వనితాదేహ తనూజుల। ధనకనకాభరణవస్తు * తతులను నెల్లన్।బనిపూనివిడువవచ్చును। దనువును విడనాడవశమె* ధరనెవ్వరికిన్॥ ౨౬౪॥ క॥ తనుఁదాఁ గాంచుచునుండిన। జనుఁడేసన్యాసిగాని*సకలమునున్నన్।దనుఁదాఁగానక తిరిగెడు।జనుఁడును సన్యాసి గాఁడు * సకలమువిడినన్॥ ౨౬౫॥ క॥ క్షితికొందఱుశాస్త్రంబుల। నతులితముగఁ జదివిజ్ఞాన*మదియెఱుఁగరుపో। సతతముగురుకృపగలిగిన। సతిచదివినఁ జదువకున్న * సమముక్తియగున్॥ ౨౬౬॥ చ॥ తలలను బోడిఁజేయుటయుఁ * దాల్చుటనామవిభూతులున్ జడల్।గలయదిగంబరుండగుట * గట్టుటకంబళికాయవల్కముల్। బలువగుక్షుత్పిపాసలను బట్టికమండలదండ ఛత్రముల్।పొలుపుగవ్యాఘ్రచర్మములఁ * బూనుట డంబముగాక ముక్తికే॥ చ॥ చలనపుమాయవిశ్వమును*సత్యమటంచునునమ్మువారికే।కలుషపుతంత్రవేషమును*గావలెఁ గానిదలంచిచూడఁగా। నిలఁబరమాత్మతత్వమును * నింపుగఁగాంచియు సర్వవృత్తులున్। గల యనిచూచువారలకు * గల్లరివేషము లెల్లనేటికిన్॥ ఆ-వె॥ అనిసఁబంకజాక్షి * యాయదుకులవిభు।నరసియాశ్రమంబు * లనఁగనెన్ని।యాశ్రమములలోన * నధికంబునెయ్యది। యెఱుఁగఁజెప్ప

ఆశ్రమలక్షణము.

మనిన * నిట్టులనియె॥ ౨౬౯॥ క॥ వనితావానప్రస్థం।బును నవధూతంబు సరస * ముగ సన్యాసం। బును బ్రహ్మచర్య మిన్నిఁటి। కిని గార్హస్థ్యంబుతల్లి * కీర్తిప్రదగున్॥ ౨౭౦॥ క॥ సకలాశ్రమముల వారికి। నిఁకగార్హస్థ్యంబు రక్ష*ణీయంబగుటన్।బ్రకటింపఁగ గార్హస్థ్యము। వకు సరిగావంద్రు బుధులు*నఖిలాశ్రమముల్॥ ౨౭౧॥ ఆ-వె॥ నిజము

దెలియు లెట్లు * నిజగురుసందర్భ | మింత లేకగల్గె * నిన్ని విధము |
లైనమార్గములును * నదియున్న నరులకు | నౌనునొక్కమార్గ మం
దటికిని॥ ౨౨॥ క॥ క్రతుతీర్థంబులకంటెను | క్షితిదానవ్రతములాది *
సేయుటకంటెన్ | మతములకన్నిటికంటెను | నతులితభాగ్యంబు దెలి
యు* టాత్మపదంబున్ ॥ ౨౩॥ ఆ-వె॥ నిజము దెల్పునట్టి * నిజగురుఁ
గానంగ | లేకమాయఁజిక్కి* లోకులెల్లఁ | గర్మగురులఁజేరి * కర్మకుఁ
బాత్రులై | చచ్చిపుట్టుచుండ్రు * సహజముగను॥ ౨౪॥ ఉ॥ మానిని
గ్రుడ్డికంథుఁడను* మార్గముఁజూడఁగ లేనికైవడిన్ | జ్ఞానము లేనిమందు
నకు * జ్ఞానవిహీనుఁడుముక్తిదెల్పునే | కానని వానికక్షులను * గల్గిన
వాఁడెఱిఁగించుపోలికన్ | జ్ఞానము లేని మూఢునకు * జ్ఞానియచూపును
ముక్తిమార్గమున్ ॥ ౨౫॥ తే-గీ॥ జ్ఞానియజ్ఞానియొకరూపు * గానఁ
బడిన | వారివారల భావముల్ * వేఱువేఱు | ఉప్పుకప్పురరూపంబు *
లొక్కటిగను | నుండినను రుచు ల్వేఱ్వేఱ * నుండునట్లు॥ ౨౬॥
ఉ॥ దీపముగల్లు గేహమున * దీప్తిఁగనంబడు సర్వరూపముల్ | దీపము
లేకయెద్దియును * దేజమెసంగనియట్లు లేరికిన్ | బ్రాపుగ దేహిదేహ
మును * బాయకమున్నుగ ముక్తిగానకన్ | దీపమువంటి తెల్వియును *
దీటెనపిమ్మట ముక్తిగందురే॥ ౨౭॥ ఆ-వె॥ దేవుఁడన్నమాట * దెలి
యునందటికిని | మాటవలననేమి * మూటవచ్చె | వానినెఱిఁగినట్టి *
వానిని సేవించి | దేవుఁడన్నగుర్తు * దెలియవలయు॥ ౨౮॥ క॥ పేరెఱిఁగిన
వాఁడొక్కఁడు | కూరిమిఁదనచెంత రాఁగ * గుర్తెఱుఁగునెయా | పేరుగల
వాఁడెవీఁడని | వారకతని నెఱిఁగినట్టి * వాఁడు దెలుపకన్ ॥ ౨౯॥ ఆ-వె॥
అబ్ధిదరియఁగోరి * యలనావికునిఁబొడఁ | గన్నయట్టులోడ * నున్నజను
లు | మాయయనెడువార్ధి * మానక దాఁటించు | జ్ఞానగురుని నరులు * గాన
వలయు॥ ౩౦॥ క॥ దనశుద్ధి దెలియఁగోరిన | ఘనపంచాంగంబు ము
ఖత * గావలెనిఁక దే | ననుగానట్టుల జ్ఞానము | గనఁదగు సద్గురునివల
నఁ * గాదితరమునన్॥ ౩౧॥ శా॥ ఏవేళన్ గురుమూర్తి పాదము
లనే * యేవారలున్ గొల్తురో | నేవారిన్ మహనీయ మూర్తులను
చు * న్నెల్లప్పుడున్ గొల్తునా | దేవాధీశునకైన వారిమహిమన్ *
దీపింపరాదగ్గురున్ | భావింపన్ దగఁ గొల్వ లేనినరులన్ * బాటింపరా

దెన్నఁడుఁ॥ ౧౮౨॥ సీ॥ కులశ్రేష్ఠులము మేము * కులహీనుఁడగు వాని - గురుఁడనివిమదినెట్లు * గొల్తుమంచు। దేహాభిమానులై * దిరుగువారలుముక్తి - గనలేరుయుగములకైనఁగాని। వసుమతిరాళ్లలో * వజ్రంబుప్రభవించి - కులహీనమయ్యెనే * గొప్పగాక। పాలమున్నీటిలో * పలవిషముజనించి - కులమేమి ఘనతయ్యె * గుణములేక। గానవింతకుగుణములే * కారణములు। గానికులమెందుహేతువు * గాదటంచు। నెంచిదేహాభిమానంబుఁద్రుంచిపరమ। గురునిసేవించువారలు * పరముగంద్రు॥ ౧౮౩॥ ఉ॥ దేవరహస్యమెంతయును * దెల్పెడిమోక్షముదెల్పునార్యులన్। భావముజాతియున్ గుణము * పద్ధతులాదిగనెంచనేటికిన్। గోవుసుధాంబుపూరములు * గోరినపాలనెగొంచఁగాఁదగున్। గోవుబలంబుసన్నమును * కొమ్ములురొమ్ములునెన్ననేటికిన్॥ ౧౮౪॥ ఆ-వె॥ భువిననేకజన్మ * పుణ్యవశంబునఁ। గాని నరులుగురునిఁ * గానలేరు। పుణ్యహీనులకును * బుద్ధిఁదలంచిన। దొరకదెన్నఁటికిని * గురుపదంబు॥ ౧౮౫॥ ఉ॥ కూరిమిమర్త్యులందునను * గోటికినొక్కఁడు గోరుమోక్షమున్। గోరినవారియందునను * గోటికొకానొకరుండు సద్గురున్। జేరివిముక్తిఁగాంచుగురుఁ * జేరినవారలఁగోటికొక్కరుం। డారయజన్మశూన్యుఁ * డగునంచటికిన్ గడతేటశక్యమే॥ ౧౮౬॥ క॥ నావుడుఁగులమననదియును। నేవిధమునసంభవించె * నెచ్చునుదగ్గున్। భూవలయమందుజనములు। భావించుటయేమికతనఁ * బద్మదళాక్షా॥ ౧౮౭॥ క॥ ప్రజ్ఞాప్రజ్ఞవివర్జిత। సుజ్ఞానవిశాలనేత్ర * శుభగచరిత్రా। యజ్ఞప్రశస్తశోభిత। యజ్ఞానధ్వంసపరమ * హంసోత్తంసా॥ ౧౮౮॥ మాలిని॥ కుటిలమదవినాశా * కోటిసూర్యప్రకాశా। పటుదరవరతత్వా * పంచభూతప్రభుత్వా। చటులదురితదూరా * సర్వవేదాంతసారా। ఘటననటనధారీ * కామశూన్యప్రచారీ॥ ౧౮౯॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీసంవాదంబను - సుజ్ఞాన శాస్త్రంబునందుఁ బ్రథమాశ్వాసము.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞానశాస్త్రము.

### ద్వితీయాశ్వాసము.

క॥ అక్షరరూపవికారవిలక్షణశుద్ధాంతరంగ*లలితశుభాంగా
కుక్షిపదభరితత్రిభువన । రక్షోరాజాధిరాజ * రాజపరాత్మా॥ ౧॥ వ॥
అవధరింపుమువ్యాసుదేవుండ త్తలోదరికిట్లనియె॥ ౨॥ క॥ తరుణీమణికు
లమనునది । పరిరిరవృత్తులనుగల్గె * బహురామములుల్ । బరికింపఁగు
లము వేఱొక । తెఱఁగునగల్గినదిగాదు*దెలియుమయింకన్ ॥ ౩॥ ఆ-వె॥

కుల లక్షణము.

వృత్తివలనఁగాక* వేఱొక్కవిధమునఁ । గులమునుగల్గెనంచు*గోరిచూ
డఁ । గులముపరమహంస కులమయ్యెనందఱు । కులములేని బ్రహ్మ *
కులజులైరి॥ ౪॥ క॥ కులశ్రేష్ఠులమనినీల్గెదు॥ పలుగాకులు దెలియలేరు
పరమార్థంబున్ । కులమేరోఁతనిరోసిన । కులశ్రేష్ఠుండతఁడెతత్వ*కో
విదుఁడరయన్॥ ౫॥ ఆ-వె॥ సప్తధాతువులును*సమమయ్యెసమయో
ని । నరయనుద్భవంబు * నాత్మజీవ । సమముదలఁచిచూడ * సర్వదే
హంబులు । నొక్కటయ్యెఁగులము*నొకటిగాదె॥ ౬॥ క॥ కమలముఖి
చీముశోణిత । మెముకలునరములునుదోలు * మెదడునుమాంసం।
బమితమలమూత్రరోఁతల। నమరినదీకాయమెన్న *నగుబొట్లుసుమీ॥
౭॥ ఆ-వె॥ ముట్టులోనఁబుట్టె * ముఱికికాయంబును । ముఱికికాయ
మందె * ముట్టుపుట్టె । ముట్టుకొంపయిట్టి * ముఱికిదేహంబున కేమి
కులముగలుగు * నెంచిచూడ॥ ౮॥ క॥ ముట్టునబుట్టినకులమిది । ము
ట్టనరోయంగనేల*ముగ్గురుమూర్తుల్ । ముట్టునఁబుట్టిరిగాదె। ముట్టు
నులేకున్ననరులు * పుట్టంగలరే॥ ౯॥ ఆ-వె॥ ముట్టునందె సురలు *
మునులుదిక్పాలకుల్। ముట్టునందెజగము*మునిఁగితేలు॥ముట్టునందె
నిలిచి * మూలంబుఁదెలిసిన॥ ముట్టుఁబాసిసర్వ ముక్తుఁడగును॥ ౧౦॥
క॥ముట్టుకులంబని తెలియక। ముట్టనికడనుండిపతులు*మూన్నాళ్లైనన్।
ముట్టువిడనీళ్లనాడినఁ। జట్టకులోఁగల్గుముట్టు*సమయునెయదియున్॥

క॥ తానెప్పుడుపరిశుద్ధుఁడు । మేనెప్పుడుముట్టుబోమికె * మేనెన్నఁ
టికిన్ । గానేరదుపరిశుద్ధియు । మానకయుదకములఁగోటి*మాటులు
వడిన౯॥ ౧౨॥ ఆ-వె॥ సతులుపతులుగూడి * రతిసేయశుక్లశో । ణి
తములోనరిపిండ * ముతన రెనుగ । వరుసమూత్రగవిని * వచ్చిరంద
ఱునిందు । ఘనకులంబునేది * కానిదేది॥ ౧౩॥ క॥ ఎక్కువమాకుల
మనిబహు । నిక్కంగానేలబిందు * నెత్తురుకులమే । నిక్కముగనైరి
యందఱు। నెక్కువతక్కువలునెన్న * నేమున్నదిఁక౯॥౧౪॥ తే-గీ॥ వీ
ర్యరక్తంబులను గాక *వెలఁదియోని । మార్గమునఁగాక యింకొక్క*
మార్గముననుభవమునొందనెక్కువయని*పల్కవచ్చు। నందఱారీతిఁ
బుట్టిరి*యధిక మేమి॥ ౧౫॥ చ॥ అరుదుగదంతికీటకము * లందునశ్వా
నమునందుధేనున౯। నరసురలందున౯శ్వపచు*నందునవిప్రునియందు
నింతుల౯। బురుషులభిన్న భావమును *బొందకసర్వసమత్వమాత్మగా।
నరయుచునుందు రార్యులును *నల్పులు భేదము లెంతురన్నిఁట౯॥౧౬॥
ఆ-వె॥ అబలసర్వరూపుఁ*డైనయనంతుని । దుష్టులెఱుఁగలేని*దోష
మునను । భిన్న భావములను * భేదంబు లెంతురు । నిఖిలమాత్మయం
చు*నెఱుఁగలేక॥ ౧౭॥ సీ॥ ఊతివసిష్ఠుఁడునూర్వ * శికిఁగల్గెనతనికి -
నాయరుంధతియందు * నవతరించె । శక్తియువానికిఁజండాల * సతి
యందు - సంభవించెనుబరా*శరుఁడనంగ । వానికిశంబర * వనితయం
దుదయించె - వ్యాసుండుపరికింప*భాసురముగ । నరయఁజాకితకును*
నారదుండుజనించె-బోయకువాల్మీకి*పుట్టెఁగాదె । యసురకులమునఁ
బ్రహ్లాదుఁ * డలరెవీరు । కులము చేతనుగాంచిరే *గొప్పతనము। గుణ
ము చేత నేసద్బ్రహ్మ*కులజులనఁగ। నఖిలజగములఁబూజితు*లైరిగాక॥
౧౮॥ చ॥ ఇలధృతరాష్ట్రపాండు ధర*ణీశులుముండలకుద్భవించరే।
పొలుపుగదాసిగర్భమునఁ*బుట్టఁడె యావిదురుండునెంతయు౯।గలుగ
రెయన్యవల్లభుల*కాదరమొప్పఁగఁబంచపాండవుల్। కులముఘనంబె
వీరలును*గొప్పవహించరెలోకమందున౯॥౧౯॥సీ॥కలశంబులోన న*
గస్త్యుండుప్రభవించె - గాధికినుదయించెఁ*గౌశికుండు । జింకకడ్పున
ఋశ్య*శృంగుఁడుగలిగెను - గవికినుద్భవమయ్యె*గౌతముండు।శ్వప
చవంశమునందు * జన్మించెసాఖ్యుండు - తగమతంగుననను మ * తంగ

మాని। మండూకమునకును * మాండవ్యమునిగల్గె - ముండకుకౌండి
న్య * మునిజనించె। శుకమునకునుబుట్టె * శుకయోగిభావింప। జంబు
కంబునకును * జంబుకుండు । ఖరమునకును బోడమె*గార్గేయుఁడెం
తయు । శ్వానమునకుఁగల్గె * శౌనకుండు॥ ౨౦॥ క॥ జ్ఞానమె బ్రహ్మ
త్వంబ। జ్ఞానమె శూద్రత్వమనుచు * జ్ఞానంబాత్మన్। బూనితమ
జన్మలెట్టివి। గానున్నబ్రహ్మవిదులు*గారెమునీంద్రుల్॥ ౨౧॥ ఆ-వె॥
జగతియేలెనేని*చండాలుఁడైనను । బ్రభువుగాఁగనెన్నఁ బడినరీతిఁ *
బ్రహ్మపదముగన్నఁ*బంచమకులుఁడైన। బ్రాహ్మణుండనంగఁ * బడును
జూవె॥ ౨౨॥ క॥ వరక్షత్రియుండునైయిల। పరిపాలనలేనివానిఁ *
బ్రభువన రక్షే। ధరణీసురవరుఁడైనను। బరమార్థములేకగలదె * బ్ర
హ్మత్వంబున్॥ ౨౩॥ ఆ-వె॥ గుణముగల్గెనేని*కులముతోఁబనియేమి।
కులమునెంచుటెల్ల * గుణములేమి। గుణములేనిదాని * కులమేమి
ఘనమగుఁ। గులమువాసిఁదెచ్చు * గుణముగాదె॥ ౨౪॥ క॥ తెలివి
జడత్వంబులయెడఁ। దలఁపంగావచ్చుఁదార*తమ్యములెందున్। గుల
మునకునెంచవచ్చునె। యలరంగాహెచ్చుతగ్గు * లనుబేధములన్॥
సీ॥ శూద్రవనితభూమి * సురుఁడుతద్భూసుర - కాంతనుశూద్రుండు*
గలిసెనేని। శూద్రనాతికినిభూ * సురసతికినిబుట్టు - బిడ్డలకునుజాతి*
భేదమున్నె । కుక్కవిజాతియౌ * గొఱ్ఱెనుబొందినఁ - గుక్కపుట్టదు
వేఱు*కులముగుటను। సర్వమానవులెల్ల*నొకజాతిగావున - నెన్న నే
సతినైన * నింపుమీఱ॥ తే-గీ॥ నేపురుషుఁడైనమించిర * మించెనే
ని। నరులుగాఁ బుట్టుదురుగాక * నక్కకుక్క। జన్మలగుదురెయీ
నర * జాతియందు। జాతిభేదంబులెన్నుట * రీతియగునె॥ ౨౫॥ ఎ॥
ఆ-వె॥ భువినిగోత్రభూజ * ములకుబేధంబగుఁ। గానిగిరికిగిరికిఁ*గలదె
వేఱు। నరకులంబునకును * నఖిలంబువేఱైనఁ। దమకులంబువారు*
తమకువేఱె॥ ౨౬॥ క॥ జనములునందఱునొకకుల। మనితెలిసినవాఁ
డెజగతి * నగ్రకులుఁడగున్। మనుజులబేధములెన్నుచుఁ। గొనకొని
నటియించువాఁడె*కులహీనుఁడగున్॥ ౨౭॥ ఆ-వె॥ పునుఁగుగల్గుపిల్లి*
పునుఁగుపిల్లియయగుఁ। బునుఁగులేక కాదు*పునుఁగుపిల్లి। గుణములు
న్నహీన*కులజుండుహెచ్చగు। గుణములేకనగ్ర*కులజుఁడగునె॥ ౨౮॥

చ॥ తపమును యాగతీర్థములు * దానమహింసయు వేదపాఠముల్ ।
జపమును శాంతముల్ వ్రతము * సత్యము హోమము స్నానసంధ్యలున్ ।
నిపుణత మీఱుసల్పుధర * నిర్జరుకంటెను దత్త్వవేత్తయా । శ్వపచుఁడు
నుత్తముం డమల * జన్ముఁడునాతఁడె బ్రాహ్మణుండగున్॥ ౨౯॥ సీ॥
పడఁతిదానముచేత * బ్రాహ్మణత్వమువచ్చె - ననిననన్యులుగూడ * నాచ
రింత్రు । జన్నిదంబులుదాల్ప * సంభవించెనటన్న - నన్యులుకొందఱు *
నవిధరింతు । రెఱుపుతెల్పులఁగూర్చి * యొసఁగెనన్ననునన్య - కులముల
లో ననే * కులునుగలరు । జీవతెలుపులఁగూర్చి * చెందిరన్ననుజీవ - తె
లుపులందఱియందుఁ * దేజరిల్లుఁ । గర్మమునుగూర్చివచ్చెనాఁ * గర్మఫ
లము లెల్లవారికిఁదమభంగి * నెసఁగుచుండు । దేహమననందఱికి - గల్గుఁ *
దెగినతనువు । నాత్మజుఁడుగాల్పఁగా బ్రహ్మ * హత్యపొందు॥ ౩౦॥ ఆ-వె॥
కులమువలనననినఁ * గోమలివారి వం । శజులుఋషులుపుట్టు * సరణి
వినవె । పడఁతియట్లుగాదు * బ్రాహ్మణభావంబు । జ్ఞానసంగ్రహమున *
సంభవించె॥ ౩౧॥ ఆ-వె॥ అనినఁదత్త్వమెఱుఁగు * నతఁడెవ్వఁడైనను ।
బ్రాహ్మణుండెయనఁగఁ * బరఁగుచుండ । మఱియునగ్రవంశ * మందుఁబు
ట్టినవారె । బ్రాహ్మణులనుటంచుఁ * బల్కుటెట్లు॥ ౩౨॥ సీ॥ అనిన
రుక్మిణిపల్కు * లద్భుతంబుగనెంచి - పద్మదళాక్షుండు * పల్కెనిట్లు ।
కువలయ మందునఁ * గొందఱి బ్రాహ్మణు - లని వచించుటయెట్టు *
లనినవినుము । అలనేతిబీఱకా * యనియు బెల్లపుఁగొండ - యనిసువర్ణ
ముఖియు * ననియువచ్చు । నందులవ్యవహార * నామంబులే కాని - ఘృత
గుడకనకంబు * లెన్నఁగలవె । యట్లు వ్యవహారముననామ * మరయనొ
కటి । గలుగుఁ గాని బ్రహ్మాధి * కారమందుఁ । గొందఱందునఁ గనుపడ *
దందునైనఁ । గొందఱుందురుపరతత్త్వ * కోవిదులును॥ ౩౩॥ క॥ వీరలవంశ
జులునుము । న్నేరీతినిఁబుట్టియున్న * నిజ బ్రహ్మంబున్ । జేరియు బ్రాహ్మ
ణు లైరా । పేరే వీరలకువచ్చె * బెంపొందనిలన్॥ ౩౪॥ ఆ-వె॥ నేతి
బీఱకాయ * నెయ్యిలేకున్నను । నాఖ్యయొప్పుచున్న * యట్లు జగతి ।
వీరలిపుడు బ్రహ్మ * విదులుగాకున్నను । బూర్వవాదుకయును * బొక
వచ్చె॥ ౩౫॥ చ॥ పరగవిధాతసద్వదన * బాహులనూరుపదంబులందు
లన్ । వరుసగ బ్రహ్మక్షత్రియులు * వైశ్యులుశూద్రులుఁబుట్టిరంచునే ।

నరులును జాతిభేదముల * నాత్మఘటించెద రిట్లుపుట్టినన్ । గరిమను నొక్క బ్రహ్మమునఁ * గల్గినవారికి భేదమున్నదే॥ ౩౬॥ ఆ-వె॥ పనస వృక్షమందు * ఫలములుశాఖాగ్ర । మునమునడుమమూల * ములను గల్గు । నెగువదిగువపండు * లెవ్వియైనఁబనస। పండ్లుగాక వేఱు*పండు లగునె॥ ౩౭॥ చ॥ పొరిఁబొరిపాదయుగ్మమునఁ * బుట్టినవారలుశూద్రు లైనచో। హరిచరణంబునంగలిగి*నట్టిదెగంగకురాదెశౌద్ర్యము। న్నరు దుగనట్టిగంగనిల*నంటగవచ్చునెనగ్రజన్ములున్ । సరగునగారెశూద్రు లును*స్నానముపానములాచరించినన్॥ ఆ-వె॥ అదియుఁగాకయింక* నజునిపాదాంగుష్ఠ । మునను దక్షుఁడుదయ*మొందెఁగాదె। యతఁడు బ్రహ్మజాతి*యననెట్లుపొగడొందె। నతఁడుగాఁడెశూద్రుఁ*డరసిచూ డ॥ ఆ-వె॥ వందనంబునేయ*వదనంబునడుగుల । మీఁదఁబడునుగాని* పాదములును; మొగముమీఁదఁబడియు*మ్రొక్కవుపూజార్హ। మగు ట పదములెక్కు * వనఁగఁబరఁగె॥ క॥ వదనోద్భవు లెక్కువయని । పదజనితులుతక్కువనుచుఁ*బల్కఁగనేలా । వదనంబుముఖ్యమైనను। బదహీనులుసర్వహీన * పాత్రులుగారే॥ ౪౧॥ చ॥ అనుపమశాస్త్ర వాక్యముల * యర్థమెఱుంగఁగలేక తప్పుభా । వనలనొనర్తురీజగతి* వర్ణచతుష్టయ మాదిపంకజా । సను ముఖదోర్యుగోరుపద * సంభవు లౌటయబద్ధమెంతయున్ । వినుమిఁకవానియర్థములు*వేఱుగనున్నవి యంగనామణీ॥ ౪౨॥ సీ॥ షట్కర్మనిరతులై * సకలవేదపురాణ-శా స్త్రముల్విప్రులు * చదువుకతన । మహిజనాళికిధర్మ * మార్గముల్ దెల్పుచు-వాక్కుచేతనె తాము*బ్రతుకువలన। నట్టివాక్కును మోము* నందుంటనాస్యంబు-వలనఁబోషణమొందు*వారుగాని। యాననంబున జనన*మైనవారలుగారు- పరికించిచూడంగఁ*బద్మగంధి । క్షత్రియులు నస్త్రశస్త్రాది * చయముఁదాల్చి । భుజబలంబునరక్షణం * బొందు వలన । బాహుబలమునజీవించు * వారుగాని । బాహులందునఁ గల్గిన * వారుగారు॥ ౪౩॥ తే-గీ॥ వరుసవాణిజ్యవృత్తిచే * వైశ్యు లెపుడు । తొడలునూఁతగఁగూర్చుండఁ * బడుటఁజేసి । యూరువుల పూన్కి జీవించు * వారుగాని । యూరువులయందుఁ బొడమిన * వారుగారు॥ ౪౪॥ ఆ-వె॥ మెలఁతశూద్రులనను * మెండుగాఁగృషికిని।

బాదచారివృత్తి * వలయుఁగానఁ। బాదచారివృత్తి * బ్రతుకువారలు
గాని। పాదమునను గల్గు వారుగారు॥ చ॥ అరుదుగ ధాత్రిఁ దిగ్మనియు *
హస్తినిచిత్తిని శంఖినీయనం। బరఁగెడు నాల్గు జాతులును * బ్రాహ్మణక్ష
త్రియవైశ్యశూద్రులం। బరయఁగఁగల్గునింతు లెడ * నట్లు సమస్తకులంబు
లందునన్। బరఁగ గణింపఁగల్గుదురు * బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు
లున్॥౭౬॥ క॥ నిజముగను బ్రహ్మసృష్టినిఁ। బ్రజలెల్లను నెంచిచూడ *
బ్రహ్మకులంబే। నిజము డిగియన్యవృత్తులు। భజియించుటవలన జాతి * భం
గముగ గల్గెన్॥౭౭॥ ఆ-వె॥ సర్వజనులు బ్రహ్మ * జాతియేయైనను। రాజ్య
మేలుకతన * రాజులనియు। వర్తకంబుఁజేయ * వైశ్యులనియుఁగృషి।
సల్పశూద్రులనియు * సంభవించె॥ ౭౮॥ క॥ రాజిలు సత్వగుణంబు
లఁ। బోఁజేసి వికారకామ * భోగప్రియతన్। లోఁజేసి యుగ్రసాహస।
రాజసగుణియైనకతన * రాజనఁబరఁగెన్॥ ౭౯॥ ఆ-వె॥ జ్ఞానసత్వపర
త * మానిరజస్తమో। గుణములొందిధనము * కూర్చువాంఛ। లో
భమోహములను * లోఁగొని వాణిజ్య। మాచరింప వైశ్యుఁ * డనఁగనొ
ప్పె॥ ౮౦॥ క॥ తన మొదటి జాతిధర్మం। బును దొలఁగియశౌచహింస *
బొంకులచేఁగృ। ష్యనుపమవృత్తితమోగుణుఁ। డునునగుటను శూద్రుఁ
డనఁగ * నుర్విం జెలఁగెన్॥ ఆ-వె॥ జ్ఞానదానశౌచ * సత్యక్షమాహిం
స। భూతదయలునంత్య * జాతునందుఁ। గలిగియున్న నతఁడు * గాఁడు
చండాలుండు। నుత్తముఁడగుబ్రాహ్మ * ణుండుగాని॥౮౨॥ ఆ-వె॥ జ్ఞాన
సత్యములను * మానిహింసానృత। జారచోరకపట * క్రూరవృత్తి।
నొనరసల్పుబ్రాహ్మ * ణుండైన చండాలుఁ। డతఁడె చూడఁగాఁడు * నగ్ర
కులుఁడు॥౮౩॥క॥ కులములు దలఁపఁగఁబుట్టుక। వలనను వచ్చినవిగావు *
వసుమతిజనముల్। పొలుపొందఁజేయు వృత్తుల। వలనను సంభవము
లయ్యె * వర్ణింపంగన్॥ ౮౪॥ సీ॥ గణుతింపఁగా విశ్వ * కర్మకులజుఁ
డొక్క - తండ్రి కేవురుకూర్మి * తనయులైన। వరుసకమ్మరశిల్ప * వడ్రం
గమగసాల - కంచరంబాడిగాఁ * గల్గుపనులు। నొక్కొక్క నందనుం *
డొక్కొక్కపనిఁజేయ - వారికి వేర్వేఱ * వచ్చుపేరు। లౌరులుహాలికవృ
త్తి * నొనరింప రైతులు - వాణిజ్యమొనరింప - వర్తకులని। చెప్పుదురెవరే
వృత్తినిఁ * జేసిరేని। వారివారలకాపేరు * వచ్చుచుండు। నవనివృత్తులచేఁ

గల్గు*నాఖ్యలెలమిఁ। గులములకుఁబోల్చుచుందురు * కుటిలమతులు॥ ౫౫॥ ఆ-వె॥ వినుముకమ్మరీఁడు * మనుబ్రహ్మమయుఁడువ । డ్రంగి త్వష్టకంచ*రంబుశిల్పి । పరఁగనెన్నఁగాశి * పనివాఁడువిశ్వజ్ఞుఁ । డరయఁగ నగసాల * యగునుగాన॥ క॥ ఇలఁబంచబ్రహ్మలకును । గలిగిన వారెవరుగారు * గనబ్రాహ్మణులుర్ । గులమునఁబంచబ్ర । హ్మలునైనను గారుబ్రహ్మ * భావులుగాకర్॥ ౫౭॥ క॥ అనవిని స్త్రీపురుషాదుల। జననముభేదంబులెట్లు * సంభవమయ్యెర్ । వినిపింపుమనినరుక్మిణి। గనినవ్వుచుఁ జెప్పఁదొడఁగెఁ * గంసహరుండుర్॥ ౫౮॥ సీ॥ స్త్రీపురు

పిండోత్పత్తి లక్షణము.

షోత్పత్తిఁ * జెప్పెదవినుమింకఁ-దరుణిముట్టైనయై*దనదినంబు । మొదలుబేసిదివస * ములగర్భమొనరిన । నాతికినుదయించు*నాత్మజుండు । షట్కాష్టదశమాది * సరివాసరములందుఁ - బొలతికిఁజూలైనఁ*బుత్రి గాంచు। మఱియుఁబురుషునిశుక్ల *మధికరించినయేని-వలనొప్పనల్లని* వర్ణముగను । మెలఁతశోణితంబు * మిగులైననెఱ్ఱని । చాయయగును రెండు * సమమునైన । సంభవించుచుండ్రు*చామనవర్ణమై । బిసరుహాక్షులకును * బిడ్డలిట్టు॥౫౯॥ క॥ పురుషునివీర్యస్ఖలనం । బిరవుగనగు వేళఁజెదరి*యిరుబిందువులై । తరుణియుదరంబుఁజొచ్చిన । నరుదారఁగ జంటబిడ్డ * లగుదురుసతికిర్॥ ౬౦॥ సీ॥ రతిసల్పుఋతువేళ * రవినాడిఁగొనరుఁడౌఁ-గుముదాప్తుఁడునడువఁ*గూతురగును । తరణినాడియునింగి* తత్వమందుఁజరింపఁ-బుట్టునపుంసక * పురుషుఁడగుచు । శశినాడిపాఱినఁ*జదలుతత్వంబునఁ- గాంతయౌనదిమాచ*కమ్మయగును। నిఁకసుషుమ్నఁగూడి * యినచంద్రులుండినఁ। బంగ్వంధవెఱమూఁగ* బధిరులగుదు। రనిలతత్వమందు*నతివకుఁజూలైన । నమితప్రసవవేద* నంబుగల్గు। నగ్నితత్వమందు*నైననుగర్భంబుఁ। జెడునునిశ్చయంబు* చేడియలకు॥ ౬౧॥ క॥ మాయనుజెందియునీగతిఁ । బాయక స్త్రీపురుషులగుచుఁ * బహుకీటకదుష్కాయములెత్తుచుజీవుఁడు । మాయను బాయంగలేఁడు * మానినివింటే॥ ౬౨॥ సీ॥ క్షణభంగురంబని * చర్చింపలేకయూ- తనువుశాశ్వతమంచుఁ * దలఁచినరుఁడు । భ్రాంతుఁడైయిలఁదాను * బ్రతికినన్నాళ్లును- మోహవారాశిని * మునిఁగియుండుఁ

బగటికాలముకుటుం * బాదిసంరక్షణ - కునుధనధాన్యముల్ * గూ
ర్చుకొనుచు । రాత్రికాలమునతీ * రతులచేఁగొంతయు - గలలనిద్రలఁ
గొంత*గడపుకొనుచు । నంతలోఁజచ్చుబహుగర్భ * నరకములను ।
గాంచుసుఖదుఃఖజన్మాది * కములఁబడుచుఁ । గాలమూరకయీరీతిఁ *
గడపుఁగాని। తానుగడతేరుమార్గంబుఁ*దలఁచఁడెప్పుడు॥ క॥ అనవుడు
మరణమునిల్పెడు । ఘను లెవ్వరు నైనఁగలరె*గల్గువిపత్తుల్ । చనఁజే
యననినఁగాంతకు । ననుమోదముతోఁడఁగృష్ణుఁ * డపుడిట్లనియెన్ ।
చ॥ అరయఁగనూఱువత్సరము*లాయువటందురుమానవాళికిన్ । హ

## కర్మలక్షణము.

రువుగబాల్యమందుననో * యౌవనమందునోవార్ధకాననో । పురము
నఁగాననంబుననో * భూరుహమగ్నిజలంబులందునో । మరణమెనిశ్చ
యంబుసుమి * మానవుధాత్రినిఁ బ్రాణికోటికిన్ ॥ ౬౭॥ క॥ మరణ
మువచ్చినవేళను। ధరఁదూఱినజలధిఁజొచ్చి*దాఁగిననైనన్ । మరిమిం
టికెగసిపోయినఁ । బరమాయువునిల్పవశమె * బ్రహ్మకునైనన్ ॥౬౮॥
క॥ ప్రతిదేవతకునుమ్రొక్కిన । బ్రతుకనివాఁడెన్నఁటికిని * బ్రతుకఁడు
జగతిన్ । బ్రతికెడువానికిమ్రొక్కిన । బ్రతుకునుమఱిమ్రొక్కకున్న*
బ్రతుకునుగాకన్ ॥౬౯॥ చ॥ మరిమరియౌషధంబులను*మంచివిమంచి
వియారగించినన్।బరువడిఁజెందుకర్మపరి*పక్వముగ కయెపోవుజాడ్య
ముల్। వరుసగమంత్రయంత్రకులు*వైద్యులునాయతకోట్లువచ్చినన్।
మరణముపూర్ణమైచనెడు * మానవునిం బ్రతికింపలేరిలన్ ॥ ౭౦॥ చ॥
తడయకయింటిమూలలను*దాఁచినద్రవ్యమువోవువీథిలోఁ। బడినను
నుండుబొమ్మదియుఁ*బ్రాప్తముగల్గినఁజిక్కువానికే। కడుబలుఁడైనబం
ధువులు * కాపుగనున్ననుజచ్చునింటనే। నడవినిదిక్కులేనినరుఁ*డైన
నురక్షణమొందుచుండెడిన్ ॥ ౭౧॥ తే-గీ॥ దైవయోగంబుదెలియం
గఁ*దరమెసర్వ। జీవులనునెల్లఁదనకుఁదా * సృష్టిఁజేయుఁ। బోషణముఁ
జేయుసర్వంబుఁ*బొలియఁజేయు । నాతఁడేమూలకారణం * బఖిలము
నకు॥ ౭౨॥ ఆ-వె॥ నేనెకర్తనంచు *నెంచునుమనుజుండు। తానెకర్త
యైన*దైవమేల। యైనపనులకెల్ల*నైననుదాఁగర్త। కానిపనులకేల*
కర్తగాఁడో॥౭౩॥ క॥ తనయిష్టము సమకూరినఁ। దనప్రజ్ఞయటంచు

నరుఁడు*దలఁచుచునుండుఁ। దనతలఁపునెగడకుండినఁ। దనప్రారబ్ధం
బటంచు*దైవముఁదూఱుఁ॥ ౭౨॥ తే-గీ॥ ఎవరి కేవేళ కేమేమి*యె
ట్టులెట్లు। జరుగవలెనా తెఱంగున * జరుగుచుండ। నహాముచేతను
దమప్రజ్ఞ*యనుటె కాని। యెవరకైనను గర్తృత్వ*మేమిగలదు॥ క॥
సముదయకాలమునందున। సమయము నెడఁ లేకయుండు*స్వాతంత్ర్యం
బుల్। దమకెట్లుగల్గుమధ్యను। భ్రమఁగొనినమున్నాళ్లమిట్టి*పడుజీవు
లకుఁ॥ ౭౪॥ క॥ చావునుడగ్గఱఁజావక। యేవిధకష్టములఁబడక*యిల
సుఖులైయుండఁ। జావవలెనన్నయప్పుడె। చావంగావలయుఁగర్త*జను
డైయున్నఁ॥ ౭౫॥ తే-గీ॥ కష్టములెవచ్చునో సుఖమె * గలుగఁబో
నో। యెఱుఁగశక్యమె యేవేళ*కేది యేది। ప్రాప్తమౌన దెతమకర్మ *
ఫలములంచు। నెఱుఁగవలయును నిలలోన * నెవ్వరైన॥ ౭౬॥ ఉ॥
కూరిమిమీఱమానవులు*గోరుచునుందురు సౌఖ్యమెప్పుడుఁ। గోర
వమొప్పఁగష్టములు * గావలెనంచును గోరరెవ్వరుఁ। గోరకవచ్చు
గష్టములు * కోరినరావుసుఖంబు లేరికిఁ। వారలపాపపుణ్యములె *
వారికొనర్చును గష్టసౌఖ్యముల్॥ ఆ-వె॥ అతివవానివాని * ఋతు
కాలములఁబుష్ప। ఫలములెట్లుదోఁచు * పాదపములఁ। గర్మతరుల
నట్లు * గల్గునుసుఖదుఃఖ। ములునునప్రయత్న*ముగనుదఱిని॥ ౭౭॥
తే-గీ॥ అరయఁదమపూర్వపుణ్యంబు* లనుభవించు। కాలముననల్ప
లకునైనఁ*గల్గుసుఖము। పరఁగఁదొలిజన్మమునఁజేయు*పాపఫలము।
ననుభవించకున్నెనుదీఱ*దధికులైన॥ ౭౮॥ క॥ ఇలనుహరిశ్చంద్రుండు
ను। నలుఁడాదిగఁబొందినట్టి * నానాకష్టం। బులనెవ్వరైనజగతినిఁ।
దొలఁగించిరెకర్మఫలము * దుడిచినఁబోనే॥ ఆ-వె॥ కర్మఫలముచేత*
గష్టసుఖంబులు। గలుగుచుండునరుల*కందఱికిని। గాన కర్తయొకఁడు*
గలఁడెదుఃఖసుఖంబు। లనుభవింపఁజేయ * నదియుఁబాప॥ ౮౦॥ క॥
నేనేకర్తయటన్నను। మానవునింజూచికర్మ * మాటకినవ్వుఁ। నే నీ
రేడుజగంబుల। లోనను గలప్రాణికోటి * లోఁజేసెదనన్॥ ౮౧॥ సీ॥
కర్మానుబంధానఁ * గల్గునుసంగంబు - కర్మాంత కాలాన * గతము
నొందుఁ। బెండ్లాముబిడ్డలు * ప్రియబంధులుహితులుఁ * దల్లిదండ్రు
లునన్న * దమ్ములంచు। నాధనంబుగృహంబు * నాభూములివియంచుఁ

గర్మతంత్రమున న * జ్ఞానవశత । నీ జీవ తనువు లే * నిక్కంబుగా
నెంచి-చిక్కంబులోఁబట్ట * చిక్కుభంగి । జనుఁడు మిథ్యయైన * సంసా
రమునఁజిక్కి । యది యొసత్యలోక * మదియెస్వర్గ । మదియెవిష్ణులోక *
మదియెకైలాసంబు । గానునమ్మిముక్తి * గానలేఁడు ॥ ౨౩ ॥ ఆ-వె ॥
సంచితంబుకతన * జన్మంబుగలిగెను । జన్మవలనఁగలిగె * స్వానుభవ
ము । స్వానుభవమువలన * జన్మప్రాప్తియెగాన । సంచితంబెవిత్తు *
జన్మమునకు ॥ ౨౪ ॥ కం ॥ ఘోరమగుసంచితంబుల । భారంబును దొ
లఁగఁదొలఁగుఁ * బ్రారబ్ధంబుల్ । ప్రారబ్ధంబుదొలంగిన । తోరపునా
గామిజన్మ * దొలఁగునరునకున్ ॥ ౨౫ ॥ ఆ-వె ॥ కలుగుచుండుబుద్ధి *
కర్మానుసరణిగాఁ । జిత్తమనుసరించి * చేయుపనులు । నేఁతననుసరించి *
చెందుఫలంబును । గడవలేరుకర్మఁ * బుడమినరులు ॥ ౨౬ ॥ క ॥
అనఫలముపురుషయత్నం । బును లేకయె దైవమిడునొ * పురుషునియ
త్నం । బున నేఫలములభించునొ । యనియడిగిన శకటదైత్య * హరుఁ
డిట్లనియెన్ ॥ ౨౭ ॥ క ॥ కొందఱుపౌరుషమేఫల । మందురు దైవమని
కొంద * ఱందురుమఱియున్ । గొందఱుభూతన్యాయం । బందురు దెలి
యకనుగర్మ * పద్ధతులబలా ॥ ౨౮ ॥ తే-గీ ॥ జోకతోఁబురుషయత్నంబు *
లేకయున్న । దైవమేరీతిఫలమును * దమకునిచ్చుఁ । దాముయత్నంబుఁ
జేసిన * దైవమొసఁగు । వారివారలకర్మాను * సారముగను ॥ ౨౯ ॥
క ॥ వనజాక్షీ పురుషయత్నం । బునుగలిగియు దైవయత్న * మును లేక
ఫలం । బొనరదుమనుజప్రయత్నం । బులు లేకయ దైవయత్న * ము
గలిగియున్నన్ ॥ ౩౦ ॥ తే-గీ ॥ ధరణివంటిది పురుషయ * త్నంబుబీజ ।
మరయఁగా దైవసహకార * మవియు రెండు । నేకమైనను ఫలియించు *
నిష్టసిద్ధి । యట్లుగాకున్న ఫలమీయ * దంద్రుబుధులు ॥ ౩౧ ॥ క ॥ విను
ధాత్రిలేనిబీజం । బును బీజము లేని క్షేత్ర * మును నిష్ఫలమ । ట్లనుపమ
కార్యఫలంబును । గనుటుత్తది పురుష దైవి * కములొనరకయున్ ॥ ౩౨ ॥
తే-గీ ॥ చమురునింకినదీపంబు * సమయుపోల్కి । మనుజుఁడునుగార్య
యత్నంబు * మానినపుడె । వరుసగఁదొలఁగిపోను దై * వానుకూల ।
మనియెడు నదృష్టమెంతయు * వనజగంధి ॥ ౩౩ ॥ క ॥ మనుజుఁడుయత్న
ముఁజేయక । తనప్రాప్తంబనినఁదనకు * దైవం బెచటన్ । గొనివచ్చి

పెట్టుయత్నం । బనువుగఁగావింపవారి * భాగ్యముపిదపఁ॥ ౯౪॥
ఆ-వె॥ అగ్నికొంచెమైన * ననిలంబునఁబ్రబల । మైనచందమునను *
మరిసుకర్మ । వృద్ధినొందుచుండు * వెలయదైవానుకూ । లమునయ
త్నమునఫ * లంబుగలుగు॥ ౯౫॥ క॥ మునుసత్కర్మంబించుక ।
యును జేయక యత్నములను*నొనరించినయా। తనికిని దైవముతోడ్ప
డఁ। డనువుగఁగర్మములనీయఁ*డతనికిఫలముఁ॥ ౯౬॥ క॥ వినుపౌరు
షంబుకంటెను । ఘనమగుదైవంబుముఖ్య * కారణముఫలం। బును
నైనఁబౌరుషంబును । మనమలరఁగదైవదత్త * మనఁదగునదియుఁ॥
క॥ అనభక్తియెన్ని తెఱఁగులు । వినిపింపుమయదియునెట్టి*విధమున
నగునే। యనువునఁగల్గునుజ్ఞానము। మనుజునకననింతిఁజూచి*మాధ

## భక్తిలక్షణము.

వుఁడనియెఁ॥ ౯౮॥ ఆ-వె॥ వినుముభక్తిమూడు * విధములునగు
బాహ్య। భక్తియనననన్య * భక్తియనఁగ । నెసఁగుఁబంకజాక్షి*యే
కాంతభక్తినా । వెలయుఁదద్విధంబుఁ * దెలియవలయు॥ ౯౯॥ ఆ-వె॥
శ్రవణకీర్తనంబు * స్మరణంబుఁబాదసే। వనమునర్చనంబు * వందనం
బు। నతులదాస్యసఖ్య*మాత్మనివేదనం। బనఁగనవవిధములు*బాహ్య
భక్తి॥ ౧౦౦॥ క॥ పరమయమువిశ్వమనియును । బరమావిశ్వమయమ
నియుఁ * బరమునకన్యం । బరయఁగలేదని హృదయము। స్థిరమాట
యనన్యభక్తి * సిద్ధముతరుణీ॥ ౧౦౧॥ క॥ పెదవులు గదలింపకమది।
సదయతఁబరమాత్మఁగూర్చి * చక్కఁగమదినిం । పొదవఁగఁదదేకనిష్ఠ
గ। నదియగునేకాంతభక్తి * హంసవిహారీ॥ ౧౦౨॥ క॥ వినుసత్కర్మా
చరణం। బునభక్తియుఁబొదలుదానఁ*బొందునుజ్ఞానం। బునుకర్మలే
కభక్తియు । మునుభక్తియులేకగాదు * మోక్షపదంబుఁ॥ ౧౦౩॥
ఆ-వె॥ వరసుకర్మపిందె*వంటిదిదానిచేఁ। బడయుభక్తికాయ * వంటి
దరయ । దానివలనఁగల్గు*జ్ఞానంబుభావింపఁ। బండువంటిదగును * బ
ద్మనేత్ర॥ ౧౦౪॥ ఆ-వె॥ కర్మయనెడుపిందె * గతమైనభక్తియఁ । గా
యలేదుదలఁపఁ*గర్మయనెడు । పిందెచెడకయున్నఁ*బెంపొందుభక్తి
కా । యదియుఁజెడినఁగల్గ * దాత్మఫలము॥ ౧౦౫॥ క॥ వనితాకర్మ
ముభక్తియు । నొనరింపకజ్ఞానమొంద*నోపరెవంద్రుఁ । విను మొద

లుఁబట్టివృక్షం। బునుబ్రాకకయగ్రమునకుఁ * బోవంగలరే॥ ౧౦౬॥
ఆ-వె॥ నిట్టనిలువుగాను*నిలుచున్నవాఁడుగూ। ర్చుండిపండుకొనిన*
సుఖమునొందు। పరఁగనట్లనిలిచి * పడుకొనఁబోయిన। వసుధఁగూలి
శిరము * వ్రయ్యఁగాదె॥ ౧౦౭॥ క॥ మునుభక్తిలేనిజ్ఞానం। బునుజ్ఞా
నములేనిభక్తిఁ*బొందరుముక్తిన్। జనులందునట్లుగావునఁ। గనఁదగు
నిలజ్ఞానభక్తి * కర్మములట్లున్॥ ౧౦౮॥ ఆ-వె॥ కర్మచయమువలనఁ
గల్గునుజ్ఞానంబు। జ్ఞానమునను బాయుఁ * గర్మచయము। కర్మమునకు
దవ్వు * జ్ఞానియుభావింప। జ్ఞానికొనరదవ్వు * కర్మచయము॥ ౧౦౯॥
క॥ అని తెల్పుచక్రపాణినిఁ। గనుఁగొనికర్మంబులెన్ని*గతులగుఁగర్మం।
బననెద్దియనినరుక్మిణి। కినిఁదెల్పఁగనిట్టులనియెఁ * గృష్ణుండెలమిన్॥

## కర్మలక్షణము.

క॥ కొందఱుకర్మముషడ్గతు। లందురుమఱికొందఱిలను * నదియుద్వి
విధమా। నందురుతద్విధములనిటఁ। బొందుగవినిపింతువినుము*పూ
ర్ణేందుముఖి॥౧౧౧॥ తే గీ॥ మొదటలౌకికవైదిక*ములనఁగర్మ। రెండు
పద్ధతులందురా * రెంటియందు। లోకకార్యంబులనునెల్ల * జోకతో
డ। నాచరించుటలౌకికం * బండ్రుబుధులు॥ ౧౧౨॥ వ॥ ఓ యిందు
ముఖీ యందువైదికంబు నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధప్రాయశ్చిత్తంబు
లనుకర్మంబులైదువిధంబులని చెప్పుదురిప్పుడు వానిచందంబుఁదేఁట
పడ వివరింతునాకర్ణింపుము॥ ౧౧౩॥ తే-గీ॥ దేవతర్పణమునువైశ్వ*
దేవహోమ। స్నానసంధ్యాభివందన * జపతపంబు। లర్థిసత్కారము
లునాది * నాచరించు। నదియెపోనిత్య కర్మంబ*నంగనొప్పు॥౧౧౪॥
తే-గీ॥ తలఁపసంక్రాంతినుత్తర * దక్షిణాయ। నములనర్ధమహోద
య * విమలపర్వ। దినములనుస్నానజపములు * దీర్చికొనుట। యా
దినైమిత్తికపుఁగర్మ*మనఁగఁబరఁగు॥ ౧౧౫॥ ఆ-వె॥ రమణియశ్వమేధ*
రాజసూయాధ్వర। పౌండరీకసోమ*మాదిగల్గు। యాగములనుబ్రీతి*
ననువొందఁజేయుట। కామ్యకర్మమనఁగ * గణుతికెక్కె॥ ౧౧౬॥
క॥ పరధనహరపరనిందా। పరదారాగమనమద్య*పానవిచేష్టా। పర
హింసానృతచలత। స్కరమాదినిషిద్ధకర్మ * గాఁదెలియఁదగున్॥౧౧౭॥
క॥ జలవాయుపర్ణభక్షణ। సలుపుటవనవాసముంట * చాంద్రాయణ

ముగ । సలుపుటయుఁదీర్థయాత్రలు । నిలప్రాయశ్చిత్తకర్మ * నియతి యనఁదగుగ॥ ౧౧౮॥ వ॥ ఇంకనునిషిద్ధకర్మంబునకుఁ బంచగవ్యాది కర్మంబులాచరింతురనిచెప్పి యో కాంతామణీయిప్పు డిరుమూడు దెఱంగులకర్మ తెఱంగెఱింగించితి నింకసుకర్మ దుష్కర్మ జ్ఞానకర్మంబులను నీవు త్రైఱంగులకర్మ చందంబెఱింగింతు వినుమని యిట్లనియె॥ సీ॥గుడి గోపురములాది * కూపతటాకముల్ - ధరణినిల్పుటసూనృ * తాత్ముఁ డౌట । తగనన్న దాన స * త్రము లేర్పరించుట- సదమలాధ్వరములు* సల్పుటయును । నేకనారీవ్రతా * న్వితుఁడుగానుండుట - నిలనహింసా విషయ*నియతుఁడౌట । నర్థిబంధువుగురు * నాలిఁబోషించుట-నిత్య సత్క్రియలాది*నెఱపుటయును। దైవభక్తియుబుధసేవ*ధర్మవృత్తి । నాచరించుటతీర్థాది * యాత్రలకును । జనుటసత్కథల్ వినుటయుఁ* జదువుటయును । నాదిగఁగలదిసత్కర్మ * యనఁగనొప్పు॥ ౧౨౦॥ సీ॥ పితృమాతృలనుగాసి*పెట్టుటయునుజీవ - హత్యయుజ్ఞాతిద్రో*హాది కమును । బరసతీసంగంబుఁ * బరదూషణంబును - బరధనచౌర్యంబుఁ* బరవిరసముఁ । దీఱనిక్రోధంబు*దేవవిద్వేషంబు-గురువంచనంబును * గుజనమైత్రి । ననృతంబుఁగపట మ * నార్యకార్యంబును- మద్యపాన ముజూద * మాడుటయును । వేదదూషణసత్పాత్ని * విడుచుట యును । బరులతేజంబుకోర్వమి*ప్రల్లదనముఁ । బొరయుటయునాత్మ వినుతియు * దురితచేష్ట । లాదిగఁగలదిదుష్కర్మ * యనఁగబరఁగు॥ ౧౨౧॥ సీ॥ సతిసుతహితబంధు * సంసారమునఁగల్గు - ననుభవంబు లుమాయ * యంచుఁ దెలిసి । శమశౌచదమసత్య*సద్గుణసహితుఁడై - సద్గురూత్తముపాద * సరసిజములు । సేవించినిరతంబు * సేవఁజేయు చుగురు - కరుణచేఁదన్నుఁదాఁ*గాంచి తెలివి। తనువునింద్రియమును* తాను గాననియాత్మ-తత్వమే తానని * తగనెఱింగి। మఱియుసత్కర్మ దుష్కర్మ * మనఁగఁబరఁగు । బీజముల రెంటిజ్ఞానాగ్ని * వేల్చితాను। మానకనుసచ్చిదానంద * మయుఁడునగుట । జ్ఞానకర్మంబనంబడు * సారసాక్షి॥ ౧౨౨॥ చ॥ చెలువుగఁ జేసిపుణ్యములు * చెందుచు నుందురు పుణ్యలోకముల్ । కలుషములాచరించియును * గాంతురు సూయమలోకబాధలగ । బొలుపుగఁగష్టసౌఖ్యములు * పొందుచు

నుందురు మర్త్యలీగతిఁ । గలుషము పుణ్యముఁ దొఱఁగి * గాన రె
యార్యులు జన్మశూన్యముఁ ॥ ౧౨౩ ॥ ఆ-వె॥ అనినఁగష్టసుఖము*
లవనిజనించియే । నరులుకర్మఫలము * ననుభవింప । నరయఁబడవు
లేల * నరకంబునిం కేల । యనినఁగాంతకనియె * నాత్మవిభుఁడు॥
౧౨౪॥ సీ॥ వనజాక్షియాస్వర్గ * వైకుంఠకైలాస - బ్రహ్మలోకాదిస*
త్పదవులకును । బోవఁజాలినయంత * పుణ్యముల్ సేసిన - వారలా
యాలోక * వైభవములు । వడయుదు రాపుణ్య* పదవులకును నేగఁ-
జాలనిసుకృతంబు * సల్పునట్టి । జనులుమర్త్యమున నే * జనియించి
తమతమ - పుణ్యములకొలఁది * భోగములను । బొందుచుండెద
రీరీతిఁ * బువ్వఁబోణి । పుణ్యలోకంబులకు నేగు * పుణ్యులైన ।
వారివారలపుణ్యముల్*వరుసఁగుడిచి। మగుడిజన్మింతురీయుర్వి*మను
జులగుచు॥ ౧౨౫॥ సీ॥ బహుపాపములు సేయు * పాపాత్ములకునైన-
స్వల్పపాపమొనర్చు* జనులకైనఁ । బోకతీఱదుయమ * పురికంత్యకా
లాన - నాదండధరుశిక్ష * కర్హమైన । నటనరుల్ బాధింతు * రాశిక్ష
కునుజాల - నట్టివారలుయము * నాజ్ఞమరల । ధరణిఁబుట్టియు రాజ*
దండనరుగ్మదా - రిద్ర్యముల్ విషమృగో * పద్రవములు । నాదిగాఁ
గాంతురదిగాక * నరకలోక ।పాత్రులయిశిక్షతగుభంగిఁ* బడసియం
తఁ । బక్షికీటకక్రిమిమృగ * పశువులాది । జన్మములునొందుచుందురీ*
జగతిలోన॥ ౧౨౬॥ క॥ నావుడు కాయముఁబాసియు । జీవుండేలాగు
పోవుఁ*జెందును బదవుల్ । ఏవిధమునొందుబాధలు । భావించియుఁదె
ల్పుమనినఁ*బరమాత్ముఁడనుఁ॥ ౧౨౭॥ సీ॥ కలయందుఁదానేగి * ఘ
నముగానొకచోవి - విధసౌఖ్యము లనుభ * వించినట్టు । లీమేను
విడనాడి * యీలోకముమఱచి - యతిసుకుమారదే * హములు
దాల్చి । పుణ్యాత్ములగువారు * పుణ్యలోకములకు * నరుదెంచిభో
గంబు * లందఁగలరు । స్వప్నానఁదానొక్క * సదనంబునకుఁబోయి
బహుకష్టములనెల్లఁ*బడినరీతి। దేహముల్ఁబాసియాతనా*దేహముల
ను।బడసియీలోకజాలంబు*మఱచిఖిలులు। పోయియమలోకశిక్షలు*
పొందఁగలరు। నిశ్చయంబింతయునుభామి*నీలలామ॥ ౧౨౮॥ క॥ అన
వుడుభూలోకసుఖం । బునకును నాపదవులకును*బోల్పఁగభేదం। బును

గలదె దెల్పుమనుసతి। గని ప్రియమునసిట్టులనియెఁ *గమలాక్షుండున్।
౧౨౯॥ సీ॥ ఘనముగా భూలోక*జనులకందఱికంటెఁ- బరికింప హెచ్చు
భూ*పతిసుఖంబు। భూపతినూఱేండ్లు * భువిని ననుభవింప-నతులితా
నందమై * నట్టిసుఖము। మునుదేవతాసుఖ * మునకొక్కకను రెప్ప-
పాటుకాలమునకు*సాటిగాదు। భూలోకసుఖమేడఁ*బుణ్యలోకంబుల
సుఖమేడఁదలపోయ * సుందరాంగి। యమితపుణ్యంబులను జేయు *
నట్టివారు। గాక యీలోకసుఖములు*గాంచఁగలరె। యట్టిపదవులకును
జాల*నట్టినరులె। పుడమిపై రాజులాదిగాఁ*బుట్టుదురుగ॥ ౧౩౦॥ ఆ-వె॥
సుదతియలవిగాని * సుఖమదిగనుకనే। పదవులందునెల్ల * భ్రాంతిప
డుట। యిలనునొక్కరైనఁ*దలపోయనరకంబు। గోరువారు*గలరె
సారసాక్షి॥ క॥ ఎంతటిపుణ్యముఁజేసిన। నంతటిఫలమొందుఁగాక *
నరులకునిలనొ। క్కింతసుకర్మము సేయక। యెంతగఁగోరినను రావు*
హెచ్చుసుఖంబుల్॥ ౧౩౨॥ క॥ భూజనులకెల్లవారికి। రాజత్వముచే
యుబుద్ధి * రంజిలుచుండున్। రాజత్వమెట్లు సేతురు। భూజనులర
యంగస్వల్ప * పుణ్యులుగాన్॥ ౧౩౩॥ క॥ రాజునకుఁగల్గుచేతులు
భూజనులకు లేదెయతని * పుణ్యంబదియున్। భూజనులకెట్లుగల్గును।
రాజత్వము సేయుటకును * రాజీవాక్షీ॥ ౧౩౪॥ ఆ-వె॥ అఖిలజనులు
తన్ను * ననుసరించియుఁగొల్చు। నంతఫలము రాజు * నాచరించె।
నంతఫలముఁజేయ * నట్టివారలు రాజ్య। భోగములనుగోరఁ* బొంద
నగునె॥ ౧౩౫॥ క॥ నావుడు యమలోకంబున। నేవిధకర్ములకు మఱియు*
నేయేశిక్షల్। గావింతురను చుఁబల్కిన। నావికచదళాక్షిఁజూచి*హరి
యిట్లనియెన్॥ ౧౩౬॥ క॥ వనజాక్షిపుణ్యచరితము। వినిపింపఁగవచ్చు
నీవు * వినఁగావచ్చున్। మునుపాపజనులవర్తన। లనువినఁదగదైనవి

### యమదండన వివరణము.

నుము*లలినెఱిఁగింతున్॥ ౧౩౭॥ సీ॥ కలుషాత్ములకునంత్య * కా
లంబునందునఁ - గాలదూతలుగదా * ఖడ్గపాశ। ధారులై భీకరా *
కారులై తమచుట్టు - ముట్టడించియుఁబాశ * ములనుజుట్టి। పట్టికల్వార
మొందఁ * బ్రాణముల్ పెకలించి-యాతనా దేహంబు * లందుఁజేర్చి।
నీళ్లనుబ్బలిగండ్ల * నిప్పుగుండంబుల - రాళ్లగుట్టలముండ్ల * రాసు

లమిత । తేళ్లుపాములు బెనఁగొను* తెరువులందు । నడలుపుట్టంగనడి
పించి * యఘజనాళి। మొఱలువెట్టంగయమలోక*మునకుదూత। లట్టె
గొంపోయియము్రమోలఁ * బెట్టినిలువ॥ ౧౩౮॥ క॥ శమనుండెవరె
వరికినే। క్రమమమునదండింపనాజ్ఞ*గావించునొయా। క్రమమునబా
ధలువెట్టుదు ; రమరంగాయమునిభృత్యు * లదియెట్లనినన్॥ ౧౩౯॥
ఆ-వె॥ చెలఁగివేఁడకతన * జీవులహింసించు । పాపిజనులనొడలు*బ
డలఁగొట్టి । యుక్కుఱంపములను * నురువడిఁగోతురు । వెక్కివెక్కి
యేడ్చ * మ్రొక్కులిడఁగ॥ ౧౪౦॥ క॥ తలిదండ్రులబాధించిన। తులు
వనువడిఁగ్రాగునూనె * తొట్లనువరుసన్ । బలుమాఱువేసిముంతురు।
మలమలమాడంగమేను*మఱివడఁకంగన్॥౧౪౧॥ ఆ-వె॥ జాతులెన్ని
నట్టి*చండాలునకుసర్వ। యెంగిళులనుమెసవ*నెసఁగఁబెట్టి।యతిభయం
కరంబు * నైనచీఁకటికోన । యందునొంటినుంతు * రడలువొడమ॥
౧౪౨॥ క॥ పరులకునెగ్గొనరించిన । దురితాత్ముఁబాపమనక * దుష్ట
ఫణులచే । మరిమరివృశ్చికములచేఁ । గఱపింతురుబొబ్బలిడుచు*గాసి
ల్లంగన్॥౧౪౩॥ఆ-వె॥ జారవృత్తిసల్పు*జనసంతతులభగ్గు।భగ్గుమండు
లోహ * ప్రతిమలకును । నడలియార్వఁబట్టి*యంటింతురటుతొంటి।
కామసుఖములిందుఁ*గాంచుఁడంచు॥ ౧౪౪॥ క॥ జ్ఞాతులద్రోహముఁ
జేసిన।పాతకులనునంటఁగట్టి * పశుచర్మములన్। రోఁతగుదుర్గంధపు
మల । నూతులఁబడఁద్రోతురంత * నోయనికూయన్॥ ఆ-వె॥ నిండు
చెఱువులకును*గండివెట్టియునీళ్లు। వెడలఁగొట్టినట్టి * జడులఁబట్టి।పర
శుధారఁదలలు * వగులంగవేతురు । కుయ్యొమొఱ్ఱొయంచుఁ*గూఁత
లిడఁగ॥ ౧౪౫॥ క॥ తెరువులకుఁగంపవేసిన । నరులనుదలక్రిందునిలిపి*
నయనములందున్ । మరిదేహమందునెల్లెడ । నరువంగానినుపముండ్లు
నాటింతురొగిన్॥ ౧౪౬॥ తే-గీ- కచ్చకునుగాలుద్రవ్వుచుఁ * గలహ
మునకుఁదిరుగువారలవడిఁబట్టి*తెగువమీఱఁగడుభయంకరశస్త్రివ*
ర్గములచేత । నమలిమ్రింగంగఁజేయుదు * రార్పులెసఁగ॥ ౧౪౭॥ క॥
క్షితినిదురాపేక్షలుగల । మతిహీనులకశనమునకు*మసినిడిసీసం । బతి
గాఁగాచియుశిరముల। నతులితముగఁగోతురాత్మ * లలమటనొందన్॥
౧౪౮॥ ఆ-వె॥ మున్నుదేహసౌఖ్య * మునుగోరిప్రాణులఁ । జంపి

జన్నములను * సల్పువారిఁ। గఱుకత్తిగముల * ఖండఖండంబులు।
గాఁగఁగ్రోతురచటఁ*గాలభటులు॥ ౧౫౦॥ క॥ వారుణిపానమొనర్చిన।
క్రూరునియమదూతలట్టె * గొంపోయిక్రిముల్ । బారాడుమాత్ర
గుండము। లోఁ రయమునఁద్రోతురందు * లోనల్లాడన్॥ ౧౫౧॥ తే-గీ॥
చెలఁగిగృహములుదహనంబు*సేయుఖలుని। గ్రుడ్లుదీసియుఁదలఁబెద్ద*
గుండునెత్తి। వీథివీథులఁద్రిప్పియు*విషమయాగ్ని। గుండములఁద్రో
తురత్యంత * గోడుఁజెంద॥ ౧౫౨॥ క॥ పరధనముతస్కరించిన। నరు
లనునసిపత్రవనము * నందుననిడియున్। బరువులు పాఱింతురుతను।
విరువంకలఁ దెగియుఁ గండఁలిలపైఁబడఁగన్॥ ౧౫౩॥ ఆ-వె॥ గురుని
నిందసేయు * ఘోరపాపాత్ముని। నట్టెనూఱుయోజ* నములుపొడవు।
కొట్టుమొనయు నోట * గ్రుచ్చి వ్రేలాడంగఁ। జేతురతఁడువెఱపుఁ*
జెందియేడ్వ॥ ౧౫౪॥ క॥ నమ్మించిమోసపుచ్చిన। యమ్మనుజాధములఁ
బట్టి* యాఁగ్రహమెసఁగన్। హుమ్మనినేలకువంచియు। సమ్మెటలన్ గొట్టు
దురుగ * శమనునిదూతల్॥ ౧౫౫॥ ఆ-వె॥ తగవుమాలిసభను *
దాఁబక్షపాతియై। మాటలాడునట్టి*మనుజునని।గగనమందుచుండు*
నగముపైనెక్కించి। పడఁగఁద్రోతురాత్మ * బడలుపడఁగ ॥ ౧౫౬॥
క॥ తెంపునవిషమిడియమపురి। కంపితదుర్జనులనగ్ని* కంబంబులకున్।
బెంపెల్లఁదూలఁగట్టుదు। రింపుచలింపంగభటులు * హీనకరుణులై ॥
౧౫౭॥ ఆ-వె॥ దైవభక్తిలేని * తంత్రజ్ఞులనుబట్టి। మశకమత్కుణా
ది * మక్షికములు। గలుగుఘోరమైన * గాఢాంధకూపానఁ। ద్రో
తురందుఁగూలి * దుఃఖమొంద॥ ౧౫౮॥ క॥ పరులనుదూషించినయా।
నరులనుజిహ్వలఁదునుముచు* నాయమదూతల్। మరియునుపముక్కు
కాకులఁ।బొరిఁబొరిగుంపులనుగూర్చి*పొడిపింతురొగిన్॥ ౧౫౯॥ ఆ-వె॥
అనృతములనునాడు*నట్టిచండాలుని। మజ్జమాంసరక్త * మకరమీన।
వాసమైనయట్టి * వైతరణీనది । యందుఁబడఁగవైతు*రడలుపుట్ట॥
క॥ ఇలనుబతివ్రతయగుస। త్కులకాంతనువిడిచినట్టి * కుటిలమనుజు
నిన్ । నిలువెల్లఁదోలుదీసియుఁ। బలలము కుక్కలకుఁగోసి * పడవేతు
రటన్॥ తే-గీ॥ ధనికుఁడైతిన కర్థికిఁదానమీని। కుజనునకుఁ గ్రొత్త
సున్నంబుఁ * గుడువఁబెట్టి। పరఁగఁబల్లేరుకాయల * పాన్పుమీఁదఁ।

బండఁబెట్టుదురోయని * బాధఁజెంద॥ ౧౬౨॥ క॥ మానినిసత్కథలె
న్నఁడు । వీనులఁజొరనీని యధమ * విడువకవడిగా । నూనెంబొంగఁగ
గాఁచియు। వీనులలోఁబోతురమిత * వేదననొందన్॥ ౧౬౩॥ ఆ-వె॥
ఒకనికలిమిఁజూచి * యోరువఁజాలని । పశుసమానుఁబట్టి * బాడిస
లను । జెక్కుచంద్రుడుతనువు * చిదురులై మరలను। నొక్కటిగనుగూ
డు * చుండునదియు॥ ౧౬౪॥ క॥ దండింపఁదగనిసాధుల । దండించిన
పాతకులను * దనపాశమునన్ । దండిగఁజుట్టియుమరిమరి । దండనగా
వించుయముఁడు * దారుణశక్తిన్॥ ౧౬౫॥ ఆ-వె॥ బ్రహ్మవిదులఁ
జూచి * పరిహాసమొనరించు । పాతకులనుబట్టి * పాపమనక। నరకఁగా
యమెల్ల*జల్లెడకంతలు।వడఁగనలుగుగములఁ*బొడుతురందు॥౧౬౬॥
క॥ భూతలి రుణశుచిఁజేయని । పాతకుజేతాళభూత * బ్రహ్మదనుజ
దుర్ । వ్రాతములకొప్పగింతురు । ఖ్యాతిగనవిపవలు రాత్రి*ఘాతలు
పెట్టన్॥ ౧౬౭॥ ఆ-వె॥ మేషకుక్కుటముల * మృగపక్షిపశుసూక ।
రాదులనిలఁగోసి * యనుభవించు। నట్టివారిఁబట్టి*యారీతిఁగోయుదు।
రక్కజముగ దూత*లంబుజాక్షి॥ ౧౬౮॥ క॥ వలలూఁతలగాలంబుల।
జలచరముల యుక్తిఁబట్టు * జనులనుసురియల్ । గలిగిన మరపెట్టెల
యందులవైచియు మరలుద్రిప్పు*దురు పొడిగాఁగన్॥౧౬౯॥ తే-గీ॥
ఒకఁడు సత్కార్యమునుజేయ * నుద్యమింప । నదియుఁగానీక చెడఁ
గొట్టు * నట్టివాని । రాశివోసినసున్నపు * రాలఁజేర్చి । విరియఁ
బోతురు కేకలు*పెట్టుచుండ॥౧౭౦॥ క॥ అతిథివెలినుండఁబెట్టక యతి
ప్రీతినినింటఁగుడుచు * నట్టినరునకున్ । సతతంబును మలమూత్రము।
లతనికినాహారతృష్ణ * లకునిత్తురటన్॥ ౧౭౧॥ ఆ-వె॥ తనయనొక
నికిత్తు * నని మరియొకనికి । మాటనిచ్చునట్టి * మనుజవితతి। నేక
పాదముననునిల్పినారసముల । జిహ్వలందునాటి * చీల్తురబల॥౧౭౨॥
క॥ ఎన్నెన్నిశ్రమలఁబెట్టినఁ । బన్నుగ జీవులనుబాధఁ * బడుట
యెగాకన్। జెన్నుగ యాతనదేహము । లెన్నఁడుఁ జెడిపోకయుండు
* నెప్పటియట్టుల్॥ ౧౭౩॥ ఆ-వె॥ అరయఁబెక్కుగలవు * యమ
లోకబాధలు। చిత్రవిన్నియంచుఁ*జెప్పఁదరమె। యందునేనుగొన్ని*
ననువొందఁ జెప్పితిఁ। జాలునింతవట్టు * జలజవదన॥ ౧౭౪॥ ఉ॥

పరికిఁబొందవచ్చునిఁక * నీయిలబాధలు నొక్కబాధలే । భారకరం
బులౌయమునిబాధలఁజిక్కకయుండఁగావలెన్ । దారకమంత్రతత్పరు
లు * దక్కనునాయములోకమందునన్ । జేరనివారుబాధలును * జెం
దనివారలులేరయెవ్వరున్ ॥ ౧౭౫ ॥ ఆ-వె॥ దైవచింతచేతఁ * దనరుమ
హాత్ములు । చెంతఁజేరవెఱచు * నంతకుండు । నింకవారిదూత * లెంత
మాత్రమువారి । కొనరమించినదియు * నొకటిగలదె ॥ ౧౭౬ ॥ క॥
పరతత్త్వనిరతులగుచును । బరఁగెడునా ధన్యులకును * బ్రహ్మేంద్రా
దుల్ । హరిహరులుసురలు కాలుఁడు । స్థిరముగ సేవించిప్రణుతిఁ * జే
యుదు రెప్డున్ ॥ ౧౭౭ ॥ క॥ నాపుడుఁబాపాత్ములుగొని । పోవుటలాదిగను
వింటిఁ * బుణ్యులనెటుగొం । పోదు రెవరికిఁగనపడ । దావిధమనఁజక్రి
వల్కె * హరిణేక్షణతోన్ ॥ ౧౭౮ ॥ చ॥ నలువను విష్ణుశంకరుల *
నమ్మినభక్తులకంత్యమందునన్ । దొలఁగకవచ్చివారినిజ * దూతలువారి
ని దివ్యపుష్పకం । బులనిడిఛత్రచామరలు * పువ్వులువైచుచు దేవతా
ప్సరల్ । పొలుపుగనాదవాద్యములు * బోరుకొనంగొని పోదు రెంత
యున్ ॥ ౧౭౯ ॥ ఆ-వె॥ పుణ్యలోకమునకుఁ * బోయినతోడనే । యష్టభోగ
ప్రాప్తుఁ * డగుచునటు ని । రంతరంబు దేవ * రంభాదిసంభోగ । యుతుఁడు
నగునుబుణ్య * యుతుఁడుమగువ ॥ ౧౮౦ ॥ చ॥ ఒనరఁగమేల్కతోఁ
బదుగు * రున్న నొకండునుఘోర్కస్వప్నమున్ । గననదివాని కేయెఱుక *
గాకయెఱుంగరుదక్కవారు న । ట్లనుశివవిష్ణుదూతలును * నంతకుదూ
తలువచ్చితమ్ముఁగై । కొనిచను టెల్లవారలకె * గుర్తగుఁగాకయెఱుంగ
రన్యులున్ ॥ ౧౮౧ ॥ ఇలఁబుట్టిపెరుగుటయుఁదా । నలరంగాఁగష్ట
సుఖము * లాదిగఁగనుటన్ । దొలఁచుటపదవులునరకముఁ । గలయంచు
నెఱింగిమేల్కఁ * గాంచుమునీవున్ ॥ ౧౮౨ ॥ తే-గీ॥ పడతిఁయోచింప
సత్కర్మ * పరులుసౌఖ్య । మనుభవింతురుదుష్కర్మ * లధికశ్రమల ।
నంతిమేగానిపుణ్యాత్మ * లధికమనుచుఁ । బాపకర్ములఁదక్కఁగాఁ *
బల్కరాదు ॥ ౧౮౩ ॥ క॥ వినుపాపాత్ములకైనను । ననఘాత్ములకైనఁ
గాని * యవనీస్థలిలో । జననమరణములుదప్పవు । ఘనతరముగవారి
వారి * కర్మలకొలఁదిన్ ॥ ౧౮౪ ॥ క॥ భవమునుదెచ్చునుబాపము ।
భవమేగల్గించుపుణ్య * ఫలమీరెండున్ । దవులకమెలఁగినవాఁడే.భవ

నాశములేనిఘనుఁడు * పావనుఁడరయన్॥ ౧౭౫॥ ఉ॥ కర్మము చేత
జీవులకుఁ * గల్గునుజన్మములెంచిచూడఁగాఁ । గర్మముచేతఁబెంప
గును * గర్మముచేతనెగల్గునాశముల్ । గర్మముచేతసౌఖ్యమును *
గర్మముచేతనెగల్గుదుఃఖముల్। గర్మమెజన్మహేతువని* కర్మముఁబా
శినవాఁడుముక్తుఁడౌ॥ ౧౭౬॥ తే-గీ॥ గర్మరహితంబుదేనిచేఁ* గాదు
గురుని। కరుణచేతనుబరమాత్మఁ * గాంచినపుడె! కర్మబంధంబులెల్ల
ను * గడకుఁబాయుఁ। దపనబింబంబుఁబొడగన్న*తమముభంగి॥౧౭౭॥
క॥ఉపవాసవ్రతక్రతువుల। జపదానాధ్యయనసంధ్య*సత్స్నానములన్।
దపశాంత శమదమంబుల। నెపుడును మోక్షంబు నొంద * నేరరు
మనుజుల్॥ ౧౭౮॥ సీ॥ వసుమతి నరులకే * వస్తువర్గంబును - భుజి
యింపరోగముల్ * పుట్టుచుండు। నట్టివస్తువెమరల * ననుభవించిన
దేహ- రుగ్మతయెక్కువౌ*వ్యాధిగాను। బరఁగఁదత్ప్రతిహతం బైన
యౌషధమును - గుడువక తద్వ్యాధి * గుదురనట్లు। నగ్నిక్రియో
పాస*నవ్రతక్రతుతీర్థ- జపసత్య తపదాన*శౌచమాది। కర్మములుజన్మ
వృద్ధికే * కర్మమునకుఁ। బ్రతిహతంబైన జ్ఞానంబుఁ * బడయకున్న।
జన్మరహితంబు గల్గునే * శశియులేని। రేయినభ్రంబు తోఁడైన*రీతి
గర్మ॥ ౧౭౯॥ చ॥ బురదను మంచినీరములు * వోసియలందినఁబోవు
గాకయా। బురదను వొంపితోఁగడుగ*బోవునె పోదుదలంపనట్టులే।
గరితరో జన్మహేతువగు*కర్మముజ్ఞానముచేతఁబాపకే। కరమనురక్తి
గర్మములు * కర్మముచేతను నాశమొందునే॥ ౧౮౦॥ తే-గీ॥ పైరు
లెల్లనువర్షానఁ * బండినట్టు। మించు పరమార్థమునముక్తి * గాంచ
వచ్చు। మంచుచేతనుబైరు ఫ * లించనట్లు। కర్మచర్యలమోక్షంబు*
గాంచరాదు॥ ౧౮౧॥ క॥ అనవుడు విమలజ్ఞానం। బునకును గర్మంబె
మూల*ముగఁజెప్పితి రిం। తనెనిష్ఫలమనికర్మం। బునుద్రోయఁగనేల
యనినఁ * బొలఁతికినరియెన్॥ ౧౮౨॥ ఆ-వె॥ కమలవదన యెట్టి *
కర్మంబులైనను। నెంచమూఢుఁ డాచ * రించుఁగాని। పరఁగబ్రహ్మ
పదము* ప్రత్యక్షముగఁగన్న। జ్ఞానియెపుడుఁజేయఁ* బూనుకొనఁడు॥
౧౮౩॥ క॥ వినుకర్మభక్తి జ్ఞానం। బును నొకటికి నొకటిఁబడసి *
మోక్షంబునుగై।కొనఁదగుఁగర్మాచరణం। బునమోక్షంబునెవరుఁ*

బొందరు ధాత్రిఁ॥ ౧౯౪॥ ఆ-వె॥ కర్మసల్పువాఁడు * క్రమముగా
నెప్పుడో। వడయుముక్తినన్ని * చెడకయున్న। జ్ఞాని యట్లుగాదు*
మానిని సాదృశ్య। ముగనునాత్మ నిపుడె * ముక్తిఁగాంచు॥ ౧౯౫॥
చ॥ శునిమొదలొక్కతస్కరునిఁ* జూచిమొఱంగినఁ జుట్టుప్రక్కలన్।
శునకములెల్లఁగన్నటులఁ* జూడకెగూయుచునుండునట్లుగన్। ఘనపర
మాత్మ తత్వమును* గాంచినవేత్తలుఁ పల్కువాక్యముల్। వినియును
దాముగన్నటుల* వింతగఁ జెప్పుదురుర్విఁ గొందఱున్॥ ౧౯౬॥ ఆ-వె॥
కనినవారలకును* గాననివారికి। గుఱ్ఱులేమిగలవు* కోరిచూడఁ। గన్న
దెవరొ యుందుఁ* గాననిదెవ్వరో। కన్నవాఁడెవానిఁ* గాంచుచుండు॥
౧౯౭॥ సీ॥ కాశికిఁబోవఁగా * గమనించువారెల్లఁ- దెలివినినకాశి*
దిక్కుఁగూర్చి। పోయినఁగాశికిఁ * బోవచ్చుఁబెడత్రోవఁ - బోయినఁ
గాశికిఁ * బోవఁగలరె। యేజాతివారైన * నేనీతివారైన-నేమతజ్ఞు
లునైన * నెవ్వరైన। మోక్షంబునందున* పేక్షగల్గినవారు-ముక్తి
మార్గముఁబట్టి * రక్తిమీఱ। నరిగిననుముక్తిఁజేరంగ * నగునుగాని।
తప్పుదారులఁబడిచని * తల్లడిల్లు। మూఢులేరీతిఁగాంతురు * ముక్తి
పదము। ఘోరమగుమాయఁ బడితన్ను * కొనుటెగాక॥ ౧౯౮॥
ఉ॥ దారినిఁదప్పికాఱడవి * దారినిఁగానక తత్తఱంబుచే। దారినెఱుం
గువానిఁగని * దారినెఱింగినవానిచాడ్పునన్। గాఁడవమొప్పమాయ
యును * కాననమందునఁజిక్కకేనరుల్। కారణమూర్తిఁగన్గొనినఁ *
గానఁగవచ్చును మోక్షమార్గమున్॥ ౧౯౯॥ ఆ-వె॥ సూరిజనుఁడు
తాను* సుగతిఁజెందుటెగాక। యొరులఁగూడసుగతి * నొందఁజేయు।
చెనఁటినరుఁడుతాను * జెడిపోవుటేగాక। కోరియితరజనులఁ *
గూడఁజెఱచు॥ ౨౦౦॥ సీ॥ వేదశాస్త్రములెల్ల * వివరింపఁగానేల-
వివిధపురాణముల్ * వెదుకనేల। పంచకావ్యంబులు * పఠియించఁ
గానేల - నమరత్రికాండల * నరయనేల। తర్కలక్షణములు * త
ఱచిచూడఁగనేల - ఛందంబుమిక్కిలి * చదువనేల। విద్యలెల్లను
గఱచి * విఱ్ఱవీగఁగనేల - భాషలెల్లనునేర్చి * ప్రబలనేల। పొట్ట
కూటికెయివియెల్లఁ * బోల్చిచూడఁ। బరముపాండిత్యవిద్యలఁ* బడ
యరాదు। పరమగురుమూర్తిపాదముల్ * పట్టినపుడె। ముక్తిఁజెం

దునుగాఁకెంత మూఢుఁడైన॥ ౨౦౧॥ తే-గీ॥ కోరియంబుధిపై వాన * గురిసినట్లు । కాననంబున వెన్నెల * గాయురీతిఁ। గోటిచదువులుచదివి యు * గురునికరుణ। వడయలేకున్న చదువులు * వ్యర్థమయ్యె॥ ౨౦౨॥ చ॥ కనుఁగొనువానిచేరువనె గల్గియునంధుఁడుగానఁడర్కునిన్ । గను లనుగల్గువాఁడెగను * గావునమూఢుఁడు నాత్మవేత్తయు । న్నానరఁగ నొక్కలోకమున * నుండియునంధునిరీతిమూఢుఁడున్ । గనుఁగొన లేఁడు బ్రహ్మమును * గాంచుచునుండును నాత్మవేత్తయున్॥ ౨౦౩॥ క॥ ఏవలనఁగాదుదైవము । భావంబునఁదెలియవలయుఁ * బరయోగమునన్ । దేవునిదర్శించినయా । జీవుఁడునిమిషమునముక్తిఁ * జెందు మృగాక్షీ॥ ౨౦౪॥ ఆ-వె॥ అనినయోగమనఁగ * నదియెన్నిరీతులై యుండుఁదెల్పుమనిన * నువిదఁజూచి । మాధవుండుయోగ * మార్గంబుఁదెలియఁగఁ । బల్కెనిట్టులనుచుఁ * బ్రౌఢిమెఱయ॥ ౨౦౫॥

యోగలక్షణము.

ఆ-వె॥ జ్ఞానయోగమనఁగ * పరవినభ్యాసయో । గంబునాగరెండు * గతులుజ్ఞాన । యోగమనఁగ రాజ * యోగమానదిసాంఖ్య । తారకామనస్క * పేరులొప్పు॥ ౨౦౬॥ క॥ ఎంచఁగఖేచరిభూచరి। యంచును షణ్ముఖియుమధ్య * మనశాంభవినాఁ । బంచవిధంబులు ముద్రలు । నంచితముగనవియుమిగుల * నాయాసక్రియల్॥ ఆ-వె॥ అబలవినుమ యింక * నభ్యాసయోగంబు। నదియుమూఁడుతెఱఁగు * లైవెలుంగు లాలితముగమంత్ర * లయహఠయోగంబు। లనఁగబఱఁగుచుండు * నవనియందు॥ ౨౦౮॥ క॥ పాయకయిరువదియొక్క । వేయిన్నాఱున్నూళ్లు హంస * వెసుదినముకదాఁ। రేయింబవలుజపించుట। యోయబ్జదళాక్షి మంత్ర * యోగంబునగున్॥ ౨౦౯॥ ఆ-వె॥ మంత్రయోగమనఁగ * మఱియదియొండొక్క। తెఱఁగునుగలదిష్ట * దేవతాది। బాహ్యమంత్రములను * బఠియించుటలుబాహ్య । మంత్రయోగమనఁగ * మహిఁజెలంగు॥ ౨౧౦॥ ఆ-వె॥ అన్నమాటఁదప్ప * కరయశాపానుగ్ర । హములనొసఁగుశక్తి * నమరుచుండు। మనుజుఁజెలఁగఁజాలు * మహిమకొందఱియందుఁ। జెలఁగుచుండుమంత్ర * సిద్ధులందు॥ ౨౧౧॥ ఉ॥ మానినిచక్రషట్కమున * మానసమున్విహరింపఁజేసి ను। హ్మానిత

హంసచక్రముల * మాటికినిల్పుచునచ్చటచ్చటఁ । బ్రాణమునం ద
పానము న*పానమునందునఁబ్రాణముఁ దగఁ । బూనిలయింపఁజేయు
నదె * పోలయయోగమనంబడుఁ ధరఁ॥ ౨౧౨॥ సీ॥ మనమును
బిందువం * దునఁ బ్రాణమునుగళ - నమ్మనోప్రాణముల్ * నాదమం
దు । లయముఁ జేసియుఁజిత్క * ళాదులుదర్శించు-చుందురు భావింపఁ
* గొందఱిలను । జెలఁగిజిహ్వాంతర * జిహ్వలనేకంబుఁ - జేసిమారు
తమును * జిక్కఁబట్టి । హంసనాజ్ఞాచక్ర * మందునాపుచుమనం -
బందుఁగొందఱుడిందు * పఱతురింక । నరయనిజకాయములనంత *
హంసలయముఁ।జేసిపరకాయములఁబ్రవే*శించు చుందు। రెలమినీలయ
యోగంబు * నిట్లనేక । చందముల నాచరింతు రీ* జగతిలోన॥ ౨౧౩॥
ఆ-వె॥ సరవినింద్రియముల * సంచారములమాన్పి । హంసనడక
నుడిపి*నయ్యపాన । ప్రాణములను రెంటిఁ*బాయకకుంభించు । నదియె
హఠమనంగ * నగునుమగువ॥ ౨౧౪॥ సీ॥ పాయురింద్రియమున *
దోయముల్ వడిఁబీల్చి - మలకల్మషములాది * వెలికిఁద్రోచి । కంఠ
గతంబులౌ * కఫపిత్తములుగ్రక్కి - షడ్రసంబులను వ * ర్జనమొనర్చి ।
రూఢిఁబ్రాణంబు ని * రోధించిహంసను - గలయఁగేవలకుంభ*కమున
నిల్పి । కాయసిద్ధినిఁబొంది * గణుతింప నణిమాది - యష్టసిద్ధులు
గాంచి * యనువుమీఱ । దూరశ్రవణము పరికింప * దూరదృష్టి
గగన సంచారములునాది* గలిగియుందు। రరయ హఠయోగులీరీతి*
నవనియందుఁ । బరఁగుచుందురు లోకులు * భ్రమలుసెంద॥ ౨౧౫॥
తే-గీ॥ ఉర్వి నీమూఁడు దెఱఁగుల * యోగులకును । సహజముగఁబెక్కు
భంగుల*మహిమలుండు । మహిమలంబడి బ్రహ్మంబు*మఱుఁగుగనని।

అ ష్టాం గ ల క్ష ణ ము.

కతన మోక్షార్హు లెన్నఁడు * గారువీరు॥ ౨౧౬॥ వ॥ ఈ త్రివిధంబు
లగుయోగులకు యమనియమాసన ప్రాణాయామంబులు పూర్వాం
గంబులుగాను ప్రత్యాహార ధ్యానధారణ సమాధులుత్తరాంగంబులు
గాను ప్రవర్తిల్లు, నందు యమంబన సత్యక్షమార్జవ మహింసాదయా
ధృతిమితాహార బ్రహ్మచర్య శౌచంబులగు,నియమంబనఁదపోదాన సం
తోష జపార్చన వ్రతతీర్థ శ్రవణాస్తి కత్వంబులగు. ఆసనంబనఁ గూర్మా

సన కుక్కుటాసన సిద్ధాసన పద్మాసన వీరాసన స్వస్తికాసన భద్రాసన సింహాసన యోగాసనాద్యాసనంబు లభ్యసించుట, ప్రాణాయామంబనఁ బ్రాణాపానంబులనొకదానియందొకటికుంభించుట, ప్రత్యాహారంబన విషయంబుల వలన నింద్రియంబుల మరలించుట, ధ్యానంబన నామ రూపంబుల ధ్యానించుట సగుణ ధ్యానమనియు, నిర్గుణాత్మను జింతించుట నిర్గుణధ్యానమనియుం జెప్పంబడు. ధారణంబన నాధారాదిషట్చక్రములయందును మనంబు నరికట్టుట. సమాధియన బాహ్యదేవతల యందు మనంబుఁ జొప్పించుట సవికల్ప సమాధియనియు, నిర్గుణాత్మ నేమఱకుండుట నిర్వికల్ప సమాధియనియుఁ జెప్పంబడు॥ ౨౧౭॥ ఉ॥ ముందె యెఱుంగనేరకయె* ముక్తిపదంబగు రాజయోగము। న్నిందు నిభాస్యపామరులు * నిట్టిదురంతర యోగసాధనల్। పొందిప్రయాసలొందిచెడి * పోవుదురాత్మ సుఖంబుగానకే। మందులు పొట్టుదంచి ఫల*మందునఁగానక పోవురీతిగన్॥ ౨౧౮॥ ఆ-వె॥ అధిక కష్టమిట్టి * యభ్యాసయోగముల్। గాసిగాని ముక్తి*గానఁబడదు। అగణితంబు సులభ * మగు రాజయోగంబు। ముఖ్యమందఱికిని * ముక్తిపదము॥ ౨౧౯॥ క॥ భూజనుల కెల్లవారికి। రాజెట్టుల గొప్పయగుచు * రంజిలునట్లే। పూజితము రాజయోగము। రాజగు యోగములకెల్ల* రాజీవాక్షీ॥ ౨౨౦॥ క॥ అనముద్ర లైదుగలవని। వినిపించితి రిప్పుడవియు * వినఁగావలతున్। వినిపింపుమనిన నింతికి। ననువొందఁగ

## పంచముద్రల లక్షణము.

నిట్టులనియె * నాయదువిభుఁడున్॥ ౨౨౧॥ ఆ-వె॥ ఒడలు బడలఁ జేయు*యోగసాధకులకే। ముద్రలవిప్రధాన*ములగుఁగాని। యరయ సాంఖ్యతార*కామనస్కజ్ఞులో। బుధులకెపుడు ముఖ్య*ములవిగావు॥ ౨౨౨॥ క॥ వనితా యైననునీవును। వినఁగోరితి గాననవియు*విశదముగా నీ। కునునెఱిఁగించెదవినుమిఁక। నొనరంగా నొక్కటొకటి*నొయ్యన నిపుడున్॥ ౨౨౩॥ తే-గీ॥ మూసియైనను నక్షులు * మూయకైన। మనసుదృష్టియు భ్రూమధ్య * మందుఁజేర్చి। యూర్ధ్వముఖముగఁ జూచుచు*నుండెనేని। ఖేచరీ ముద్రయగునది*కీరవాణి॥ ౨౨౪॥ క॥ సదమలగతి నార్యోక్తినిఁ। బదపడి ఘ్రాణాగ్రమందుఁ * బాయక

చూడ్కుల్ । గదలింపక వీక్షించిన । నవిభూచరి ముద్రసరసి * యంద్రు మహాత్ముల్ ॥ ౨౨౫॥ తే-గీ॥ నేత్రయుగమును మఱియు నా * శ్రోత్రయుగము । ఘ్రాణయుగమును మూసియుం * గ్రమము గాను । జూపు భ్రూమధ్యముననిల్పి * చూచెనేని । షణ్ముఖీ ముద్ర యగునది * సారసాక్షి॥ ౨౨౬॥ క॥ కనులువికసించి చూపును । మనముం జిదాకాశమందు*మఱఁగించి విదాత్మనుగలసిచిత్కళాదుల। వినయంబునఁ గనిన శాంభ * వీముద్రయగున్॥ ౨౨౭॥ తే-గీ॥ అరని మీలితలోచనుం * డగుచుమేటి । దృక్కు నాముక్కుమధ్యను * దోపఁజేసి। కలయనామీఁద నిటలంబుఁ*గాంచెనేని। మధ్యలక్ష్యంబు నగునది*మందగమన॥ ౨౨౮॥ క॥ కనులునువీనులుమూసియు । ఘనముగ భ్రూమధ్యసీమ * గాంచుచుమఱియున్ । దనలోనెమ్మదివినవిన। మునుమునునోంకారశబ్ద * మును బ్రబలమగున్॥ ౨౨౯॥ క॥ తరువాత మేఘరవమును । మరిఘంటా వేణు తాళ*మద్దెలవీణా। వరభేరి భ్రమరశరనిధి । కరణినినాదములు పెక్కు*గతులవినఁబడున్॥౨౩౦॥ ఆ-వె। అట్లుచూడఁజూడ * నతిదారుణాకృతి । నంధకారరూప * మగుచుఁదోఁచుఁ । గలయఁదిమిరమందు*ఖద్యోతములరీతి । మెఱుపులతలభంగి * మెఱయుచుండు॥ ౨౩౧॥ క॥ కమలాక్షి.వినుమయందొక। యమితంబగువెలుఁగువాఁడమి*యంతయుఁదానై । తమమెల్లఁ బాఱఁదోలును । విమలంబైయుండుపండు * వెన్నెలకాంతిన్॥౨౩౨॥ ఆ-వె॥ మఱివసంతకాల * మార్తాండుభంగిని । శిశిరఋతువునందు * శశివిధంబు । ప్రళయకాలవహ్ని*పగిదిఁగాఁదోచున । క్షత్రమండలంబు * చందమునను॥ ౨౩౩॥ క॥ ఆరయవజ్రంబులవలె । ధారుణిమణులట్లునింద్ర * ధనువు ననువునన్ । సారసనీలంబుల గతిఁ । దీరగు వరమౌక్తికముల * తెఱఁగునవెలయున్॥ ౨౩౪॥ ఆ-వె॥ గోపురములరీతి * గోత్రములట్టుల। మేఘములతెఱంగు * మేడలవలెఁ । గరుల చందమునను * హరులవిధంబున । నరదబంతిపోల్కి * నమరుచుండు॥ ౨౩౫॥ క॥ కనకరజితములభంగినిఁ । బెనుపొందుచునుండు నెమిలి * పింఛములగతి । న్ననువొందుహిమముకరణినిఁ । దనరంగా దీపకళిక * తతులవిధమునన్ । ౨౩౬॥ క॥ చలువపుటంబులకైవడి ।

సలలితముగఁబూయువృక్ష*జాలముభంగిన్ । జలనిధికరళ్లమూడ్కని।
బలువగునమృతంపుజ్యోతి * పగిదివెలుంగున్॥ ౨౩౭॥ ఆ-వె॥ చిత్ర
గతులఁదోఁచు * చిత్కళలెల్లను । జూడఁజూడమిగులఁ * జోద్యమ
గుచు । విశ్వమందులేని*వింతలుగాన్పించు । సుదతినీవునట్లు*చూడు
మింక॥ ౨౩౮॥ ఆ-వె॥ ఇంతియందుఁదోఁచు * వింతల నరయంగ ।
వేయికన్నులున్న * వేల్పుకైన । శేషధరునకైన * శేషాహికైనను।
నలవిగాదజునకు * నైననెన్న॥ ౨౩౯॥ క॥ తారక మర్మముదెలి
యక । గారవమునముద్రలందుఁ* గనుచిత్కళలే। తారకమనిపల్కు
దురది । తారకమెప్పుడునుగాదు * తరుణేందుముఖీ॥ ౨౪౦॥ తే-గీ॥
కలకసుప్తికి జాగ్రత * కాదియైన । యట్టివస్తువెతారకం * బనఁగ
నొప్పు । నదియుఁగానకజాగర * మందుఁజూచు । ముద్రలెల్లనునిద్ర
లో*మునిఁగిపోయె॥ ౨౪౧॥ క॥ సకలవిచిత్రాలయమగుఁ । బ్రకటిం
పఁగముద్రలైదు * భ్రాంతికిమూలం । బకలంకమైనయాత్మకు। నీకనే
భ్రాంతియునులేదు * నిర్గుణుఁడగుటన్॥ ౨౪౨॥ క॥ క్రమమునసీ
ముద్రలుగన । భ్రమపుట్టుచు నుండుఁగాని*భ్రాంతిరహితమున్ । సమ
లీలగాదుగావున। విమలాంగిముద్రలరసి * విడువఁగవలయున్॥ ౨౪౩॥
క॥ నిద్రాన్నపానములవిడి । యద్రులగుహలందుఁదూఱి * యడవుల
నున్నన్ । ముద్రలయందున * భ్రమగల । క్షుద్రాత్ములుగాంచలేరు *
సూటిగముక్తిన్॥ ౨౪౪॥ క॥ నిద్రకునాదినిఁదెలిసియు । ముద్రలభా
వంబురోసి*మూలమెఱిఁగియున్ । సద్రూపము గననేర్చిన । భద్రా
త్ములుగంద్రుముక్తి * బహుసులభముగాన్॥ ౨౪౫॥ క॥ వెలినుం
డియింటిలోపల । వెలుఁగునువీక్షించిదివ్వె * విధమెఱుఁగకయా । వె
లుఁగేకారణమనిపదిఁ । దలపోసినవానిరీతిఁ*దగుముద్రలిలన్॥ ౨౪౬॥
క॥ దీపంబుగన్నవానికి । వ్యాపకమగువెలుఁగుకార*ణాత్మకమగునే।
యాపరమాత్మనుగాంచిన । యాపావనమతులకేల*యాసాధనముల్॥
౨౪౭॥ ఆ-వె॥ అనినయోగముద్ర * లాదిగవింటిని । నింకనీప్రపం
చ*మెట్లుపుట్టె । మఱియుసాంఖ్యయోగ * మననెద్దియన్ననా । నాతి

ప్రపంచోత్పత్తి లక్షణము.

కిట్టులనియె * నచ్యుతుండు॥ ౨౪౮॥ క॥ పడఁతీయెంతటివారికిఁ ।

దశయక యీశ్వరసృష్టి * తెరఁగు చెప్పఁగన్ । గడువడి నీవొక్కొక్కటి।
నడుగంగా నేర్పట్టు * లడిగెద వుపతీ॥ ౧౮౯॥ క॥ నెట్టన లోకము లేవి
యుఁ । బుట్టకము న్నేమి లేక * పూర్ణంబగుచున్ । బట్టబయలైన బ్రహ్మ
ము । పట్టుగ నొక్కండె యుండె * భామినితో లుతన్॥ ౧౯౦॥ ఆ-వె॥
మఱియు నట్టి బ్రహ్మ * మందేమి లేకయే । స్వయముగ నొకమాయ *
శక్తి గల్గె । నరయ నిద్రయందు * నడఁగిన తెల్వియు। వరుసఁ దనకుఁ దానె
వచ్చినట్లు॥ ౧౯౧॥ తే-గీ॥ నాతి యమ్మాయయందున * నాకసంబు ।
వాక్షమె నానింగియందునఁ * బుట్టగాడ్పు । ననిలమందున నగ్నియు *
ననలమందు । జలము జలమందుఁ బృథ్వియు * సంభవించె॥ ౧౯౨॥

వ॥ ఓయంచయానా, యివి పంచ మహాభూతంబుల నంబరఁగు,
నందు నభంబునకు శబ్దంబును, వాయువునకు శబ్ద స్పర్శంబులును,
దేజంబునకు శబ్దస్పర్శ రూపంబులును, నుదకంబునకు శబ్దస్పర్శ రూప
రసంబులును, ధరణికి శబ్దస్పర్శ రూప రస గంధంబులును గుణంబులై
యొప్పు॥ ౧౯౨॥ ఎ॥ చ॥ అమరఁగ నట్టిమాయ త్రిగు * ణాత్మకము
య్యును రాజసంబునన్ । గమలజ సస్యసంతతులు * కంజహితుండును
గల్గెజీవులున్ । విమల సుగంధి సత్వమున * విష్ణుసుధాకర తారలున్
సురల్ । సముదయ మొందె నాశివుఁడు * సాగరవృక్ష గిరుల్
తమాంశమై॥ ౧౯౩॥ తే-గీ॥ రమణి జగములఁ గల్పించు * రాజసమున।
సకలజీవులఁ బోషించు * సత్వమునను। దవిలి యఖిలంబుఁ బొలియించుఁ *
దమము చేతఁ। ముత్తెఱంగుల నీమాయ * మూలమిలకు॥ ౧౯౪॥ క॥
మొదలు రజోగుణముననే। యుదయించును సత్వమొంది * యొగి
సత్వాంశం। బది యగుచుఁ దమముఁ జెందం। బదపడి వినుమవి తమాంశ *
మై యొప్పారున్॥ ౧౯౫॥ క॥ మగువా వినుపదునాలుగు। జగములు నీరీతి
నయ్యె * సాంఖ్యమనంగాఁ। దగు దేహ తత్వగోప్యము। తగఁ దెల్పెద
వినుమియింకఁ * దామరసాక్షీ॥ ౧౯౬॥ వ॥ ఓ కాంతామణీ, భూత
పంచార్ధార్ధంబు లైదును నిజాంశంబులై చెలంగు. చిక్కిన యర్ధాం
శంబు లొక్కొక్కటి చతుర్భాగంబులై, యితర భూత చతుష్టయంబుం
గూడుచున్నది. ఇది పంచీకరణ లక్షణంబగు, నదియెట్లనినః——

## సాంఖ్యలక్షణము.

సీ॥ అంతరిక్షములోని*యర్ధభాగము రెండు - రీతులై యొక్కటి*
జ్ఞాతయయ్యె। మఱియొకభాగంబు * మఱినాల్గువిధములై - వాయ్వ
నల సలిల * వసుధలందుఁ । జేరిమనోబుద్ధి * చిత్తహంకారంబు -
లాయెనుదద్విప * యంబులగుచు। నెగడుసంకల్పంబు*నిశ్చయంబును
జింత - కర్తృత్వములునాది * గాఁగఁబరఁగు। వీనికధిదైవతంబులై*
వెలయ క్షేత్ర। పాలకుండునుజంద్రుండు బ్రహ్మవిష్ణు। రుద్రులగుదు*
భావింప*రూఢిగాను। నంతరింద్రియపంచకం * బనఁగనివియె॥ ౨౫౭॥
సీ॥ పవనంబులోనర్ధ*భాగంబుద్వివిధమై - వ*సనందొక్కటి * వ్యా
నమయ్యెఁ। గడమభాగమునాల్గు* ఖండంబులగుచును- మఱిమిన్ను
గూడి స*మానమయ్యె। దహనునిఁగలసి యుం * దానంబునయ్యెను-
వారిఁజేరియుఁబ్రాణ*వాయువయ్యె। వసుధనొందియపాన * వాయు
వునయ్యెను- బరికించిచూడంగఁ బద్మగంధి। విజయుండాదిగజయుండు
ను*విశ్వయోని। గలయఁగవిసృష్టుండునువిశ్వ*కర్తలనఁగఁ। దనరు
చుండుదురధిదేవ*తలుగణింపఁ। బంచప్రాణంబులివియనఁ * బరఁగు
ధాత్రి॥ ౨౫౮॥ సీ॥ అనలభూతములోని * యర్ధభాగము రెండు -
సగములై యొకటి లో * చనమునయ్యె। నందుఁజిక్కినసగం * బట
నాల్గుతెఱఁగులై - గగనానిలోదక * కాశ్యపులను। జెందిశ్రోత్రము
త్వక్కు * జిహ్వానాసికములు - నంచితంబగనాయె * నెంచిచూడ।
రూపశబ్దస్పర్శ * రుచిగంధములువీని- కరయంగవిషయాదు* లైచెలం
గుఁ। దెలియఁగావీనికినినధి * దేవతలును। భానుఁడును దశదిశలును*
బవనము వరు। ణాశ్వినీదైవతములన * నమరుచుండు। నివియె దల
పోసిచూడజ్ఞా * నేంద్రియములు॥ ౨౫౯॥ సీ॥ అప్పుభూతములోని *
యర్ధభాగము రెండు-సగములైయొకటి ర* సంబునయ్యె। నందునిల్చి
న సగము*నాల్గుభాగంబులై- దలఁపంగనితరభూ తంబులైన। యంబర
మార్గంబు * నందునఁగూడియుఁ - జర్చింపనొక్కటి * శబ్దమయ్యెఁ।
దగనొప్పనామారు*తంబునుబొందియు- సొనుగానొక్కటి- స్పర్శయ
య్యెఁ। జెలువుమీఱంగనలంబుఁ*జేరియొకటి। రూపమయ్యెనుదలపో
య*రూఢిగాను।నవనిఁగలసియుగంధంబు నాయెనొకటి। పంచతన్మాత్ర

లివియగు - నెంచిచూడ॥ ౨౬౦॥ సీ॥ అవనిభూతములోని*యర్థభాగము
రెండు - భాగంబులైయుండు * పాయువయ్యె। మిగిలినఖండంబు *
తగనాల్గుభంగులై - గగనసమీరాగ్ని * కమలములను। బరఁగఁగూ
డియువాక్కు * పాణియుఁబాద గు - హ్యంబులుక్రమముగా * నాయె
నింక। మలవిసర్జనమును * బలుకునీవియు గమ- నానందములు విష *
యాదులగును। నతులితంబుగనీయింద్రి * యంబులకును। దలఁపనధి
దేవతలుమృత్యు *దహనశక్ర। విష్ణుధాతలువరుసగా*వెలయుచుండు।
రరయఁగర్మేంద్రియము లివి * యనఁగఁబరఁగు॥ ౨౬౧॥ వ॥ మున్ను
చెప్పిన వ్యానసమానోదానప్రాణాపానంబులైదును మఱియువాయు
జనితంబులైననాగకూర్మకృకరదేవదత్తధనంజయలనునుపవాయుపం
చకంబునుంగలసిదశవాయువులనం బ్రసిద్ధంబులయ్యె, నందువ్యానుం
డు శరీరమాద్యంతమును వ్యాపించిలోపలి శీతోష్ణంబులలోనికిం బ్రస
రింపంజేయు;సమానుండునాభియందుండిభుజించినపదార్థములయొక్క
సారమెల్లనాడులకుంబంచిపెట్టు; నుదానుండుకంఠమందుండి సమస్తరు
చులంగోరించు,కఫము మొదలగు దగ్గులంబుట్టించు,కల్వరింతలంబెట్టిం
చు, నిష్ఠీవనంబుఁజేయించు, మ్రింగించు;ప్రాణుండుహృదయమందుండి
యుచ్ఛ్వాసనిశ్వాసంబులచే నారగించినశాకాది పదార్థంబులనన్నింటి
హరింపంజేయు, నపానుండుగుదమందుండియధోద్వారంబులబంధించి
యాయాకాలంబుల మలమూత్రశుక్లరక్తాపానంబులవదలింపంజేయు;
నాగుండురోమనాడులయందుండిదుఃఖగీత రాగహాసాదులంజేయించు;
కూర్ముండుపాదంబులందుండిశుష్కమైనశరీరంబుబలపఱచు, వాక్నేత్రం
బులవికసింపమూయింపంజేయు; కృకరుండునాసాగ్రమందుండిక్షుత్తృ
ష్ణాదితలంపులొదవించు,తుమ్మించు,దగ్గించు, వమనంబుగావించు,నావు
లింపంజేయు,మృతంబైననువిడువక దేహస్థౌల్యమును బుట్టించు;దేవ
దత్తుండులింగాక్షులయందుండిచక్కఁగాఁబల్కించు, కూర్చుండంబెట్టు
పరుండంబెట్టు, లేపినిలువంబెట్టు, గమనాగనునంబులంజేయించు; ధనం
జయుండుబ్రహ్మరంధ్రస్థానమందుండి శ్రోత్రములయందెల్లప్పుడుసము
ద్రముభంగిఘోషింపంజేయుచు మరణకాలమునకుముందుగా నిశ్శబ్ద
మైపోవు॥ ౨౬౨॥ సీ॥ నాతిపనిష్టితో * నయ్యహంకారంబు- గూడనన్న

మయాఖ్య * కోశమయ్యెఁ । ఘ్రాణేంద్రియములతోఁ * బరఁగహం
కారంబు-గూడఁ బ్రాణమయాఖ్య * కోశమయ్యె । మేటినెమ్మనము క *
ర్మేంద్రియంబులతోడఁ - గూడమనోమయ * కోశమయ్యె । నెలవుగా
బుద్ధిజ్ఞా * నేంద్రియంబులతోడఁ - గూడవిజ్ఞానాఖ్య * కోశమయ్యె।
సంతతంబునుజిత్తంబు * జ్ఞాతతోడఁ । గూడుటానందమయమను *
కోశమయ్యెఁ । బంచకోశంబులీరీతిఁ*బరఁగుచుండుఁ । బొందుగానెల్ల
దేహంబు * లందునరయ॥ ౨౬౩॥ సీ॥ గగనంబుచేఁగల్గె * గామంబు
క్రోధంబు-మదలోభ మోహము*ల్మత్సరంబు । గాడ్పుచేఁదీవ్రంబు*గ
మనంబులజ్జయుఁ-జలనంబుభయమును*సంభవించెఁ । బావనుచేతఁబి*
పాసక్షుదాలస్య - సంగనిద్రాదులు * సరవిఁగల్గె । శుక్లమూత్రశ్లేష్మ
శోణితమేధస్సు-లుత్పన్నమయ్యెను * నుదకమునను । మఱియుఁజర్మం
బునస్థియు * మాంసకేశ । నరములాదిగజనియించె * నవనివలన ।
నెలఁతయీదేహతత్వంబు * లిట్టివనుచు । నలువకైననుభావింప*నల
వియగునె॥ ౨౬౪॥ తే-గీ॥ ప్రాణధర్మంబులగుక్షుత్పి*పాసలెలమిఁ ।
దలఁపభవనాశములుదేహ * ధర్మములగు । శోకమానసధర్మముల్*
శోకమోహ । ములుషడూర్మ్ము లనంబడు * మోహనాంగి॥ ౨౬౫॥
క॥ కులరూప ధనమదంబులు । వెలయంగా యౌవనంబు * విద్యా
రాజ్యం । బెలమిఁదపస్సునుశీలం । బలరంగానష్టమదము * లనఁబడు
నివియుఁ॥ ౨౬౬॥ క॥ వినుముత్స్త్రీహావ్యసనము । ధనసేవకవిశ్వరా
జ్య * తనువులవ్యసనా, లొనరుమనోవ్యసనంబును । నునుసప్తవ్యసన
ములను * నడఁపఁగవలయుఁ॥ ౨౬౭॥ ఉ॥ కొందఱుముప్పదాఱయ
ని*కొందఱుతొంబదియంచుఁదత్వముల్ । కొందఱునైదటంచుమఱి*
కొందఱునిర్వదిమూఁడటంచును । గొందఱునిర్వదేననుచుఁ*గొంద
ఱునిర్వదియేడయంద్రిల । న్నెందఱునెన్నిరీతులను*నెట్లువచించినవా
నికేతగుఁ॥ ౨౬౮॥ ఆ-వె॥ అఖిలతత్వములకు * నాధారమగుచును।
నవ్యయాత్మతత్వ * మలరునొకటి । దానిసమముమిగులు* తత్వంబు
లెవ్వియు । లేవదియునుసుజన * సేవితంబు॥ ౨౬౯॥ సీ॥ బ్రహ్మాం
బునందునఁ * బంచముఖంబుల - వెవ్వియంచనవిను * మేర్పరింతు ।
నీశాన్యముఖమున * నింగియైవిలసిల్లుఁ - దత్పురుషముఖంబుఁ * దగు

ను గాడ్పు। ముదముమీఱ నఘోర* ముఖమన ననలంబు-వామదే
వాస్యంబు * వారియగును । మొనసిసద్యోజాత* ముఖమనఁబృథ్వి
యుఁ - దలపోయఁబంచభూ*తంబులివియు। భవమునాశము లేనట్టి*
బ్రహ్మమునకుఁ। బంచముఖములుగలవంచుఁ * బల్కరాదు।పంచభూ
తంబు లేయిలఁ।బంచముఖము। లగుచువీనిచేభువనంబు*లన్నియయ్యె।
౨౭౦। ఉ॥ కొంనలుచెట్టుముందనియుఁ * గొంనలువిత్తనిపెక్క
భంగుల। న్నందురువిత్తుచెట్టులకు * నారయభేదముఁజెప్పశక్యమే।
ముందెయొనర్చెవిత్తనము * మూలముగాఁగనుసృష్టికర్తయు। న్నం
దుఁదలంపఁజెట్టునగు*నట్టిమహాత్మ్యముఁజేసెఁగావునన్॥ ౨౭౧॥ఆ-వె॥
కారణంబు లేని*కార్యంబులిల లేవు। కార్యములకునాది * కారణంబె।
కారణంబువిత్తు* కార్యంబు చెట్టగుఁ। గాక చెట్టగునొకో*కారణంబు।
౨౭౨॥ క॥ మునుమన్నుకారణంబై । ఘనకుంభాకారమగుచుఁ *
గార్యంబులన్। మునువిత్తుకారణంబగు। ననువొందగఁజెట్టుకార్య *
మగునుదలంపన్॥ ౨౭౩। ఆ-వె॥ విత్తుకారణాత్మ*విశ్వంబు కార్యంబు।
కారణాత్మలేక * గాదుజగము। కారణంబువలనఁ* గల్గెనుసర్వంబు।
గాననిలకునాత్మ * కారణంబు। ౨౭౪॥ సీ। నలినాక్షి బ్రహ్మమా *
నస సరోవరమందుఁ-బరమహంసంబను * పక్షియొకటి। నిరతంబుక్షు
త్తృష్ణ*నిద్రయురోగంబు - జరయుమృతియు లేక * సంచరించు।సూ
టిగాఁగను తెప్ప * పాటులోనాయంచ - దివిరిజగము లెల్లఁ* దిరిగి వ
చ్చు। సతతంబునాయంచ * సంచారమును లేని-లోకంబుపాలిసి ని*
ర్లోకమగును। దానిఁబట్టుటకును * దర్శించుటకునైన। నలవిగాదుశి
వున*కజునకైన। నట్టియంగదర్శ * నంబుచేతనుగాదె। యార్యులెల్ల
ముక్తు * లైరితలఁప। ౨౭౫॥ క। అంచకువర్ణగుణంబులు। నెంచంగా
లేవురూప * నియతులునాలో। నించినఁగనుపడ వికనా । యంచ
కుఁబ్రతి లేదు జగము*నందునఁజూడన్। ౨౭౬। ఆ-వె। అమ్మరాళము
నకు * నావలనొకకోఁతి। దిరుగుగాలిభంగి*దిశలుదిశలు।నంచ నెపుడు
గూడు*నప్పుడేయాకోఁతి। చచ్చుమాయ లెల్ల*సమసిపోవు॥ ౨౭౭। క।
ధారుణిహంసముపాలను। నీరంబేర్పఱచినట్లు* నిజమునుమృషయున్
గూరిమినీదేహంబున। నారయఁగావచ్చుఁబరమ * హంసదొరకినన్।

౨౭౮॥ తే-గీ॥ శక్తికినిసాధ్యమునుగాదు * యుక్తులకును । జిక్కువడ
దదియెవ్వరి * చిత్తములకు। నొనరగురుసూత్రమనియెడి * నుచ్చులొడ్డి।
బహుళసులభంబుగాదానిఁ * బట్టవచ్చు॥ ౨౭౯॥ క॥ ఆపరమహంసఁ
బట్టిన । యాపుణ్యులభాగ్యమింత * యనఁగావశమే । యాపుణ్యులెధ
న్యాత్మకు। లాపుణ్యులెజన్మశూన్యు * లనఁగావలయున్॥ ౨౮౦॥ ఆ-వె॥
నడకలెల్లహంస * నడకతోసరిగావు । హంసనడకఁజెప్ప * నలవిగాదు।
హంసనడకవలన * నఖిలప్రపంచంబు । నడుచుకాలచక్ర * మాదిగ
తులు॥ ౨౮౧॥ క॥ అంచయనఁగవేఱొక్కటె । యంచితముగనంత
రాత్మ * కర్థమగునునా । యంచయెయాత్మండాత్మయె। యంచయగును
నెంచిచూడ * హంసవిహారీ॥ ౨౮౨॥ క॥ తనయింటశత్రుమిత్రులఁ ।
గనితనుఁదానాత్మగాఁగఁ * గనఁదగునట్టు । ల్గనుఁగొనఁగలేకయుండిన।
మనుజునిబ్రదుకేమిబ్రతుకు * మదగజగమనా॥ ౨౮౩॥ ఆ-వె॥ దేహ
గుణములెల్లఁ * దెలిసియునామీఁదఁ । దారకంబునాత్మఁ * దలఁచవల
యు । బ్రహ్మరాజఋషులు * ప్రహ్లాదుఁడాదిగాఁ । దారకమునఁగా దె *
ధన్యులైరి॥ ౨౮౪॥ క॥ ఓవెలఁదివినుముసురలకు । దేవత్వముతారక
మున * దీపించెను ద । ద్భావముఁదెలియకగాదే । భావింపఁగనసురమ
ర్త్య * భావులునగుటల్॥ ౨౮౫॥ చ॥ అనియిటుఁదెల్పుచున్నఁబతి *
యంఘ్రులఫాలముసోఁకమ్రొక్కియున్ । ఘనమగుభక్తిదోఁపఁగర *
కంజయుగంబునుమోడ్చినాథయో । యనఘచరిత్రనీవలన * నద్భుత
బోధనువింటినియ్యెడన్ । ననుదయఁజూచితారకము * నాదరమొప్ప
ననుగ్రహింపవే॥ ౨౮౬॥ క॥ శ్రీకరరహితవికారా । ప్రాకటగుణక
ర్మదూర * భవరోగహరా। భీకరశత్రుతృణీకర । యాకాశసమాన
రూప * యార్యసమీపా॥ ౨౮౭॥ మాలిని॥ నిరుపమతరకీర్తి * నిర్మ
లానందమూర్తీ। పరమపదయవిశాలా * భక్తసంత్రాణశీలా। దురిత
గతపవిత్రా * దుఃఖవల్లీలవిత్రా । పరమపదనిరూపా * భవ్యలోక
ప్రదీపా॥ ౨౮౮॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీసంవాదంబను -
సుజ్ఞాన శాస్త్రంబునందు ద్వితీయాశ్వాసము - సమాప్తము॥

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞానశాస్త్రము.

### తృతీయాశ్వాసము.

క॥ విశ్వాత్మ విశ్వనాయక । విశ్వేశ్వరవిశ్వసూత్ర * విశ్వమయా
త్మా । విశ్వవికల్పసురక్షణ । విశ్వాంతకవిశ్వకర్త * విశ్వాతీతా ॥ ౧॥ వ॥
అవధరింపుము శ్రీకృష్ణుండు కాంతామణికిట్లనియె॥ శా॥ భామా యేరికిఁ
దారకంబు మహిమల్ * భావింపరాదెంతయున్ । సామాన్యుల్ మది *
ఘోరరట్టివిధముల్ * సంసారవారాశిలో । వేమాఱుంబడి యీఁదువారు
సుగతిన్ * వీక్షింపఁగా నెట్లగున్ । భూమీమండలి జన్మశూన్యులగునా *

తారక లక్షణము.

పుణ్యాత్ములుండకన్నన్ ॥ ౩॥ క॥ తారకమహిమను జెప్పెద । నారీమణి
వినుము నీవు * నయమొప్పఁగనా । తారకము జననమరణ ని । వారక
మది శోకమోహ * వర్జితమరయన్ ॥ ౪॥ ఆ-వె॥ తపజపార్చనాది *
దానతీర్థవ్రత । క్రతుకులాశ్రమాది * మతపురాణ । వేదశాస్త్రము
లకు * వివిధంబులగు ధర్మ । ములకుఁ దారకంబు * మొదలు చూవె ॥ ౫॥
క॥ తారకము సాధులకుఁ గడుఁ । జేరువయగు సర్వమునకుఁ * జేరుగడ
యగున్ । ధారుణి నేఁటుల కెల్లను । వారిధిచందంబుగాఁగ * వారిజగంధీ ॥
౬॥ ఆ-వె॥ హరిహిరణ్యగర్భ * లమరదిక్పాలకు । లినసుధాకరా
గ్ను * లనిలశంభు । లాదితారకంబె * యాడించు సర్వంబు । నకును
దారకంబె * నాటకంబు ॥ ౭॥ క॥ తారకము మనశ్శుద్ధికిఁ । గారణమగు
సాధనంబు * గావున మతియా । తారకము నభ్యసించిన । వారికిఁ జలనంబు
గలదె * వారిజనయనా ॥ ౮॥ ఆ-వె॥ తారకంబు త్రిగుణ * తాపంబు
లను బాపు । నీషణములమాపు * నెల్లవాస । నలను జంపఁ జేయు *
నరివర్గమును గెంటు । నడఁచు వ్యసనముల మ * దాష్టకంబు ॥ ౯॥ సీ॥
తలిదండ్రి గురు బంధు * తరుణి గోబాలక - హత్యలను మిగుల * నఘ
ములైనఁ । గడఁగి పెక్కు లనన్య * కాంతలఁ గూడినఁ - గామాంధ
మను మహా * కలుషమైన । పలుమాఱు హేమాది * పరవిత్తములు

చాల-దొంగిలించినమహా * దోషమైన । బహ్వనృతాదిపా*పములై
న వేమాఱు - సురను గ్రోలినఘోర * దురితమైన । నింకనెటువంటిపా
పంబు * లిలనొనర్పు । పాతకులునైనతారకం * బందిరేని । నిఖిల
కలుషంబులనుబాసి * నిమిషమునను । ముక్తినొందంగఁగలరింతి *
ముదముతోడ॥ ౧౦॥ క॥ అతిదుష్కృతములుసేయుచు । సతతము
వాల్మీకిబోయ * జన్మందయ్యెన్ । గతజన్మఁడగుటనెఱుఁగవె। సతి
తారకధనమువలనఁ* జర్చింపంగన్॥౧౧॥ ఆ,వె॥ మునులుకోపతాప*
ములుగల్గిశాపంబు । లొరులకొసఁగియుండి* యుర్విఁదామునీచజాతు
లందు * నెటేఁబుట్టియును దార।కమునఁగా దెవారు * ఘనులునైరి॥
౧౨॥ క॥ సారసమిత్రునిఁబొడఁగని । ధారుణిగాఢాంధమెల్లఁ* దాఁ
బాయుగతిన్ । దారకముగాంచినప్పుడె । నారీమణిపాసిపోవు * నఖి
లాఘంబుల్॥ ౧౩॥ ఆ-వె॥ తారకంబుచేత * దగ్ధంబుగాకుండు ।
నట్టిపాపమెద్ది * యవనిగల్గ । దెట్టియఘముల్లైన* గొట్టివేయఁగఁజా
లు । తారకంబెపరమ* తారకంబు॥ ౧౪॥ క॥ చీరఁగలదేయఘంబు
లఁ । దారకతత్పరులకఘము * తగఁగలదనునా । క్రూరులపాపము
మాత్రము । తారకమొగిఁ బాపలేదు * తరుణేందుముఖీ॥౧౫॥ ఆ-వె॥
తారకామృతంబుఁ * ద్రావుభక్తులకును । వేఱెధర్మమొకటి*గోరఁ
దగునె । కాంక్షలెల్లనొసఁగు * కల్పవృక్షంబుండ । గచ్చపొదనుజే
రు * కరణిఁగాదె॥ ౧౬॥ క॥ సారసగర్భుండాదిగ । సారసముఖిసకల
జీవ సంఘంబులు నా । తారకముచేతఁగల్గెను। తారకమేవిశ్వమున
కుఁ* దారకమరయన్॥ ౧౭॥ తే-గీ॥ తారకముచేతరోగముల్*పాఱి
పోవు । తారకముచేత దారిద్ర్య * తతులువాయుఁ । దారకముచేత
సౌఖ్యంబు * ధనముఁగల్గుఁ । దారకముచేతనీడేరుఁ*దలపులెల్ల॥౧౮॥
సీ॥ ధరణిదైవముఁలెల్ల * దారకంబుసమంబె - యీప్సితంబుప్రజల *
కిచ్చునెడల । గామధేనువుతాల* కంబుతోసరియౌనె - యీప్సితం
బుప్రజల * కిచ్చునెడలఁ । గల్పవృక్షముతార * కంబునుబోలునే -
యీప్సితంబుప్రజల*కిచ్చునెడలఁ । దలఁపఁజింతామణి * తారకంబు
సమంబె-యీప్సితంబుప్రజల-కిచ్చునెడల॥౧౯॥ ఆ-వె॥ మునునిలింప
భర్త * తనవైభవంబెల్లఁ । గోలుపోయిపిదప * గురునికరుణఁ। జేసి

ప్రణవమంత్ర * సిద్ధిఁగైకొనిగాదె । యఖిలరాజ్యపదవి నందఁగలిగె॥
క॥ తారకమె శాంతినిచ్చును। తారకమే జననవార్ధి * దాఁటించును నా। తా
రకమె మాయఁ బాపును। తారకమే మోక్షమొసఁగి * ధన్యునిఁ జేయున్॥
౨౦॥ ఆ-వె॥ తారకంబుకంటెఁ * దగ మోక్షసాధనం। బొండు లేదు
జగతి * మండలమునఁ। దారకంబె పరమ * ధర్మంబటంచును। బరమ
శివుఁడు దెల్పెఁ * బార్వతికిని॥ ౨౧॥ క॥ తారకమె మూలమంతకుఁ।
దారకమే సకలప్రాణి * తతుల వెలుంగున్ । దారకమే లేకుండిన । నీరే
డు జగంబులపుడె * నిర్మూలమగున్॥ ౨౨॥ ఆ-వె॥ తారకంబనియెడు *
ధనమును గైకొన్న ! వారికెన యెయింద్ర * వైభవములు । వారిపదవిఁ
జెప్ప * వశమె శక్రునకైన । నబ్జభవునకైన * హరునకైన॥ ౨౩॥ క॥
తారకము జీవులకు నా। ధారముగా వునను జూడఁ * దగ నంతటికిన్। దార
కము తానె యగు నా । కారణమునఁ గల్గెఁ దార * కంబను పేరున్। ౨౪॥
ఆ-వె॥ తారకంబనంగ * దైవంబె భావింప । దైవమనఁగఁ బరగుఁ దార
కంబె। తారకంబుకంటెఁ దలఁపంగ వేఱొండు। దైవమరయ లేదు* ధరణి
లోన॥ ౨౫॥ చ॥ తలఁప ననేకపూసలొక * దారమునందున నిల్చిన
ట్లుగా । నిలఁగల జీవకోటులకు * నెల్లను దైవమె సూత్రధారియై। య
లరు సమస్తభూతముల * యందుఁ జరించుచునుండు నాతనిన్। తెలియుట
దుస్తరంబు మఱి * దేవగణంబునకైన రుక్మిణీ॥ ౨౬॥ ఆ-వె॥ అక్క
జముగ నతఁడె * పెక్కండ్రవలెఁ దోఁచు । నిక్కమెన్ని చూడ * నొక్కఁ
డగును । నింద్రజాలకుండు * నిఖిలంబుఁ దనమాయ । గాను జూపుఁ
దాను * గాఁడెయొకఁడు॥ ౨౭॥ క॥ దారువులయందు ననలము । తీ
రునఁ దైలంబు తిలల * దీపించు గతిన్ । క్షీరముల ఘృతము భంగిని। నా
రయ భగవంతుఁడుండు నఖిలమునందున్॥ ౨౮॥ తే-గీ॥ చుట్టు తెరలో
నఁదా నుండి సూత్రములను। బూని బొమ్మలనాడించు * వాని లీల। మా
యఁ దాఁ జాటు చేసుక * మఱుఁగు నుండి । జీవులను నెల్ల నాడించు * దేవుఁ
డొకఁడె॥ ౨౯॥ క॥ వాలాయంబా దైవము । నా లీలన్ నడుపకున్న *
నానాజీవుల్। కీలూడిన బొమ్మల క్రియఁ। గూలవె నిమిషంబులోనఁ గువల
యనేత్రీ॥ ౩౦॥ ఆ-వె॥ బొమ్మలాడుచున్న * పోల్కిఁ గానఁగనుపించు। నాట
కుండు లేక * యాడఁగలవె। యాడుమేని బొమ్మ * లందఱు నొగిఁ గందు।

రరయలేరుబొమ్మ * లాటకాని॥ ౩౦॥ క॥ బొమ్మలనాడించుచుందను।
బొమ్మలమధ్యమునవెల్గు * భూతేశ్వరునిన్ । నెమ్మదిగానకతంత్రపు ।
బొమ్మలనమ్మియునుమాయఁ * బొందుదురెలమిన్॥ ౩౧॥ ఆ-వె॥
తంత్రములకుమేటి * యంత్రంబులకుమేటి । మంత్రములకుమేటి *
మంత్రమగుచు । సూత్రములకుమేటి * సూత్రంబుతారక । సూత్ర
మదియెబ్రహ్మ * సూత్రమనఁగ॥ ౩౨॥ క॥ చోరుండైనను దురితా ।
చారుండనునైనసమిత* జారుండైనన్ । గ్రూరుండునైనమఱియా।
తారకతత్వంబుగనిన * ధన్యాత్ముఁడగున్॥ ౩౩॥ ఆ-వె॥ అట్టితార
కంబు * నందంగశక్యమే । యెట్టివారికైనఁ * బట్టువడదు । పట్టు
వడినయేని * భగవంతుఁడాతఁడే । యనఁగవచ్చునెవ్వఁ* డైనగాని॥
౩౪॥ క॥ మతవర్గంబులచేతను । వ్రతజపతపశౌచదాన * వరశీల
ములన్ । గ్రతుతీర్థకర్మదుష్కృత । గతులనుగనరాదుతార * కంబర
యంగన్॥ ౩౫॥ క॥ మఱియీతారకమార్గము । పరికింపంగ నరుదీ
ప్ర*పంచమునందున్।దరిఁజేరలేనిమార్గము।లరయఁగఁబెక్కులునుగల
వు* హంసవిహారీ॥ ౩౬॥ సీ॥ జలజాక్షీవినుముప్ర*జ్ఞానమేబ్రహ్మమున్
ఋగ్వేదవాక్యంబు*రీతిఁదెలిసి।పరికింపఁగానహం।బ్రహ్మాస్మియనుయజు
ర్వేదవాక్యంబును*వివరమెఱిఁగి। దనరఁదత్వమసినాఁ*గనుసామవేద
వా-క్యంబునుభావించి*యనువుమీఱఁ। గ నయమాత్మాబ్రహ్మ*మను
నథర్వణవేద - వాక్యంబువీక్షించి*వరుసతోడ । నితరసంకల్పములు
లేక * నిశ్చలతను । భూతములకెల్లనాధార * భూతుఁడైన।బ్రహ్మమే
యాత్మయాత్మయే * బ్రహ్మమనుచు । నాత్మవేత్తలుగాంతుర* హర్ని
శంబు॥ ౩౭॥ క॥ పందునిశయ్యనురంభయు।నుండియుఁగార్యంబు లేని*
యొప్పునఁదమలో।నిండియుదానై వెలుఁగుచు। నుండినదారకమునొం
ద * నోపరుచెనటుల్॥ ౩౮॥ ఆ-వె॥ ఇలనుదారకంబు * సులభమై
యుండంగఁ । దెలియలేకగుట్టు* తెలివిమాలి। మతములాదిపెక్కు*
మార్గంబులంజిక్కి । వెతలఁబడుదురెల్ల*వెఱ్ఱినరులు॥ ౩౯॥ చ॥ మత
కులశాస్త్రధర్మములు*మానితదాశ్రమమూదిపద్ధతుల్।పతతముభక్తిఁ
బెంపొదవ*సద్గురుపాపములాశ్రయించిన। ద్గతిఁగలిగించుతారకముఁ*
గాంచినవారికెగాక మన్యపు। శ్రుతినరునొందువారలకు*పామెమెరా

యఁగజన్మబంధముల్॥ ౪౦॥ క॥ తారకధనమార్జించిన । వారలకును
ననన్యధనము * పరఁగఘునంబై । సారామృతములుగ్రోలిన । వారికిఁకీ
రాదులెంత * వసుమతిలోనన్॥ ౪౧॥ క॥ తారకమేసచరాచర । తా
రకమనియాత్మలోనఁ*దలఁచుచుఁదమకా।తారకమేతారకమని। తారక
మునుజెందువారె*తత్వజ్ఞులిలన్॥ ౪౨॥ ఉ॥ ధారుణికెల్లరాజగుచుఁ*
దానెప్రభుత్వముఁజేయుచుండిన । న్నారయవిశ్వమెల్లఁదన హస్తము
లోఁపలఁజేర్పనోపినన్।నేరుగసర్వవిద్యలను*నేర్చికవిత్వముఁజెప్పఁజాలి
నన్ । దారకసూక్తిలేకభువిఁ * దత్సకలంబునువ్యర్థమూరయన్॥౪3॥
ఆ-వె॥ తారకంబునకును*దాత్పర్యమగునాత్మ । సూత్రధారియనఁగ*
జ్యోతియనఁగ।పరమహంసయనఁగఁ*బరమాత్మయనఁగను। స్వామియ
నఁగసర్వ*సాక్షియనఁగ॥ ౪౪॥ క॥ మగువావిను బ్రహ్మంబనఁ । దగఁ
బరతత్వంబనినను* దైవంబనిన । న్నగుణుండనక్షరుఁడన । భగవం
తుఁడనంతుఁడనఁగఁ*బరమాత్మునకౌ॥ ౪౫॥ ఆ-వె॥ పసిడిస్వర్ణహేమ*
బంగారమనినను । గనకమునకు వేఱు* గానిభంగిఁ । బెక్కునామము
లను జేర్కొనుచుండినఁ । దారకంబునకును * వేఱుగలదె॥ ౪౬॥ క॥
అనఁపరమాత్ముఁడొకండే। యనువునరూపములు పెక్కు * లయ్యెనొ
చోద్యం । బునునయ్యేశంకమదిదోఁ । చెను దీనిందెల్పుమనిన * శ్రీ
హరిపల్కెన్॥ ౪౭॥ ఉ॥ ఏకముగాదెమృత్తిక య * నేకములై చెలు
వొందుఁగుంభముల్।ఏకముగాదెహేమమున*నేకములై నెగడొందు
భూషలున్। ఏకముగాదెతంతువున*నేకములైగనుపించువస్త్రముల్।
ఏకపరాత్మదేహముల*నేకములైవిలసిల్లునట్లుగన్॥ ౪౮॥ సీ॥ అజహర
హరినరా * ద్యసురదిక్పాల స - న్మునిసుధాకరతార * లినసుపర్వ ।
గరుడకిన్నరయక్ష * గంధర్వపన్నగ - శిష్ట విద్యాధర * సిద్ధసాధ్య ।
హరిణమర్కటభృంగ * హరిసూకరశునక - గజతురంగపతంగ *
ఖరలులాయ । బ్రాహ్మణచండాల * పశుక్రిమికీటక - వ్యాఘ్రభల్లగ
హన * వనధిగోత్ర । జాలస్త్రీపురుషగనపుం * సకవికార । జార
చోరార్భకావృద్ధ * జనసమాజ । పంచభూతాదిసర్వాప * పంచమం
దు । నిండునందనకపరాత్మ * నిండియుండు॥ ౪౯॥ తే.గీ॥ శాకి
నీబ్రహ్మరాక్షస * సముదయములు । భూతబేతాళములతండె * పూని

చూడ । మంత్రఘనయంత్ర తంత్రాది * మహిమలకును । గారణుం
డగు సర్వాధి * కారియతఁడు॥ ౫౦॥ క॥ భూరజహిమ రేణువులను ।
దారల లెక్కింపవచ్చుఁ * దరుణీమణియా । తారకబ్రహ్మముసర్వా *
కారంబులు నెన్న బ్రహ్మ * కైనను వశమే॥ ౫౧॥ చ॥ పుడమిసమస్తజీవు
లను*బొమ్మలఁజేసియునాడఁజేయుచున్ । విడుచును గొన్ని కొన్నిఁటిని*
వీడక కొన్నిటినిల్పి కొన్నిఁటిన్ । నడఁచు నెఱుంగలేరెవరు*నాతనిమా
యలకెల్లవారలు । న్నడఁగిపబద్ధులౌదురు మ*హాత్ములు పండితులెల్ల
నంధులై॥ ౫౨॥ ఆ-వె॥ కర్తకర్మక్రియలు * గలయంగఁదానయై ।
తానుగానిభంగిఁ*గానఁబఱచు॥ నజుఁడుగలుగఁజేయు*హరిరక్షణము
సేయు । శివుఁడులయమునొందఁ * జేయుననఁగ॥ ౫౩॥ క॥ సర్వము
దైవాధీనము॥ సర్వంబునఁ లఁడతండు* సర్వపముండై॥ సర్వంబుతానె
యగుచును । సర్వంబునుగాక వెల్గు * సమరసవృత్తిన్॥ ౫౪॥ ఆ-వె॥
కలఁడు కలఁడటన్న * ఘనులకు దైవంబు । గలయ వెందునైనఁ * గల్గి
తోఁచు॥ లేఁడు లేఁడటన్న * లీలదా నెందైనఁ । గలిగిహీనులకును * గానఁ
బడఁడు॥ ౫౫॥ సీ॥ రాజునై మంత్రినై * రయమొప్ప - భృత్యుఁడై
యోగినై భోగినై * రోగియగుచు । కర్ముఁడై ధర్ముఁడై * కడుబలా
బలుఁడునై - యర్థినై దాతనై * హర్తయగుచు । శాంతుఁడై యుగ్రుఁ
డై *సత్యాత్ముఁడై యన్య - తాత్ముఁడై పేదనై * ధనికుఁడగుచు॥ సుజనుఁడై
మూఢుఁడై * సుజ్ఞానవంతుఁడై - ధీరుఁడై భీతుఁడై * జారుఁడగుచు ।
నొక్కచోటనాడు*నొకచోటఁబాడువే॥ యొక్కచోటనేడ్చు*నొకట
నవ్వు॥ నొక్కచోటగిట్టు* నొక్కటఁబుట్టుపో॥ వానిమహిమ దెలియ*
వశమెయింతి॥ క॥ వారనవీరన నెవ్వరు॥ నారీమణి పెక్కురూప * నామ
ములగుచున్ । వేఱుగ వేఱుగఁదోఁచుట । నారయమదికల్పితంబు *
నాటకుఁడొకఁడే॥ ౫౬॥ ఆ-వె ఒక్కఁడగుచుఁదాను * బెక్కు దెఱంగుల॥
నిట్లు చేయఁబడుట * యేలయనిన॥ నొనరఁదనకుఁదావి * నోదంబుకొఱకు
నై॥ యాచరించుచుండు * నద్భుతములు॥ ౫౭॥ చ॥ తలఁపఁగనింద్రజాల
కుఁడు*తన్మహిమన్ గరులొంటెలశ్వములన్॥ చెలఁగిరథాదిసైన్యములు*
చిత్రపురంబులుఁ జేయుమాపున॥ వ్వలనతఁడొక్కఁడై నటుల * వారక
దైవముసర్వజీవులన్ । గలుగనొనర్చువింతలను* గాంచు నడంచును

నొక్కఁడౌదుర ॥ ౫౯ ॥ ఆ-వె॥ ఎన్నిగతులఁదోఁచి * యేవిధంబున
నున్న । దానుగానిదొకటి * దలఁప లేదు। అగ్ని కుష్ణగుణము * లరయంగ
సహజమై । వేఱుగానిభంగి * సారసాక్షి ॥ ౬౦ ॥ క॥ తనమాయ
వలననైనది। తనకన్యముగా దెదియును * దత్సకలమునన్ । దనరూపు
గల్గియుండును । దనమాయ లయింపనిల్చుఁ * దానొక్కరుఁడే। సీ॥
బ్రహ్మవేత్తలయందుఁ * బామరజనులందు - బలయుతులందు దు * ర్బ
లులయందు। ఘోరపాతకులందు * భూరిపుణ్యులయందుఁ - గపటాత్మ
లందు ని * ష్కపటులందు । నన్నృతాత్ములనుసూనృ * తాత్ములయం
దును - మతిశాంతులందుఁదా * మసులయందు । ద్రవ్యవంతులయం
దు * దారిద్ర్యజనులందు - ధర్మాత్ములందు న * ధర్ములందు । దీనజను
లందునాజగ * దీశులందు । నెచ్చుతగ్గులు నేమియు * నెంచరాక ।
సర్వజీవులఁబరమాత్మ * సముఁడునగుచు । నొక్కరూపంబు చేవెల్గు *
నిక్కముగను॥ ౬౧ ॥ క॥ ఒకఁడేపకలచరాచర । నికరంబులయందుఁ
గలుగు * నిక్కంబుగ నా । సకలేశుఁడుగాకన్యం । బిఁక నెవ్వరు
దిక్కుగల్గ * రెందువెదకినన్ ॥ ౬౩ ॥ తే-గీ॥ అండపిండాండబ్రహ్మాండ *
మాదియగుచు । నాళలీనమైనట్టియా * నభముమాడ్కి । ఘటకటా
దులఁజరియించుఁ * గాలిపోల్కిఁ । దారకమలరుమణిగణ * తంతువ
ట్లు॥ ౬౪ ॥ చ॥ మునునునునూలులేకనిలఁ * బుట్టను లెవ్వియు లేని
చొప్పున। న్ననువగుమన్ను లేకను ఘ * టాదులు నెవ్వియు లేని కైవడి।
న్ననుమును లేకయాయుధము * లెవ్వియు నేర్పడకుండునట్లుగాఁ। దను
వులునాటలోకములు * దైవము లేకయగావుగావునన్ ॥ ౬౫ ॥ ఆ-వె॥
ఆత్మవలనఁగల్గు * నఖిలప్రపంచంబు । నాత్మకరసిచూడ * నన్యమ
గునె । విత్తువలనఁగల్గు * వృక్షంబుభావింప । విత్తనంబునకును *
వేఱుగలదె॥ ౬౬ ॥ క॥ ఎక్కడఁజూచిన గగనం । బొక్కటియై యుండు
నట్టి * పోలికగానే । దిక్కులుపిక్కటిలం దా । నొక్కఁడె తారకమున
గుచు * నుండుఁదనువులన్ ॥ ౬౭ ॥ తే-గీ॥ దేవుఁడొక్కండెయిలసర్వ *
దేహములను । దోఁచుబెట్టనినీమదిఁ * దోఁచెనేని । భానుఁడొ
క్కండెబహుజల * భాండములను । బెక్కురూపులఁదోఁచఁడే * బిస
రుహాక్షి ॥ ౬౮ ॥ ఆ-వె॥ బాహ్యమందుఁజూడ * బహురూపులై

తోఁచు । నంతరమునఁజూడ * నాత్మయొకటె । చూపునందుఁగల్గు *
రూపంబులెల్లను । జూపులోనఁజూడ * శూన్యమగును॥ ౧౯॥ క॥ నా
వుడుబహువిధరూపుల । భావంబునఁగానుపించు * పరమాత్మునుదిర్ ।
సేవించుటెట్టులోకనిగ । నావిధముం దెలుపుమనిన * నతఁడిట్లనియెర్ ।
౨౦॥ క॥ మానిని పశువులు బేదం । బైనను భేదంబు లేదు * పాలకున
ట్లీ । మేనులుపోకైక భిన్నం । బైనను భిన్నంబు లేదు * పరమాత్మున
కుర్ । ౨౧॥ క॥ తరణియొకండయ్యుసకల । ధరణీవలయమునరశ్మిఁ * త
నదైనగతిర్ । పరమాత్ముండొక్కండై । పరఁగుచునిఖిలంబునిండి *
భాసిలుచుండుర్॥ ౨౨॥ ఆ-గీ॥ జగతిజీవతతుల * చరణంబులన్నియు ।
హస్తిపదములోన * నడఁగునట్లు । చదలు మొదలుభూత * సకలప్రపంచం
బునాత్మలోనిదగుచు * నడఁగియుండు॥ ౨౩॥ క॥ నీరజహితశశి కాంతులు ।
బాఁఅనిచోటులనునైనఁ * బరికింపఁగనా । తారకబ్రహ్మముగలుగును । సా
రసముఖియతఁడు లేని * స్థలముంగలదే ॥ ౨౪ ॥ ఆ-వె॥ ఇంతలావటం
చు * నింతదీర్ఘంబంచు । నిట్టివన్నెయంచు * నిట్టిదంచు । నాత్మనె
న్నరాదు * నామరూపాదిక । ములకతీతుఁడగుట * మోహనాంగి॥
౨౫॥ క॥ అనలంబుఁదాకియినుమును । దనరూపై దోఁచునట్లు * దై
వము నానా । తనువులయందునఁగల్గియుఁ । దనవలెనేగానుపించుఁ *
దత్సకలంబుర్ । ౨౬॥ క॥ ఘనమణిగణములు వేఱగుఁ । దనరంగా వాని
యందుఁ * దంతువొకటియాఁ । దనువులుసర్వము వేఱగుఁ । గనుఁగొన
దైవంబొకండు * కాంతామణిరో । ౨౭॥ సీ॥ అలలును బుద్బుదం * బులు
ఫేనములునన్న - నవియెల్లనీరంచు * నరయునట్లు । నాయుధంబులు
రూప * నామముల్ వేఱైన-నవియెల్లనినుమంచు * నరయుభంగి । న
వనిభూషలురూప * నామముల్ వేఱైన- నవియెల్లఁబసిఁడినా * నరయు
భాతి । రూఢిపల్వలునామ * రూపముల్ వేఱైన * నవియెల్ల నూలంచు *
నరయురీతి । నరయకుంభరూప * నామము ల్వేఱైన । నన్నిమన్నెయం
చు * నరయుపోల్కిఁ । బెక్కునామరూప * భేదముల్ దోఁచిన । నిఖిల
మాత్మయంచు * నెంచవలయు । ౨౮। ఉ॥ పూనితటాకభాండముల *
పోల్కనిషేధ మొనర్చితద్గతం । బైనజలంబు లేకమిని * భావమునర్
దలపోయుచందమిా । మానవదేవపక్షిమృగ * మానితజంతునికాయ

కాయముల్ । మానితపంత రాత్మఁబర * మాత్ముని నేకముగాఁగనం
దగుర॥౭౯॥ సీ॥ ఒక్క దేశంబున * నొక్క కాలంబున - నొక్క రూపం
బుచే * నున్న వాని । వేఱొక్క దేశాన * వేఱొక్క కాలానఁ - గొం
డొక్క రూపాన * నుండఁజూచి । రూఢి దేశము కాల * రూపముల్ విడి
యల్ల - యతఁడె యీతండంచు * నరయుమాడ్కిఁ । బెక్కు దేశంబులై *
పెక్కు కాలంబులై - పెక్కు రూపంబులై * భేదబుద్ధి । కలరఁదోఁచు
చున్నను * గాలరూప । దేశనామంబు నునెల్లఁ * దీసివేసి । పూనియింత
కుఁగారణ * భూతుండైన । వానినొక్కనిఁగాఁజూడ * వలయునింతి॥
౮౦॥ ఆ-వె॥ ఎన్నిగతులనీకు * నేనుబోధించిన । నాత్మకం బెఁగల్గ *
దన్య మొకటి । యెన్ని యెన్ని రూపు * లెల్లెట్లు దోఁచిన । నన్ని యాత్మె
యంచు * నరయుమీవు॥ ౮౧॥ క॥ అనవుడు వినిపరమాత్ముం । డననే
రూపంబు వాఁడు * నగుజీవాత్ముం । డననెట్టివాఁడు వీరల । కును భేదం

## జీవాత్మ పరమాత్మల లక్షణము.

బేమియనినఁ * గోమలికనియెన్॥ ౮౨॥ మ॥ తరుణీ దేహమునం
దు రెండుగతులన్ * దథ్యంబు మర్మంబుగాఁ । బరమాత్ముండననిర్గుణుండు
నగుచున్ * భాసిల్లు నశ్రాంతమున్ । గరిమన్ జీవుఁడనంగఁ దాసగుణమై *
గన్పించునీ మర్మము । స్నరయందౌను నెఱుంగకున్న నదియే * యజ్ఞాన
మెవ్వారికిన్॥ ౮౩॥ సీ॥ అజ్ఞానమెయ్యది * యనివిచారించిన - నేర్పు
నఁదన్నుఁదా * నెఱుఁగకుంట । యెవ్వరుదన్నుఁదా * నెఱుఁగ రాయె
ఱుఁగర - దే మెఱుంగుదురన్న * నేనుసతిని । నేఁబురుషుండను * నేబ్రాహ్మ
ణుండను - నేక్షత్రియుఁడవైశ్యుఁ * డేను నరయ । నేనుశూద్రుండను * నేవా
నిపుత్రుండ - నేను ధాత్రిధవుఁడ * నేను శివుఁడ । నేను రాముండ కృష్ణుం
డ * నేనునరుఁడ । ననెడు పద్ధతు లెఱుఁగుదు * రందఱిలను । నట్టియ
జ్ఞానమును బాసి * యతులమహిమఁ । దన్నుఁదాఁగన్న వారలే తత్త్వవి
దులు॥ ౮౪॥ ఆ-వె॥ ప్రచురమైనజీవ * పరమాత్మ భావముల్ । తేఁట
తెల్లమిగను * దెలియవలయు । నట్లుగాకయున్న * నబ్జభవాది నిర్జ
రులకైనఁ జెడదు * సంశయంబు॥ ౮౫॥ క॥ కావునసతి పరమాత్ముని ।
యావిధమును గొంతవింటి * వది యెట్లుండెన్ । జీవాత్మ తెఱఁగు వినుమిఁ
క । భావంబునఁ జిక్కులెల్లఁ * బాయును నీకున్॥ ౮౬॥ ఆ-వె॥ జగతి

పాపపుణ్య * చయమునుగావించు । నరకస్వర్గములను * ననుభవించు । నెఱుఁగుచుండుమఱచు * నెల్లకార్యంబులు । సేయుచుండువాఁడె*జీవుఁడగును॥ ౮౭॥ క॥ జీవుఁడెజన్మకుమూలము । జీవుఁడెసుఖదుఃఖములను * జెందునుధాత్రిన్ । జీవుఁడెబంధములోఁబడు । జీవుఁడెమోక్షంబుఁగాంచు * సిద్ధమెతరుణీ॥ ౮౮॥ ఆ-వె॥ సఖియజీవుఁడెన్న * సకలేంద్రియములకు । రాజనగుచునుండు * రాజితముగ । నతఁడులేకయింద్రి * యంబులునేమియుఁ । జేయఁజాలవింక * సిద్ధముగను॥ ౮౯॥ క॥ ధరపఢ్వింశకుఁడగు నా । పరమాత్ముఁడెయించునాత్మ * భావింపవలెన్ । మఱిపంచవింశకుండన । నరుదుగమనమనినజీవుఁ * డనిగాంచఁదగున్॥ ౯౦॥ తే.గీ॥ ఇంద్రియంబులుచైకొని యెల్లపనులు । గడుపునట్లుగఁజేయఁదాఁ * గర్తయగుచు । నీలతోయదమధ్యస * న్మేరుపీఠి । సభికుఁడై యుండుజీవుండు * జాగరమున॥ ౯౧॥ క॥ గళమునకుడిగ్గినిల్చిన । కలలనుగనుచుండుహృదయ * గతుఁడైన యెడన్ । దెలివిదొఱంగియవిద్యను । నలరంగామునిఁగిపోవు * నఖిలముఁదానున్॥ ౯౨॥ తే.గీ॥ అంతనాపంచ కమలసిం * హాసనమునఁ । జేరిజీవుండుజాగ్రత్తఁ * జెందితవదు । భటులుగానున్నయింద్రియ* పఙ్క్తిచేత । నెల్లకార్యంబులునుజేయ * నేర్పరించు॥ ౯౩॥ క॥ జీవుఁడె జాగ్రతనొందును । జీవుండేకుడుచుఁగట్టుఁ*జేయునుబనులన్ । జీవుఁడె స్వప్నముగాంచును జీవుండేనిద్రఁజెందు * జీవుఁడెతెలియున్ ॥౯౪॥ క॥ ఇనతేజమాశ్రయించియు । జనులాయాపనులఁజేయు * చందము పరమాత్మునిసత్తామాత్రంబునఁ । బనిగొనియనమింద్రియముల*పనులనుగడపున్॥ ౯౫॥ తే.గీ॥ స్వాంతమును జేర్పననువొందఁ * గానయస్సు । నెట్లుచలియించునారీతి * నిర్గుణంబు । నైనబ్రహ్మంబుసన్నిధి * నరయఁద్రిగుణ । సహితుఁడగుచునుజీవుండు * చలనుఁడయ్యె॥ ౯౬॥ ఆ-వె॥ సఖియ మన మనేక * సంశయములకుమూ । లంబు నిగ్రహింపఁ రానిదంచు । నెంచిచూడసకల * చాంచల్యములకును । గారణంబునగును * గానవినుము॥ ౯౭॥ ఉ॥ ఇట్టిమనంబుదుస్తరమ * దెట్టులనిగ్రహమేనొనర్తునా । నిట్టటుసంచరించుపశు * వెట్టులబంధమొనర్పనిల్చునో । యట్టులనెప్పుడేమఱక * యార్యులబోధనుమంచి

వాగెలర్ | గట్టుపడంగఁజేసినను గాకను గాలిమనంబునిల్చునేర్చా॥
ఆ-వె॥ ఒనరవలలనురుల * నోదలఁగోలలఁ | గాదెఝషకపక్షి * గ
జమృగంబు | లాదిదగులువడుట * యట్లుతారకసాధ | నముసమాన
సేంద్రి*యములుచిక్కు॥ ౯౯॥ క॥ అనవుడుఁదనువొక్కటియే | గ
నుపడునందజేకినాల్గు*గలవనిమేనుల్ | వినియుందు నెవ్వియవియనఁ|
గనకాంగికిననియెగోపి * కావల్లభుఁడున్॥ ౧౦౦॥ క॥ మరితత్వపంచ

## తనుచతుష్టయ నిర్ణయము.

వింశతి|సురుచిరముగఁగల్గినదియె*స్థూలశరీరం|బరయఁగజాగ్రతదాని
కి|విరివిగనామంబునలరు*విశ్వుఁడనంగన్॥౧౦౧॥ క॥ జ్ఞానేంద్రియశ
బ్దాదులు | మానిని ప్రాణములుగూడి*మానసబుద్ధుల్ | గానయ్యెసూ
క్ష్మమదికల | దానికినామంబుగల్గెఁదైజసుఁడనఁగన్॥ ౧౦౨॥ క॥ ఇరవు
గఁజిత్తమ్ముజ్ఞాతను | గరమరుదుగఁగూడినదియె*కారణదేహం | బర
యసుషుప్తియుదానికి| బరికింపఁగ నామమొప్పెఁ*బ్రాజ్ఞుఁడనంగన్॥
౧౦౩॥ క॥ కలజాగ్రతనిద్రలలో | నెలమిస్వయంజ్యోతియగుచు * ని
లిచినవెలుఁగే | దలఁపమహాకారణమది | నలువొందుహిరణ్యగర్భుఁ*
డనునామమునన్॥ ౧౦౪॥ తే-గీ॥ మూడుదేహంబులనుదాల్చి * ము
ఖ్యముగను | జీవుఁడీమూడవస్థలఁ * జెందుచుండు | నేయవస్థలనెఱుఁ
గక* యేకరీతి|నుండుపరమాత్ముఁడెపుడున * ఖండమగుచు॥౧౦౫॥క॥
కారణదేహంబనఁగను | నారయగూఢంబుముంచు*నదియేదెల్పున్|
కారణమనువిత్తదియే | శారీరములనెడువృక్ష * చయమొనరింపన్॥
౧౦౬॥ ఆ-వె॥ మూడుమేనులకును * మూలమైయున్నట్టి | పరము
గానలేక * భ్రాంతుఁడగుచు | నిద్రజాగరముల * నిరతంబుజీవుండు|
మునిఁగితేలుచుండు * మూఢవృత్తి॥ ౧౦౭॥ మత్తకోకిల॥ చెన్నుగా
నిలజన్మకర్మలఁ జెందుచుండెడుజీవుఁడు | న్నెన్నిభంగులనైనఁజెందఁ
డిఁ * కెన్నఁగానలమోక్షమున్ | బన్నుగాఁబరమాత్మనెప్పుడు*భావ
మందునఁగాంచునో|గ్రన్ననంగడదేరునప్పుడె* గట్టిగామఱిజీవుఁడున్
౧౦౮॥ క॥ జలములయందున లవణము | గలిగినగతినాత్మయందె *
గ్గలైమనంబున్|జలగతలవణముపోలికఁ| గలియఁగబరమాత్మయందె*
గతజీవుఁడగున్॥ ౧౦౯॥ ఆ-వె॥ నిర్మలాత్మయందు * నీవికారంబగు|

నట్టిమాయదోఁచు*నెట్టులనినఁ। దోయజారియందుఁ * దోఁచుకలం
కంబు। వలెనటంచుఁదెలియ * వలయుఁదరుణి॥ ౧౧౦॥ క॥ పరమా
త్మయందుజీవుం। డరయంగా నెట్లుగల్గె * ననియెంచకునీ। కెఱిఁగిం
తునదియునెట్లనఁ। బరిశుద్ధపు నీళ్లఁబుట్టు * పాచివిధమునన్॥ ౧౧౧॥
ఆ-వె॥ స్ఫటికముకురమాది*జలములయందునఁ। బ్రతిఫలించువస్తు*
ప్రతతి వోలె। మఱియునిష్కళంక*మైనబ్రహ్మమునందు। మలినమైన
జీవ * మాయదోఁచె॥ ౧౧౨॥ క॥ ఏవిధమైనకలంకము। భావింపఁగఁ
గల్గదెపుడు * పరమాత్మునకున్। గావునమాయలుసర్వము।జీవునకే
గాని మాయఁ * జెందునె యతఁడున్॥ ఉ॥ ప్రాపుగనిర్వికారుఁడగు*
బ్రహ్మమునెద్దియెఱుంగకుండఁగాఁ। బాపపుమాయయేపగిది*ప్రాప్తము
నయ్యెనటంచుఁజూడఁగా। దీపముక్రిందనీడయును*దీపమెఱుంగకదోఁ
చుకైవడి। న్నాపరమాత్మ యందునను * నాతఁడెఱుంగక గల్గె
మాయయున్॥ ౧౧౪॥ ఆ-వె॥ అనిలవశతనెగసి*యంబుధరంబులు।
పరఁగమింటఁగూడి * పాయునట్లు। త్రిగుణవశములగుచు*దీపించు
విశ్వంబు। బ్రహ్మమందు మఱలఁ * బాయుచుండు॥ ౧౧౫॥ క॥ ఫణి
రాజవేణివినుని.ర్గుణుఁడేమాయలనునెఱుఁగ*కుండఁగఁదనలో। గుణ
మయవిశ్వము దోఁచుట। గణుతింపఁగ నూర్ణనాభి*కైవడినొప్పున్॥
౧౧౬॥ క॥ నావుడు చక్రములనఁగను। నేవియగున్నెన్నియవియు

## షట్చక్రనిర్ణయము.

నెచ్చటనుండున్।నేవిధము దెలియఁదగునన। నావెలఁదికినిట్లులనియె*
నగధరుఁడెలమిన్॥ ౧౧౭॥ తే-గీ॥ కమలదళనేత్రయీస్థూల*కాయమం
దు।నరయఁగాసప్తచక్రంబు*లమరుచుండు। గోప్యములుగాననేరికి *
గోచరంబు। గావువానినీకెఱిఁగింతుఁ*గాంతవినుము॥ ౧౧౮॥ ఆ-వె॥ దివ
మురాత్రిగలుగు * దినముకిర్వదియును। నొక్కవేయినాఱు * నూఱు
మార్లు। హంసనడుచుచుండు*నజపాఖ్యనొకరీతి। సకలజీవులందు*
సంతతంబు॥ ౧౧౯॥ వ॥ విరాట్స్థూలశరీరాంతర్గతంబునగుచు గుద
స్థానంబున "ఓం" అను బీజాక్షరంబును భూసదనంబును బీతవర్ణం
బునైయాధారచక్రంబు శోభిల్లు, నందుఁ జతుర్దళంబులయందును-వ-
శ-ష-స- యనువర్ణంబులుం గలిగి భూలోకంబనంజెలంగు నందువల్లభ

శక్తియుక్తుండైన విఘ్నేశ్వరునకు నార్వ్నార్లు హంసలును; లింగస్థానంబున "న" యను బీజాక్షరంబును జలనిలయంబును శ్వేతవర్ణంబునై స్వాధిష్ఠచక్రంబు రంజిల్లు, నందు షడ్దళంబులయందును-బ భ-మ-య-ర-ల-యనువర్ణంబులాఱుంగలిగిభువర్లోకంబనంపగు,నందుభారతీయుక్తుండైన బ్రహ్మదేవునకు నాఱువేల హంసలును; నాభిస్థానంబున"మ"యను బీజాక్షరంబును ననలాలయంబును రక్తరూపంబునై మణిపూరకచక్రంబుభాసిల్లు, నందు దశదళంబులయందును-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-యను దశవర్ణంబులు గలిగి, సువర్లోకంబనంబడు నందు శ్రీసతీయుక్తుండైన విష్ణుదేవునకు నాఱువేలహంసలును; హృదయస్థానంబున "శి" యను బీజాక్షరంబును సనిలవాసంబును ధూమ్రవర్ణంబునై యనాహత చక్రంబు విలసిల్లు, నందుద్వాదశదళంబులయందును- క - ఖ - గ - ఘ - జ - చ- ఛ - జ - ఝ - ఞ -ట - ఠ-యనుద్వాదశవర్ణంబులుగలిగిమహర్లోకంబనంబరగు నందుఁబార్వతీయుక్తుండైన శివదేవునకు నాఱువేల హంసలును; గంఠస్థానంబున "-వా-" యను బీజాక్షరంబును గగనసదనంబును నీలవర్ణంబునై విశుద్ధ చక్రంబు చెలువొందు, నందు షోడశదళంబులయందును- అ-ఆ-ఇ - ఈ - ఉ - ఊ - ఋ - ౠ - ఌ - ౡ - ఏ - ఐ - ఓ - ఔ - అం-అః-యను షోడశస్వరంబులుం గలిగి జనర్లోకంబనందనరు, నందు మాయాశక్తియుక్తుండైన జీవాత్మునకు వేయిహంసలును; భ్రూమధ్యస్థానంబున "-య-" యనుబీజాక్షరంబును పంచభూతసమన్వితంబును మాణిక్యవర్ణంబునై యాజ్ఞాచక్రంబునొప్పు, నందుదళద్వయంబునందును "-హం-క్షం-" అను వర్ణద్వయంబునుం గలిగి తపోలోకంబనం దనర్చు, నందునాదిశక్తియుక్తుండైన పరమాత్మునకు వేయిహంసలును; బ్రహ్మరంధ్రస్థానమున "-రాం-" అను బీజాక్షరంబును సర్వవర్ణ సమగ్రంబునై సహస్రారచక్రంబు వెలుంగు నందు సహస్రదళంబులును గుణనిర్గుణంబులుంగలిగి సత్యలోకంబన వెలయు, నందు సర్వశక్తియుక్తుండైన సద్గురుస్వామికి వేయిహంసలునునర్పణంబగుచుండు॥౧౨౦॥

సం-సీ॥ మజిహృదయాంతర * సందున నొకయష్ట - దళపద్మమలరును : దానినడుమ ! హంసదీపాకృతి : నైు వెలుంగుచు వాయు- చల

నమైయాయష్ట*దళములందుఁ। బాలునింద్రునిదిక్కు * పాఱఁబుణ్యవి
చార-మాజ్ఞేయమునఁగుడ్చు*నట్టిచింత। యమభాగమునఁబాప*మా
చరించెడిచింత - నైరృతిదిగ్రతి * నందుచింత। నెలమివరుణుని
దిక్కు * నిద్రించుచింతయుఁ - గరువలిదిక్కున * గనునచింత॥ తే-గీ।
కోరిధనదునిదిశడబ్బ*గూర్చుచింత। రమణియీశాన్యదిశనువై*రా
గ్యచింత। నతులితంబుగనాజ్యోతి*యట్టికమల। మధ్యముననిల్వనగుఁ
బర * మార్థచింత। ౧౨౧। ఆ-వె। జ్ఞానమనఁగవెల్గు * కైవడినుండు
న। జ్ఞానమనఁగఁదమము * చందమొప్పు। జ్ఞానమనెడువెల్గు * గాం
చినయపుడె య। జ్ఞానమనెడుతమము * సమయునబల। ౧౨౨॥ క।
సుజ్ఞానముగనునంతకు। నజ్ఞానంబువిడిచిచన * దంబుజవదనా। య
జ్ఞానముడుగువఱకును। సుజ్ఞానముదోఁచఁబడదు * సుజనులకైనన్॥
౧౨౩॥ ఆ-వె। వినినివానికంటె * విన్నవాఁడధికుండు। విన్నవాని
కంటెఁ * గన్నవాఁడు। కన్నవానికంటె*ఘనుఁడయారూఢుఁడు। వా
నికంటెఘనుఁడు * వసుధలేఁడు। ౧౨౪। క। ధరనొకని వేరువినియు
ను। మఱివానింజూడనట్టి * మనుజువిధమునన్। బరమాత్ముఁడనేసని
యును। నెఱుఁగవుపాడఁగాంచియతని * నింతకునీవున్॥ సీ॥ కాశి
యన్వాక్యంబు * కర్ణంబుననువిన్నఁ - జెలఁగఁగాశియనుచుఁ * జెప్పు
కొనిన। వినినంతతాఁజెప్పు * కొనినంతమాత్రాన-వారణాసినిఁగన్న *
వాఁడగునొకో। నెలవుగానక్కాశి*నెఱిఁగినవారల- వెనువెంటనేతెం
చి * విలసితముగఁ। గాశికాపురమును * గనులారఁజూచినఁ - గాదె
యాత్మకుఁదృప్తి * కరమటులనె। తే।యరయఁదానన్నఁబరమాత్ముఁ*
డంచువిన్న। నేమిగలదింకఁబరమాత్మ*నెఱుఁగువారి। కరుణచేతను బ
రమాత్మఁ* గానకున్న। వినినచెప్పినవెల్లను * విఫలమరయ। ౧౨౫।
చ। జలజ దళాక్షిలోకమున * సద్గురుమూర్తి యనుగ్రహంబునన్।
దెలివివహించి బ్రహ్మమును * దీఱనెఱుంగక యెంతవారికిన్। బలు
విధశాస్త్రవాసనలఁ* బాయదుసంశయమెంతమాత్రమున్। జెలువుగఁ
జిత్రదీపమనఁ * జీఁకటియున్ జెడనేరనట్లుగన్॥ ౧౨౬। తే-గీ॥ బ్రహ్మ
విద్యయుజన్మంబుఁ * బాపుకతన। నమృతముసుమృత్యుజరలాది*న
డఁచుపలసఁ। బరఁగిఁజండాలుచేనైన*బ్రహ్మవిద్యఁ। బొందదగుసమ్మ

తచ్చువిషం * బునను నైన॥ ౧౨౮॥ క॥ ధరనీచువలన నైనను। నర
యంగా నెట్లువచ్చు * నప్పరమహితం। బరయఁగ నెవ్వరి కైనను। గు
రుతరముగ నతనిఁగొల్చి * గొనకావిద్యన్॥ ౧౨౯॥ క॥ ధనమిచ్చియై
నఁదా నే। ర్చినవిద్యయొ పంగిరైన * శిష్యత్వంబు। న్నొనరించి పరమ
విద్యను। గొనఁదగు మనుజుండు హీన * కులు చేనైనన్॥ ౧౩౦॥ క॥
గురుశుశ్రూషలొనర్చియుఁ। బరవిద్యను గొనుట మిగుల * ఫలకారియ
గున్। మఱిధనవిద్యలు సేవకు। సరిగావని యుందు రార్య * జనులుధరి
త్రిన్॥ క॥ మాటలచేతను మోక్షము। నేటుగ నెవ్వరును దెలియ *
నేరరు గానన్। నాటక ధారుండుండెడు। సూటినిఁ దెలియంగవలయు *
సూక్ష్మములోనన్॥ ౧౩౨॥ తే-గీ॥ ఉండునిమ్మేనడెబ్బది * రెండు వేల।
నాడులందునఁ నిడ వామ * నాసికమునఁ। గుడినిఁ బింగళ యను నాడి * గు
దిరియుండు। మధ్యభాగంబునను సుషు * మ్నయు వెలుంగు॥ ౧౩౩॥ సీ॥
హస్తినాడియుజిహ్వ * యందున నెడమనే - త్రంబున భాసిల్లు * రమ
ణతోడ। నాతిశంఖినినాడి * నాభియందుననుండు - గాంధారియను
నాడి * కంటనుండు। విడకపూషానాడి * కుడికర్ణమందుండు - నెడమఁ
బయశ్వని * యిమిడియుండు। లీలసలంబస * లింగంబునందుండుఁ -
గుదిరికుహూనాడి * గుదమునుండు। మొనసియీ చెప్పినవియెల్ల *
ముఖ్యమైన। నాడులందున నిడయుఁ బిం * గళసుషుమ్న। లనెడు నా
డులుమూడును * నన్నిఁటికిని। శ్రేష్ఠమైనట్టినాడులో * చిగురుఁబో
ణి॥ ౧౩౪॥ క॥ కమలాననపింగళయే। కమలాప్తునినాడియంచుఁ *
గనఁదగునిడయే। కమలారినాడియనఁదగు। నమరంగ సుషుమ్నయ
గ్ని * నాడియనఁదగున్॥ ౧౩౫॥ తే-గీ॥ ఇడయుఁ బింగళయు సుషు
మ్న * యొచటఁగూడు। నట్టిసదనం బె భ్రూమధ్య * మనఁగనొప్పు।
రంగుగనదియొ ముయ్యేటి * సంగమనఁగఁ। గోరిచూడంగనదియొ త్రి *
కూటమనఁగ॥ ౧౩౬॥ క॥ గంగయనంగనునిడయుం। బింగళయన
యమునయనియు * మేటిసుషుమ్న। పొంగుసరస్వతి యనియును।
సంగతి దెలియంగవలయు * సామజగమనా॥ ౧౩౭॥ ఆ-వె॥ రమణి
ఘ్రాణకర్ణ * రంధ్రముల్ భ్రూమధ్య। దిగువఁగలసియుండు * నగణిత
ముగఁ। జెలియ వినుమయదియొ * శృంగాటకంబన। నదెచతుష్పదం

బ * నంగనొప్పు॥ ౧౩౮॥ ఆ-వె॥ నయనవక్త్రగుహ్య * నాసాగుద
శ్రోత్ర | ములునుమూర్ధనవక*మొగినినయ్యె | నెన్నుటకునువశమె*
యీనవద్వారక | నాఁబురంబునీశు*నకునునైన॥౧౩౯॥ తే గీ॥అరయ
నీపురినిర్మితం * బంచచేత | జీవుఁడనియెడు మంత్రితోఁ * జెలువు
మీఱ | నింద్రియంబులనెడుభట * నికరములతో | రమణఁబాలించు
పరమాత్మ * రాజగుచును॥ ౧౪౦॥ క॥ వినుమిఁకనీకాయాపుర| ము
నభగవంతుండు గలఁడు*పురుషోత్తముఁడా| యనఘునిసేవించియుఁబా
వనులగుదురుసూరిజనులు * వారిజగంధీ॥ ౧౪౧॥ ఆ-వె॥ ఒనరఁద్రిపు
టినడుమ * నుపజిహ్వకునుబూర్వ | దిక్కునగుచునుండు * దేవుఁడ
రయ | గూఢమెవ్వరికి న*గోచరమిదిబాహ్య | రూపులన్నిటికిఁ బ*
రుండునగుట॥ ౧౪౨॥ క॥ తెలియఁగవచ్చునుహేష్యము | దెలియం
గావచ్చుకాల * దేశవిధంబుల్ | దెలియఁగవచ్చునునాశము | దెలి
యంగారాదుసుమ్ము * దేవునిమహిమల్॥ ౧౪౩॥ ఆ-వె॥ పద్మనేత్ర
యట్టి * భగవంతునిప్పుడు | నీకుఁదెలుపనాత్మ * నెంచినాఁడఁ| గాన
నిపుడునీదు * కన్నులకందువు | గాఁగఁజూడుమాత్మ * కలఁకదీఱ॥
క॥ ఇందుముఖియాపరాత్పరుఁ | డెందోకలఁడంచునీవు*నెన్నకుమిఁక
నా | యిందుదివాకరనాడుల | యందుసంజరియించుచుండు * నాతఁ
డెతలఁగన్॥ ౧౪౪॥ తే-గీ॥ ఇడనుబింగళనాడిని * నేకరీతిఁ | బవలు
రాత్రియునంతర * బాహ్యములను | మూరుతాకృతియగు పర *
మాత్మఁగనిన | మనుజునకుముక్తికరతలా*మలకమరయ॥ క॥ ఈడును
జోడునులేకయు | నాఁడుదిమగవాఁడుగాక * యఖిలమునందున్ |
గూడియుఁ గూడకమెలఁగెడు | వాఁడేభగవంతుఁడనుచు * వర్ణింపఁ
దగున్॥ ౧౪౫॥ తే-గీ॥ సుదతిపరమాత్మకెన్నడు * తుదయుఁదృష్ణ|
గలుగనేరదుజాగ్రత * కలయుసుప్తి | యరయలేవింకఁద్రిగుణంబు *
లాదిమాయ | లేమియునులేకతావెల్లు * నెల్లయెడల॥ ౧౪౬॥ క॥ సుడిఁ
గొనిషట్చక్రంబుల| విడువకపరమాత్మతంతి*విధముననెపుడున్| నడు
చుచునుండునులోవెలి | నిడపింగళనాడులందు * నిందునిభాస్యా॥
తే-గీ॥ అరయమనమాదిసర్వేంద్రి*యములుగాక | ద్వంద్వకామాది
ముక్తబంధములులేక | జన్మవృద్ధియుక్షీణంబు * జరయుమరణ |

మాదివికృతి లేకయం-ర * మాత్ముఁడుండు॥ ౧౫౦॥ క॥ పరమాత్ముఁడు
సుఖదుఃఖము। లెఱుఁగఁడుపుణ్యంబుపాప*మెఱుఁకమఱపులున్। ఎఱుఁ
గండేకర్మంబుల । నిరతమునొకరీతినుండు*నిర్గుణుఁడగుచున్॥౧౫౧॥
ఆ-వె॥ నిర్గుణత్వమునను * నెద్దియుగాకయు । సగుణరూపమునను *
సకలమగుచు । సర్వసాక్షియగుచు * సగుణాదిజగములు । గాకయుం
డునిర్వి * కారుఁడగుచు॥ ౧౫౨॥ క॥ మదికినిఁదోఁచుచునుండును ।
వెదకినఁగనుపడకయుండు * విశ్వంబెల్లన్ ।బొదలుచునుండునుదానై ।
సదయాంతర్యామియగుచు * సకలమునందున్॥ ౧౫౩॥ ఆ-వె॥నామ
రూపగుణము * లేమిబ్రహ్మమునకు । లేనికతనమాయ*లోనఁజిక్కి।
యతనిగానలేక * యడవియుగంబులు । తపముసల్పుటయును*దాప
సులును॥ ౧౫౪॥ ఆ-వె॥ స్వగతవిగతముల్ స్వ*జాతివిజాతిభే।దము
లులేకనాత్మ * తత్వమగుచుఁ । గన్నవారికెందు*నెన్నశక్యముగాక।
యున్నవానిఁగనుము * సన్నుతాంగి॥ ౧౫౫॥ క॥ అన్నింటనుబర ।
మాత్మయె। యున్నసుదద్రూపులెవ్వి * నొందఁడతండు । నెన్నఁడు
నేగతిఁజెందక । యున్నట్టేయుండునెపుడు * నొక్కవిధముగాన్॥
ఆ-వె॥ అనిన రక్తమాంస * మైన దేహంబుల । యందునాత్మ
యెట్లు * పొందకుండు । నదియుఁ దెల్పుమనిన * నాయిందుముఖి
తోడ । నగుచు నిట్టులనియె * నగధరుండు॥ ౧౫౬॥ క॥ జలజాప్తుఁడు
కల్మషజల । ములఁ దోఁచియు నందుఁ బంక*మునుబొందక ని। ర్మ
లుఁడగుక్రియఁబరమాత్ముఁడు। గలయఁడు నానాశరీర*గతుఁడయ్యుఁ
దగన్॥ ౧౫౭॥ క॥ అనిలముమేధ్యామేధ్యము।లను బాఱియుఁదద్వి
కార*మంటనియట్లే। మునుసర్వభూతజాలము । లనునంటియునంట
కుండు * నాత్మనునెదియున్॥ ౧౫౮॥ తే.గీ॥ అవనిమనుజులు గృహ
ముల * యందుమెలఁగి । కాపురంబులుసేసిన*కరణిసర్వ।లోకముల
యందుఁజూడఁడా * నేకమగుచుఁ । దనువులేతనకిండ్లుగా*దైవమొ
ప్పు॥ ౧౬౦॥ క॥ తనువేతానని యెంచుట । మనుజులకందఱికి సహజ
మగునదిమఱియున్ । దనుఁదానెఱుఁగకమాటికిఁ । దనువేతాననుట
గొప్ప * తప్పగుఁగాదే॥ ౧౬౧॥ ఆ-వె॥ ఇంటనుండువాని * కింటికి
సంగంబు । లేక యుండునట్లు * జోకతోడ । దేహమునకు నందు*

దేహికిసంబంధ । మేమిలేకయెప్పుడు * మెలఁగుచుండు॥ ౧౬౨॥ క॥ ఇంటికివెలిమూనవుఁ । డంటకవిహరించుచుండు * నటువలెదేహం । బంటకదేహిచరించును । నంటినగతినుండుదేని * నంటకయుండున్॥ ౧౬౩॥ ఆ-వె॥ భవనమందునరుఁడు * నివసించియున్నను । నిల్లునే నటంచు * నెంచనట్లు । మేనునందుఁదాను * మెలఁగుచునున్నను। దనువుతాననంగఁ * దగదుచూవె॥ ౧౬౪॥ చ॥ వెలయఁగగేహమందు నను * వింతపదార్థములెల్లఁగన్పడన్ । వెలుఁగునొనర్చివానికిని * వే అగుచుండెడుదీపమట్లుగన్ । నెలయఁగమానసాదిసక* లేంద్రియసంగ తమైనమేనులన్ । దెలివివెలుంగఁజేయుచును* దేహియువేఱగుచుం డునింతకున్॥ ౧౬౫॥ క॥ అనవిని తారకమంత్రం।బును నానతియిమ్మ టన్నఁ * బురుషోత్తముఁడున్ । గనిభీష్మరాజవరసుత । కును జెప్పఁ దొడంగె నిట్లు * కుతుకమెలర్పన్॥ ఆ-వె॥ మగువవినుము మంత్ర* మంత్రమూలములు మం।త్రార్థమంత్రసార * మాదిసైన । మర్మము లనునీకు*మానకయెఱిఁగింతు । నిపుడుసూక్ష్మబుద్ధి*నెఱుఁగవలయు॥

## హంసలక్షణము.

౧౬౭॥ క॥ పరహంసునిసంచారము । నరులెవ్వరునెఱుఁగరింక*నంత రమునకున్ । నరుదెంచులె పూరకమగుఁ । బరికింపఁగరేచకంబు * బాహ్యముకేగన్॥ తే-గీ॥ లోపలికినేగియాయంచ * లోన నడఁగు। నదియె యంతరకుంభకం * బనఁగబరఁగు । వెలికిసంచారమేతెంచి* వెలినడంగు । నదియెపోబాహ్యకుంభకం * బనఁగనొప్పు॥ ౧౬౯॥క॥ పూరకమునసోవర్ణం। బారయరేచకమునందు * హమ్మనువర్ణం।బూర కగూర్చిజపించినఁ । దారకమంత్రంబయగును * దరుణేందుముఖీ॥ ౧౭౦॥ క॥ ఇదియే పరమరహస్యం । బిదియే మంత్రార్థమనఁగ * ని లనుప్రసిద్ధం । బిదియే జపసూత్రంబన । నిదియేపరికింపనజప * నిజవే త్తలకున్॥ ౧౭౧॥ తే-గీ॥ అరయవక్త్రంబు కర్మేంద్రి*యంబుగానఁ। బాయకనునోటజపమును * జేయరాదు । కర్మవాక్కునధ్యానింపఁ* గర్మమునకె । మూలమగుఁగానిముక్తికి * మూలమగునె॥ ౧౭౨॥క॥ వెదవులనుగదలనీయక । విదితంబుగఁబరమహంస * వెంటనటింపన్ । మదిఁబొందించి భజించిన । సదయాత్ముఁడు సులభముగను * సద్గతిఁ

గాంచుర్‌॥ ఉ॥ తారకమంచునెంచఁబడు * తత్వమెఱుంగఁగలేక కొందఱం । పారధరిత్రినాప్రణవ*మంత్రము మాత్రము నేర్చివాక్కు-నర్‌ । సారెకునుచ్చరింపుదురు * సార్థకమేమగుదానభావముర్‌। దారకమంత్రమందునను * దప్పకగూర్చి జపింపలేనివోర్‌॥ ౧౭౪॥ క॥ మానినియేమంత్రంబులు । సానుగజిహ్వేంద్రియమున * జపియింపవలెర్‌ । గానియిఁకవాక్కు-చేతను। బూనిస్మరింపంగరాదు*భువినెవ్వరికిర్‌॥ ౧౭౫॥ క॥ అజపామంత్రంబెవ్వరు । భజియింపక తనకుఁదానె * బవలులరేల । న్నజపనటించును గావున । నజపనునామంబు గల్గె * నాహంసునకుర్‌॥ ౧౭౬॥ తే-గీ॥ చతురపంచషడాక్షరి * సంతతులును । నష్టమేకత్రయాక్షరు * లాదిగాఁగ । సప్తకోటిమహామంత్ర*చయము లెల్ల । మఱియుసరిగావు తారక* మంత్రమునకు॥ ౧౭౭॥ క॥ మంత్రములకెల్లఁ దారక । మంత్రంబేమూల మంత్ర*మగుఁగావున నీ । మంత్రము సామాన్యంబగు । మంత్రంబని యెపుడునీదు * మది నెన్నకుమీ॥ ౧౭౮॥ తే-గీ॥ ధరణినినజపసూత్రంబు*దాల్చినట్టినరుఁడెవండైనఁపాఱుఁడ * నంగఁబరఁగుఁ। దథ్యముగబాహ్యసూత్రంబు* దాల్చియజప । పరతలేకున్ననెట్లగు * బ్రాహ్మణుండు॥ ౧౭౯॥ క॥ బ్రహ్మవిచారమునొందియు । బ్రహ్మముఁగనుఁగొన్న వాఁడె*బ్రాహ్మణుఁడగుఁబో । బ్రహ్మమని నోటఁబల్కు-చు । బ్రహ్మముఁగనలేనివాఁడు * బ్రాహ్మణుఁడగునే॥ ౧౮౦॥ ఆ-వె॥ అనినవెలుఁగటంచు * నందురు కొందఱు । నేమివస్తువదియు * నెట్టులుండుఁ । దెల్పుమంచు వేఁడ* దేవకీనందనుం । డాదరముననిట్టు * లనియె సతికి॥ ౧౮౧॥ క॥ వెలుఁగనఁగాఁబరమాత్ముఁడె । వెలుఁగననలార్క-చంద్ర * వెలుఁగులు గాఁదా । వెలుఁగులకెల్లనుమొదలిటి । వెలుఁగేయీవిశ్వమెల్ల*వెలిఁగించుఁబగర్‌॥ ౧౮౨॥ సీ॥ అబ్జభవాదుల * కాధారమగువెల్గు - ప్రణవరూపంబునై * పరఁగువెల్గు । దివిజేంద్రసురలకుఁ * దేజమిచ్చినవెల్గు - పంచభూతములందుఁ * బ్రబలువెల్గు । అష్టదిక్పాలుర * యందుఁగల్గినవెల్గు - తారచంద్రార్కు-లఁ * దనరువెల్గు । పదునాల్గులోకముల్ * ప్రబలినిండినవెల్గు - సిద్ధచారణులందుఁ*జెలఁగువెల్గు । నిఖిలజీవులయందున * నెగడువెల్గు । అఖిలమునకును బరమునై *యలరు

వెల్గు। చెలఁగియావెల్గునిట్టని* చెప్పుటకును। గమలజునకైనశక్యంబు* గానివెల్గు॥ ౧౮౪॥ క॥ వెలుఁగుచుమలుగకయెప్పుడు । వెలుఁగై భువనంబులెల్ల* వెలిఁగించుటచే । వెలుఁగనునామముగల్గెను । వెలిలోపలఁ గలిగివెలుఁగు* వెలిఁగించుటచేఁ॥ ౧౮౫॥ తే.గీ॥ వెలుఁగనంగనుదీపంబు * విధమునుండు । నంచుఁగొందఱందురుసూవె* యజ్ఞులగుచు। నిఖిలమునకునుగళలను * నిచ్చితాను । నిష్కళారూపమైయుండు * నేమిగాక॥ ౧౮౬॥ క॥ ఎన్నెన్నియాఖ్యలొప్పుచు । నున్నను బరవస్తువునకె * యూహింపఁదగుఁ । గన్నెవిపరీతభావము । లెన్నఁడుఁజేయంగఁదగద* యెవ్వరికైనఁ॥ ౧౮౭॥ ఆ-వె॥ మానితముగ శ్రవణ* మననిదిధ్యాస । లనుగురూపదేశ * మునను జేర్చి। శాస్త్రదృష్టమునను * సరవితోనాత్మని । శ్చయమువలనముక్తి* సంభవించు॥ ౧౮౮॥ చ॥ అరయఁబరాత్మగానకను* యాత్రలుతీర్థములెన్నిసల్పినఁ । గుఱుతుగనశ్వమేధములు * కోటులొనర్చియశంబునొందినఁ। ధరగుడిగోపురంబులును * దప్పకనూతులునేర్పరించినఁ । నిరతమునెల్లదానములు * నిచ్చినమోక్షముగాంచరాదిలఁ॥ ౧౮౯॥ క॥ మనసీయిలఁబొకలసును । జనకుండఁగజేసినెమ్మి * సద్గురుకరుణఁ । దనుదనయందునఁగాంచిన । ఘనమతిమంతునకుసాటి * గలరేజగతిఁ॥ ౧౯౦॥ క॥ తమకుసుమంబులుమూర్కొనఁ । దమఫలములననుభవింపఁ * దరులెఱుఁగనియా । క్రమమునసాపరమాత్ముఁడు । తమలోనసెగల్గియుండి* తామెఱుఁగరొగిఁ॥ ౧౯౧॥ ఆ-వె॥ సఖియతనదునింట*సకలపదార్థంబు । లుండబిచ్చమెత్తు * లోభికరణి । వెదుకనేలతమకు * వెలుపలలోపలఁ । గలిగియున్నయాత్మఁ * గానలేక॥ ౧౯౨॥ క॥ ధరణీపతులకునైనను । వరయోగులకైనభాగ్య * వంతులకైనఁ।బరమార్థమెఱుఁగుకంటెను । బరికింపఁగనెక్కువైన * పదవియుఁగలదే॥౧౯౩॥ చ॥ చెడునుధనంబురాజ్యమును * చిత్రరథంబులు ఘోటకావళుల్ । చెడునుగజంబులొంటెలును* సేనలుకోటలుపట్టణంబులుఁ। జెడుదురుతల్లిదండ్రులును*స్నేహితదారసుతాదిబంధువుల్ । చెడనిపదార్థమీశ్వరుని * చింతనయొక్కటిసర్వకాలముల్॥ ౧౯౪॥ ఆ-వె॥ అఖిలమున్ స్థిరంబ * యరయంగజన్మావె । గతులదుఃఖములకుఁ*గారణంబు। దైవ

భక్తిశాశ్వ * తంబునైజన్మాది । బంధసంకటములఁ * బాపుఁగాన॥
౧౯౬॥ ఉ॥ కూటికిలేకకష్టములు * కోటికివచ్చినఁబత్నిఁబుత్రులున్ ।
గాటికినేగినన్గృహము * గాలినసర్వముకొల్లఁబోయినన్ । నేటుగనెం
దునన్దనకు*నెవ్వరులేకయునొంటిరైయునఁదా। మాటికిదేహజాడ్యము
ల*మ్రగ్గినభక్తినినిల్పఁగాఁదగున్॥౧౯౭॥ ఆ-వె॥ నిరతమాత్మచింత*నె
అపుచుసర్వంబు । మిథ్యయంచుఁగాంచు * మేటివేత్త।పాయఁగలఁడు
మాయ* పాశంబులెల్లను । బాముమేన్గుబుసముఁ * బాయుభంగి॥
క॥ ఫణికేయెఱుకగుఁగాకయు। ఫణిపాదములెఱుఁగ రాదు * బ్రహ్మకున
ట్లే। తనుఁదానెఱుగఁగలేఁడీ । తనువందునఁదత్త్వవేత్త*దక్కఁగనొరుఁ
డున్॥ ౧౯౮॥ ఆ-వె॥ ఆత్మనెఱుఁగువారె * యనుభవజ్ఞులుకాని ।
యెఱుఁగకున్నఁగార * దెవ్వరైనఁ । బ్రసవమైనసతికె * ప్రసవాదివిష
యంబు । లనుభవములువంధ్య * కనుభవంబె॥ ౧౯౯॥ చ॥ తెలవజ
లంబుగ్రోలినను * దీఱునుగాకపిపాసమాఱునే । తఱుచుగసర్పిద్రావి
నను * దాహముహెచ్చునుగాకయట్టులే । స్థిరపరతత్త్వచింతనము *
చేతనుదీఱునుగాకయన్యసం। స్మరణలవెంతమిన్నగల* నైననుబాయు
నెమోక్షతృష్ణయున్॥ ౨౦౦॥ ఆ-వె॥ తన్నుఁదానెఱుంగఁ * దరువు
తాఁగాకుండుఁ। దనువుగానియపుడెఁ * దలఁపులుడుగుఁ। దలఁపులుడిగి
నపుడె * తన్మయత్వమునొందుఁ । దన్మయతనుదానె * దైవమగును॥
౨౦౧॥ ఆ-వె॥ ఆత్మతత్త్వమార్గ * మరయకెవ్వారికిఁ । జిక్కువిడువ
దింత * చిత్తశుద్ధి । గాదుజగతిఁగోటి * కల్పంబులకునైనఁ । గడువ
రాదుజన్మ * కర్మములను॥ ౨౦౨॥ ఉ॥ నావుడుఁగల్గవాత్మకును *
నారయజాగర నిద్రస్వప్నముల్ । జీవుఁడునీయవస్థలను* జెందుచునుం
డునహర్నిశంబులు । న్నెవిధమాత్మయందునను * నిల్వఁగనేర్చును
జంచలుండునా।జీవుఁడుబ్రహ్మమెట్లగును*జెప్పికృతార్థతఁజేయుమచ్యు
తా॥ క॥ అశరీరవిగతకల్పన । విశదాచలతత్త్వనేత * విద్యాతీతా ।
శిశుతాదిమస్థితేఃపర । పశుపతిసంస్తుత్యనామ* పరమలలామా॥ ౨౦౪।

మాలిని॥ జననమరణహీనా * సాధుహృత్పద్మలీనా । మనన
విబుధశీలా * మాయసంహారలోలా । ఘనసదనయమానా * కాల
కల్పాంతమానా । మునిజనహితపాత్రా * మోక్షలక్ష్మీకళత్రా॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్య పుత్ర, సాధుజనమిత్ర నారసింహనామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను-సుజ్ఞాన శాస్త్రంబునందుఁ దృతీయాశ్వాసము - సమాప్తము॥

శ్రీసద్గురవేనమః.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞానశాస్త్రము.

### చతుర్థాశ్వాసము.

క॥ నిర్గుణతత్వనిరీహాత్రి। వర్గాదిసమస్తదోష*వర్జితభూషా।స్వర్గసుఖ నరకదుఃఖ వి। సర్గానృతవీతమాన * సత్యవిధానా॥ ౧॥ వ॥ అవధరింపు మక్కేశవుం డక్కీరవాణి కిట్లనియె॥ ౨॥ ఉ॥ పావనమైననీ విమల *ప్రశ్నలకుం దగునుత్తరంబులుం।భావజవైరిదేవముని*పద్మభవాదులు సెప్పనేర్తురే। నీవును దొంటిజన్మమున * నెట్టితపంబులు సేసియుంటివో।గావుననిట్టిప్రశ్నములు* గల్గెను నీమది కంబుజాననా॥ 3॥ ఆ-వె॥ పడఁతిజీవుఁడెట్లు*బ్రహ్మంబయగునని। యడిగితివిపుడువిను* మదియుఁదెలియ। నెఱిఁగినట్టివారి * కిదిమహాసులభంబ। యెఱుఁగ కున్నఁగష్ట*మెవరికైన॥ ౪॥ క॥ జీవుండెట్టియవస్థల। నేవిధముననైన బ్రహ్మ*మేమరకతగం। జీవభ్రాంతులనుడిగిన। జీవన్ముక్తుండునగును* జీవుఁడుతరుణీ॥ ౫॥ ఆ-వె॥ నీరుపాలునందు * నిజముగాఁ జేర్చిన। క్షీరమగునుగాని * నీరుగాదు। అట్టులాత్మయందు * నాజీవిఁ జేర్చిన। నాత్మఁ డగునుజీవుఁ * డరసిచూడ॥ ౬॥ క॥ క్షీరములఁ గలయు నీరే। క్షీరములగునీటఁగలప*క్షీరములగునే। తారక మొందినజీవుఁడె। తారకమగు మాయఁగలియఁ * దారకమౌనే॥ ౭॥ ఆ-వె॥ బ్రహ్మ

మందుజీవ * భావంబుఁగూర్చిన । బ్రహ్మమగునుజీవ * పదము లేక । యగ్ని యందుఁగాష్ఠ * మనురంగఁగూర్చిన । దారు లేక వెల్గు * దహను మాడ్కి॥ ౮॥ క॥ ప్రవిమల తారకమందున । సవినయముగ మానసంబు * సంధించినచోఁ । బ్రవినాశ మొందు నామది । లవణము జలమందుఁజేరి * లయమొందుగతిన్॥ ౯॥ తే-గీ॥ వివిధ పుష్పంబులంటి జీ * వించునళియుఁ । జంపక ప్రసవముఁదాఁకి * చచ్చినట్టు । లఖిల వృత్తులఁజరియించు * నట్టిగునము । నాశమొందును బ్రహ్మంబు*నంటి నపుడె। ౧౦। క॥ వరసూనృతాత్ముఁడైనను । మఱిశాంతుండైన నీతి మార్గుండైనన్ । బరతత్త్వసంగి గాకయె । సరగున విడదింద్రియముల* చలనంబెపుడున్॥ ౧౧॥ ఆ-వె॥ హరినిఁగన్నయపుడె* యఖిలమృగంబులు । పాదలనడఁగికదలి*మెదలనట్లు । తారకంబునెపుడు*దర్శించు నప్పుడే। యడఁగియుండునింద్రి * యములు మనము॥ ౧౨॥ క॥ సరసీజాప్తుఁడు గ్రుంకెడు । తఱినూరకయుండువిహగ*తతిగతిమనముల్ * బరమాత్మయందు గ్రుంకినఁ । గరమరుదుగ నింద్రియములు * గదలక యుండున్॥ ౧౩॥ ఆ-వె॥ వరుసఁదనకు రాజు*వశుఁడైననుర్వినే।జనులు తన్ను నొంపఁ * జాలనట్లు । నాత్మ తనకువశము * నైయున్న నింద్రియ। చలనమేమిసేయఁ * జాలుఁదన్ను॥ ౧౪॥ క॥ నిరతంబు జీవుఁ డిరవుగఁ । బరమాత్మను గలసిమెలసి*పామరతనువున్ । మఱచినఁ దానే తానగు । మఱియదె జీవేశ్వరైక్య*మనఁగఁజెలంగున్॥ ౧౫॥ తే-గీ॥ అట్టిజీవేశ్వరైక్యంబె * యరసిచూడ । మానితంబగుమాన స*మాధి యనియు। మంత్రగోప్యంబున దెలిరు*మంత్రమనియు । నెంచుచుందురు బుధజను*లంచితముగ॥ ౧౬॥ చ॥ పరిపరి వేదశాస్త్రములు*భ్రాంతికి మూలమటంచు రోసియున్ । దురితపుఁ గర్మమార్గములు * దుఃఖకరంబులటంచు నెంచియున్। బరువడి హంసమంత్రమున * భావముఁ గూర్చినపావనుండగున్ । బరుసముసోఁకిలోహమును*బట్టుగఁగాంచనమైన యట్లుగన్। సీ॥ గుళ్లుగోపురమాది * కూపతటాకముల్ - బహుసత్రవనము లే*ర్పఱచువారు । నఖిలదానంబులు*నాచరించెడు వారు * చెలఁగిమఖంబులఁ * జేయువారు । సత్యవ్రతంబుచే * జగతి భాసిలువారు - తీర్థయాత్రలకెల్లఁ * దిరుగువారు । నష్టాంగ

యోగంబు*లభ్యసించెడువారు. పంచముద్రలలోనఁ* గాంచువారు।
సకలవేదాదిశాస్త్రముల్ * చదువువారు। స్నానసంధ్యాదితపములు*
సల్పువారు। నజపసూత్రంబుఁ జెందిన* యట్టిఘనుల। పాదరజమును
బోలరు * పద్మగంధి॥ ౧౮॥ క॥ రేచక పూరక కుంభక। సూచన
లేనట్టివారు*చూతురుమాయే। సూచనగల్గినవారలు। చూచెడు నా
చూపులోనె * చూచెదరాత్మన్॥ ౧౯॥ ఆ-వె॥ రూపులెల్లఁజూచి *
చూపులోభ్రమఁజెందుఁ। జూపులెల్లభ్రమను*జొరఁగ జేయుఁ। జూపు
నేకమైన* సూక్ష్మంబుగనుపించు। సూక్ష్మమందుఁజేరఁ * జూపునిల్పు॥
౨౦॥ క॥ చూపునురూపును గుణముల। వ్యాపారముచేతఁగల్గె *
వర్ణింపంగన్। జూపునురూపున కవ్వల। నాపోజ్యోతియనవెలుఁగు*నది
తారకమా॥ ౨౧॥ తే-గీ॥ సతియకారంబనఁగ రజ * స్సదియె బ్రహ్మ।
యగు నుకారంబనఁగఁ సత్వ * మదియెవిష్ణు। వగు మకారంబనఁగఁ
దమం * బదిశివుండు। దలఁపనిందెద్దియునుగాదు * తారకంబు॥ ౨౨॥
క॥ బిసరుహలోచన వినుమిఁకఁ। బసమీఱఁగఁదత్పదంబె*పరమాత్మ
యగున్। బొసఁగునుజీవుఁడు త్వంపద। మసిపదమన వీని రెంటి *
కైక్యంబరయన్॥ ౨౩॥ క॥ క్షరమనజీవుండగున। క్షరమనఁబరమాత్మ
యగును*సతియట్టిక్షరా। క్షరములుగూడిననదియే। పరమార్థమనంగఁ
బరఁగుఁ * బంకజనయనా॥ ౨౪॥ ఆ-వె॥ నాదమంచుఁబల్కు *
నదియెయోంకారంబు। బిందువనఁగజీవుఁ*డిందువదన। నాదుబిందు
రెండు * నమరంగఁగూడినఁ। గళయనంగనొప్పుఁ * గమలగంధి॥
౨౫॥ క॥ సత్తనఁగా బరమాత్ముఁడు। చిత్తనఁగాఁదెలియవలయు *
జీవుండనుచున్। సత్తును జిత్తును రెండును। హత్తుగ నేకీభవింప *
నానందముగున్॥ ౨౬॥ ఆ-వె॥ వ్యక్తమనఁగనాత్మ*వరుసనవ్యక్తము।
జీవుఁడనఁగనెగడు*సిద్ధముగను। నాత్మయనినవిద్య * యగునవిద్యను
జీవుఁ। డంచుఁ గాంచవలయు* నంచితముగ॥ ౨౭॥ క॥ గిరినింగోత్ర
మునగమును। కరణినిభాండమునుగలశ * ఘటమునునల్లే। పరమాత్మ
జీవులకు న। త్తెఱఁగునఁ బరినామములను * దెలియు మొకటిగన్॥
౨౮॥ క॥ అనవుడునన్యము లేకయుఁ। దనుఁదానై నిండియుండఁ*దగఁ
బరమాత్ముం। డనియును జీవుండనియును। నను శేమికతంబోయనిన*

హరియట్లనియెన్॥ ౨౯। ఆ-వె। ఆత్మయందుజీవుఁ*డారోపితంబగు।
నెన్ననిజము జీవుఁ * డెందుఁగలుగు। నరయ రజ్జువందు * నారోపి
తంబగు। పాముభ్రాంతినిల్వఁ * బడునెచూడ॥ ౩౦॥ క॥ తనుఁ
దాను గాంచినప్పుడె। మునుజీవ వికారభావ * ములుసర్వంబున్।
దనలోలేకనశించును। గనుఁగొనజీవుండుముగుడఁ* గల్గునెతలఁన్॥
౩౧॥ క। తనమోము ముకురమందునఁ। గనుఁగొన వేఱొక్కరూపు*
గాఁదోఁచుగతిన్। దనువనునద్దములోపలఁ। గనుపడుపరమాత్మ రెం
డు * గతులగునట్టుల్। ౩౨॥ ఆ-వె। దర్పణంబుదీయఁ * దనప్రతిబిం
బంబు। పోయివదనమందె * పొందినట్లు। తనువుదొలఁగిచూడఁ *
దత్ప్రతిబింబంబు। లేకయుండునాత్మ * నేకమగుచు। ౩౩। సీ॥ దర్ప
ణమందునఁ * దనమోముబింబింప - మోముతాననిచూచి * ముద
ముఁజెందు। నాననంబువిధంబు * నద్దంబులోఁదోఁచు - మోము
నిక్కంబైన * మోముఁగనునె। కనులద్దమునుజూచుఁ * గానియా
యద్దంబు-కనులనుజూచుట * గలదెయెందు। నిలదర్పణములేక* నే
త్రయుగమెనిజ - సురుచిరాననమును * జూడఁగలదె। యటులయుగ
ముచేఁదనమోము * నరయుటకును। నద్దమొకసాధనంబునై * య
మరుచుండు। గతినిఁబరమాత్మతన్నుఁదాఁ * గాంచుటకును। జీవుఁ
డొకసాధనంబునై *చెలఁగుచుండు॥ ౩౪। క॥ మనమేపరమాత్మనుగను।
ననినను మనమెట్లుగాంచు * నదిజడమరయన్। దనుఁదానెమనమనె
డుసా। ధనమునఁబరమాత్మయెతనుఁ * దాఁగాంచునొగిన్। ౩౫।
క। తరుణీఘటమేదేహము। తిరముగనందుండుజలమె * తెల్వితలం
పన్। బరమాత్మకుఁ బ్రతిబింబమె। పరికింపఁగజీవుఁడగును * బా
లేందుముఖీ। ౩౬। క। క్షితిజలఘటమునరవికిని। బ్రతిబింబంబున్న
యట్లు * భాసిలుచుండున్। సతియాఘటముదొలంగినఁ। బ్రతిబిం
బంబేదియుంక * భానుఁడెగాకన్। ౩౭। తే-గీ। జ్ఞప్తికాయంబులను
జల * కలశములను। బ్రతిఫలించెను బరమాత్మ * భానుపగిదిఁ।
దెలివిదేహంబులనుమాయఁ*దీసిచూడఁ। దనకుబ్రతిబింబమున్నదే*
తానుగాక। ౩౮। క॥ గుఱుతెఱుఁగలేక రజ్జును। బోరిఁబొరిఫణి
యంచుభీతిఁ * బొందినయట్లే। పరమాత్మయంచుఁదెలియక।మఱిజీవ

భ్రాంతిఁబొందె*మానవుఁడకటా॥ ౩౯॥ క॥ ఇదివట్టి త్రాడటంచును।
బదపడిఁగనుఁగొన్న వాఁడు*పామనియనునే। యిదిపరమాత్మయటం
చును। మదిఁదెలిసినజీవుఁడన్న*మాటవెడలునే॥ ౪౦॥ ఆ-వె॥ ఆత్మ
యందుజీవుఁ * డనుభ్రాంతిఁబొందియుఁ। దిరిగిదానినిజముఁ*దెలసె
నేని॥ యాత్మయంచునిశ్చ*యంబగునాతండు। జీవుఁడంచుభ్రాంతిఁ*
జెందఁడెపుడు॥ ౪౧॥ చ॥ ఇనుఁడునభంబునుండునని * యే ద్వైతనిక్క
మెఱింగిభ్రాంతిచేఁ। గనఁడిఁకఁదోయకుంభమునఁ * గన్పడుబింబమె
సత్యమట్లుగా ఘనపరమాత్మతత్వమును*గాంచినపిమ్మటబ్రహ్మవేత్త
లున్। దనువునజీవబింబమును * దథ్యమటంచుఁ దలంచరెప్పుడున్॥
౪౨॥ క॥ పరమాత్ముఁడెనిజబింబము। పరమాత్మునియందుఁదోఁచు *
ప్రతిబింబంబు॥ న్నరయఁగజీవుఁడె దబ్బర। పరమాత్మనుగనినజీవ *
భావమువాయున్॥ ౪౩॥ ఆ-వె॥ మున్నురజ్జుగాంచి * పన్నగంబను
భీతిఁ। జెందిపిదపదానిఁ*జేరిచూచి। త్రాడటంచుఁజేత*ధరియించు
వానికిఁ। బాముగఅచునంచు*భయముగలదె।౪౪॥ ఉ॥ నాకుఁబరం
బుగానెగడు * నట్టివిధంబువచించుతత్వమున్। నాకును వేఱుగాదను
చు * నారయనేనెదలంచిచూడఁగా। నీకనుపించుదేహమిది*యిల్లని
జంబగునాత్మయేన యే। లోకసమస్తజీవతతి*లోఁనఁబరాత్ముఁడనై వె
లుంగుదున్॥ ౪౫॥ క॥ ననునెఱుఁగకయజ్ఞానులు। తనుగుణములు
నన్నుఁగాఁగఁ*దలఁతురుధరలో। ననునిశ్చయముగ నెఱిఁగినఁ। దను
గుణములునేనుగాను * దథ్యంబబలా॥ ౪౬॥ చ॥ సరగుననొక్కస
ద్గృహిణి*చాలకయేలెనునష్టభార్యలన్। దిరముగనష్టభార్యలతో*
తృప్తినిఁబొందక కామవారిధిన్। జొరఁబడిగోపికాసతుల*షోడశవేలను
గూడెనంచునన్। బరిపరిరీతులిట్లుగను * బల్కుదురల్పులు నంబుజా
ననా॥ ౪౭॥ క॥ గురుకరుణవడసినప్పుడె।గుఱుతుగదేహాదిజీవ* గుణ
ములనెల్లన్। దొలఁగితిసర్వముగానని। పరమాత్ముఁడనైతినాకు *
భ్రాంతియుఁగలదే॥౪౮॥ సీ॥ స్త్రీలోలుఁ డనినన్నుఁ * జెనఁటులనుటె
గాని - యెవ్వరునాజాడ * నెఱుఁగలేరు। దేహమేలేని వి*దేహినై
యుండంగ - నింద్రియంబులునాకు * నెట్లుగల్గుఁ। గామాదికంబులు*
గణుతింపఁగానేవి - కలనిద్రజాగరం*బులునునేవి। సుఖదుఃఖములు

నేవి * క్షుత్పిపాసలు నేవి । స్త్రీపుంసరూపాది * స్థితులు నేవి । త్రిగుణ
రహితుండనగుచును * దివము రాత్రి । నితరసంకల్పములు లేక * యేక
రీతి । సోహమనుపల్కుఁ బల్కుచు * సుస్థిరముగ । నుందు నేనెట్లు సతు
లను * బొందినాఁడ ॥ ౪౯ ॥ క ॥ అంగంబుగలుగువానికె । సంగమ
క్రియలాదిధరణి * సంభవమాఁగా । కంగంబె లేనివానికి । నంగనలను
గవయు టెట్టు * లమరును నాకున్ ॥ ౫౦ ॥ క ॥ తరుణులఁగూడితినందురు ।
పురుషులు మొదలైన సకల * భూతగణంబుల్ । మఱిఁగూడి మెలఁగు
చుండిన । పరుఁడగు నన్నెఱుఁగలేని * పామరులెల్లన్ ॥ ఆ-వె ॥ కులము
లేనివాఁడ * గుణము లేదొకచోట । నునికి లేదయెందు * నొంటివాఁడఁ ।
జుట్టమొకరు లేరు * శూన్యుండఁ దుదమొదల్ । లేనివాఁడఁ గాంత *
లెవరు నాకు ॥ ౫౨ ॥ క ॥ సతిపతులు గూడునదియొక । మితమే సకలంబు
నేర * మించుచునుండన్ । రతియనఁగ నొక్కశాస్త్రమె । సతి యే
నస్ఖలితబ్రహ్మ * చారిని నగుదున్ ॥ ౫౩ ॥ క ॥ తలఁపగ మూత్రపురీషం ।
బులు విడిచిన కరణిసతుల * భోగక్రియలం । దలఁరగ శుక్లము వదలినఁ ।
గలుగు నెయ్యదానబంధ * కము వేత్తలకున్ ॥ ౫౪ ॥ ఆ-వె ॥ ఒక్కచోటె
నాకు * నొక్కదేశంబెనా । కొక్కకాలమగునె * యుండుటకును ।
నిలను నాకును నెల * విదియనవచ్చునే । నిండియుండునెందు * నేనుగా
దె ॥ ౫౫ ॥ క ॥ నేనే భూతములైదును । నేనే మూర్తిత్రయంబు * నిఖిల
జగంబుల్ । నేనె నరసిద్ధదైత్యులు । నేనే దిక్పాలసురలు * నినశశితారల్ ॥
౫౬ ॥ క ॥ గరుడోరగకిన్నర కిం । పురుషాసురసాధ్యయక్ష * భో
గులు విద్యా । ధరగంధర్వులు నాదిగ । నిరవుగ నేనౌదు నీవు * నేనే
తలఁపన్ ॥ ౫౭ ॥ తే-గీ ॥ నిర్జరేంద్రుఁడు మునులును * నీరధులును ।
బర్వతారణ్యమృగపశు * పక్షితరులు । నండపిండాండబ్రహ్మాండ *
మాదియగుచు । నిఖిలమై యేను వెలుఁగుదు * నీరజాక్షి ॥ ౫౮ ॥ క ॥ నేనే
స్త్రీపురుషులునై । గానఁబడఁగ నన్ను నేను * గవయుట యెట్లో । నేనయి
నర్వకదోఁచిన । యానిఖిలము బొంకు స్వప్న * మం దనుభవమై ॥ ౫౯ ॥
తే-గీ ॥ పడఁతివిను పుష్పముల సౌర * భంబు భాతి । సర్వరూపుల నేనుండ *
సర్వమగుచుఁ । గుసుమమును గాక పరిమళం * బెసఁగునట్లు । సర్వ
మును గాక యింతకే * సాక్షినగుదు ॥ ౬౦ ॥ సీ ॥ నావుడు వసుదేవు *

నకు దేవకికి నీవు - జనియించి పుట్టలే * దనుట యెట్లు। దారసుతాదు
లు * తల్లిదండ్రులు గల్గి - నాకు నెవ్వరు లేర * నంగ నెట్లు। ద్వారకా
పురి కధి * కారినై యొకచోట - నునికి నాకును లేక * యనుట యె
ట్లు। సతులతోఁ గవియుచు * సకలకార్యంబులఁ - జేసి చేయనటంచుఁ *
జెప్పుటెట్టు॥ తే-గీ॥ లయ్యయో మేను ప్రత్యక్ష * మగుచునుండ। నా
కు దేహంబె లేదని * నాఁగ నెట్లు। దెలియనిదినాకు గొప్పసం * దేహ
మెదను। బెనయుచున్నదిదీర్ప వే వనజనాభ॥ ౬౧॥ సీ॥ అనినరుక్మిణిఁ
జూచి * యచ్యుతుఁ డిట్లను - చెలియ నీకదిమున్నె * చెప్పినాఁడఁ।
గనుపించుచున్న యీ * కాయంబు నేఁగాను - దేహనాటకుఁడ వి*
దేహినంచు। వసుదేవుఁడును మాయ * వనిత దేవకిమాయ - వారికేఁ
బుట్టిన * వార్త మాయ। బలరామసాత్యకుల్ * పరికింపఁగా మాయ -
యష్టభార్యలు గోపి * కాళి మాయ॥ తే-గీ॥ యేది పుట్టుచునున్నదో*
యేదిగిట్టు। నదియె పోమాయ నేనెప్పు * డదియుఁగాను। బుట్టుకయు లే
దు నాకును * గిట్టులేదు। పావనంబగు తారక * బ్రహ్మమేను॥ ౬౨॥
క॥ తనువులు గల్గని నాకును। జననీజనకులును సుతులు * సత్తు లెక్కడనో।
గనుఁగొనఁ బరిపూర్ణుఁడ నా। కును నెలవును నెందు గలుగుఁ * గోమలి
చూడన్॥ ౬౩॥ ఆ-వె॥ ఏను బుట్టుటయును * నింపొంద ద్వారకా।
పురమునుంట సతులఁ * బొందుటయును। సకలకార్యములును * స
ల్పుటకలగాని। నిజముగాదొకటియు * నేనెఱుంగ॥ ౬౪॥ ఉ॥ ఏను
దశావతారముల * నెత్తితినంచుఁ దలంచు మానవుల్। గానరు నన్ను
నెంతయును * గల్పితమైన మదీయ మాయనే। గాని వధింప దుష్టులను*
గావఁగ శిష్టుల మాయఁ బుట్టునే। గాని దలంప నాకెపుడుఁ * గల్గదు జన్మ
ముకర్మనాశముల్॥ ౬౫॥ ఆ-వె నిఖిలభూతసమితి * నేరమించుటఁ
జేసి। నాకు రామయనెడు * నామమలరెఁ। గాక దశరథునకుఁ * గ
ల్గువాఁడనె నిరా। కారుఁడగుదు నేను * గలుగు దెపుడు॥ ౬౬॥ క॥
పన్నుగ నా దశరథునకు। మున్నును నేలేక యతని * పుత్రుఁడెకర్తై।
యున్న దశరథుని విశ్వము। గ్రన్ననఁ గల్పించినట్టి * కర్తయొవండో॥
౬౭॥ ఆ-వె॥ పొలఁతి దశరథునకుఁ * బుట్టిన రాముఁడే। కారణంబఁ
టన్నఁ * గల్గుఁదప్పు। గాన నేను సంత * కంటె మున్నె యుండి। గలుగఁ

జేసినాఁడఁ * గా దెజగము॥ ౬౮। క। పరమాత్ముఁడ నాయందున। నరయంగా లేదుదోష * మఖిలంబు మనః। పరికల్పితమగునదియే। పరికింపఁగలేనిమాయ * భామామణిరో॥ ౬౯। క। సకలంబు నేనెయగుచును। సకలంబును గాక సర్వ * సాక్షినగుదు నా,శోకచోటనుం డఁగల్గునె। వికలంబడిసర్వమయుఁడ*వీక్షింపఁగనే॥ ౭౦॥ సీ। అతలమానరికాళ్లు * వితలంబుమీఁగాళ్లు - సుతలంబుమడిమలో*సుందరాంగి। దలఁపఁబిక్కలుతలా * తలముజానులురసా-తలమూరువులు మహా * తలమునరయ। భోకపాతాళభూ * లోకముల్ గుదము నె-క్కానభువర్లోకంబు * గుహ్యపదము।పొసఁగుసువర్లోక * మునునాభియగుమహ - ర్లోకంబు హృదయంబు * లోలనేత్ర। తే-గీ॥ సరిజనర్లోకముగళంబు * సత్యముగను। మఱితపోలోక మెన్న భ్రూ*మధ్యమంబు। సత్యలోకంబుఫాలంబు * సద్విరాట్పు।రుషుఁడ నై నట్టినాకునో * రుక్మగాత్రి। ౭౧॥ సీ॥ నాసాగ్రముననింద్ర * నగరంబు దక్షిణ * నేత్రమందున నగ్ని * హోత్రుపురము। కుడికర్ణముననంత* కునిపట్టణంబును-నెసఁగునాప్రక్కనై *ర్మృతిపురంబుఁ। దెలియవెన్ను వరుణ*దేవునినగరంబు- వరుసదానికిఁబ్రక్క*వాయుపురము। నుత్తర కర్ణంబు*నొప్పును బేరుని * పురివామనేత్రంబు * భోగిపురము। తే-గీ। శిరమునడుమను వైకుంఠ*పురమునుండు।నరయఁగా మేరుగిరినాకు * నగుసుషుమ్న। మందరాద్రియుఁ బింగళ * మదిదలంప। నిడయుఁ గైలాసనగమగు * నిందువదన। ౭౨। సీ। మస్తకాంతర్గతం* బగును జంబూద్వీప-మరయఁబ్లక్షద్వీప * మస్థులందు। మొనయుశాఖద్వీప* మును శిరాగ్రంబున * శాల్మలీద్వీపంబు * చర్మమునను। బుష్కరద్వీపంబు * పోల్పనఖంబుల * మఱికుశద్వీపంబు * మాంసమందుఁ। బొసఁగఁ గ్రౌంచద్వీప * మును కేశములయందు - లవణాంబుధియు మూత్ర*మవుసునిక్షు।నీరధియు ఘర్మసురవార్ధి*నింద్రియంబు।దలఁప ఘృతవార్ధిరుధిరంబు * దధిసముద్ర। మరయశ్లేష్మంబయగును క్షీ* రాబ్ధిసోల్గు। నిర్మలోదకోదధియుఁగ * గన్నీరునాకు। క॥ ధరణియుఁ బాదములగుచును। మఱియంబరతలమునెన్న * మస్తకమగుచున్। గిరులునుశల్యములునదులు। పరికింపఁగనాడులగుచు*భాసిలునాకున్।

౭౪॥ తే-గీ॥ ఇనశశాంకులునాకు న * యనయుగంబు। పవనమును శ్వాసనిశ్వాస * లవుచువెలుఁగు। నాదుగర్భంబులోపల * నఖిలజీవ। పుంజములుపుట్టు లయమొందుఁ * బోలఁతియనిన॥ ౭౫॥ క॥ నీలోన జగములెప్పుడు। నీలాగేయుండఁగలవొ*నెఱిఁగింపుమిఁకే। కాలమున కైనఁజెడునో। యేలాగదియన్న శౌరి * యిట్లనుసతికిన్॥ ౭౬॥ ఆ-వె॥ సుందరాంగినీదు * సూక్ష్మబుద్ధికినాదు। మానసంబుహర్ష * మయ్యె నిపుడు। లాలితముగవినుము * కాలప్రమాణంబుఁ। దెలియపఱతునీ

కాలప్రమాణలక్షణము.

కుఁ * దేఁటపడఁగ॥ ౭౭॥ క॥ చనఁగనహోరాత్రంబులు దినమగు। మర్త్యులకునదియె * దివసలయంబౌ। దినములుముప్పదిమాసం। బనఁబడునదెశుక్లకృష్ణ * పక్షద్వయముల్॥ ౭౮॥ సీ॥ మానవాళికినొక్క * మాసమైననుబితృ - దేవతాళికినొక్క * దినమునగును। వసుధమనుజులకొక్క * వత్సరంబైనను * దివిజులకదియొక్క * దివసమగును। తత్క్రమంబునదేవ * తాహాయనంబులు - వెలయంగఁబదిరెండు * వేలునైనఁ। దనరఁగృతత్రేత * ద్వాపరకలిచతు * ర్యుగములువినుమహా * యుగమనంగ॥ తే-గీ॥ నొప్పునవియునుడెబ్బది * యొక్కలైన। రమణియదియొక్కమన్వంత * రంబునగును। నట్టిమన్వంత్రములుపదు * నాలుగైన। బ్రహ్మకదియొక్కపగలునై * పరఁగుచుండు॥ ౭౯॥ సీ॥ తగనొప్పనది చతు * ర్యుగసహస్రము మేర - నగుదివసావసా * నంబునందు। బ్రహ్మయునిద్రించుఁ * బగటికాలంబెంత - యంతకాలమురాత్రి * యరుగునపుడు। సకలజీవాదులు * సమయునంతటఁబంచ * భూతముల్మాత్రము * పోలియకుండు। నారాత్రిగడచిన*నలువతామేల్కని - జీవకోటులమగుడి*సృష్టిసేయు॥ తే-గీ॥ ధాతకదియొక్కదినమగుఁ * దలఁచిచూడ। నట్టిదినమాసక్రమమున * నరయనూఱు। వత్సరంబులుగడచిన * వనజగర్భుఁ। డంతనాకంబుఁజెందునో * యంబుజాక్షి॥ ౮౦॥ సీ॥ చెలువుగావినుబ్రహ్మ * జీవితకాలంబు - మఱివిష్ణువునకొక్క * మాసమగును। నవిపదిరెండైన* నగువత్సరంబును - నవియుశతంబైన * హరియడంగుఁ। బరికింపనావిష్ణు * ప్రళయంబులోపల - నజులనేకులుపుట్టి *

యడఁగిపోదు । రావిష్ణుజీవిత * మగు కాలమును రుద్రు - నకు నొక్క
దినమగు * నట్టిదివస॥ ఆ-వె॥ మాసవరుసతోడ * మతిశతాబ్దంబు
లు । నిండెనేని శివుఁడు * నీల్గునతని । ప్రళయమునకులోన * బహు
మంది విష్ణులు । పుట్టిగిట్టుదురుగ * పుణ్యచరిత॥ రా౧॥ సీ॥ అరయంగ
రుద్రుని * యాయుష్యమంతయు - నొగి మహేశ్వరునకు * నొక్క
యామ। మట్టిజాము లెనిమి * దైనదినంబొక్క - టగుదినమాసక్ర *
మాదికముల । వత్సరంబులు నూఱు*వరుసగాఁ గడచిన-నమ్మహేశ్వ
రుఁడును*నాశమొందు । నవని ప్రళయములోన*నటు బహురుద్రులు-
వొడమినశింతురు * పుడమియందు॥ తే-గీ॥ నమ్మహేశ్వరుఁడు మనిన*
యంతకాల । గతిసదాశివునకు రెండు * గడియలగును । నదియె
యొక్క ముహూర్తం బ * నంగబరఁగు । నవియు ముప్పదియైనను*
నగు దినంబు॥ రా౨॥ సీ॥ కలయ నాదినమాస * క్రమమున నూఱేండ్లు-
చెల్లిన నాసదా*శివుఁడు గిట్టు । నతని ప్రళయములో * నరయ ననేక
మ - హేశ్వరుల్ పుట్టిల * యింతు రెలమి । నాసదాశివుఁడుండు *
నట్టి కాలంబెల్ల * నొగి విరాట్పురుషున * కొక్కక్షణము । నగు నట్టి
క్షణములు*నరయంగ మున్నూట - యఱువదైన నొక్క*యహము
నగును॥ తే-గీ॥ నట్టిదిన మాసక్రమమున * హాయనములు । నూఱు
గడచిన నవ్విరా*ట్పూరుషుండు । చనును నాతని జీవిత*మునకులోనఁ*
బుట్టి బహుసదాశివులును * గిట్టఁగలరు॥ రా౩॥ చ॥ మెలఁతసమస్త
జీవులను*మృత్యువు పట్టివధించునప్పుడే । జలజహితాదిచంద్రులును*
సంక్షయమౌదురు మాయశక్తిచేఁ । బొలుపుగ గోత్రబీజములు*భూజ
లతాదిసమస్తరూపముల్ । ప్రళయదవాగ్నిఁబుట్టి యటు * భస్మముఁ
జేయునొకింత మాత్రలోఁ॥ రా౪॥ తే-గీ॥ సప్తవాయువులొక పెట్టఁ*
జవిరివిసరు। సప్తభువనకంబు నోలి ది*వ్యాబ్దశతము। ఘోరవర్షంబు జడి
పట్టి * కురియునవల । వారిధులు నేడు నేకార్ణ * వంబయగును॥రా౫॥
వ॥ అట్టియెడ. సీ॥ అమ్మహావారాశి * యడఁగుఁబృథ్వియధిక - జల
ములస్వల్ప లో * ష్టంబుఁ గిది । నమ్మహోదకమును * నగ్ని పానము
సేయుఁ - దప్తలోహమునీరు * ద్రావుభంగి । నమ్మహావహ్నిని*నని
లంబు దెగటార్చు- గాలిదీపంబార్చు* కరణిగాను । నమ్మహావాయువు*

నాకాశమునగ్రమ్గు - నాసుషుప్తినిజీవు*లడఁగునట్టు॥ తే.గీ॥ లమ్మహా
నింగినమ్మాయ * యందుడిందు । నమ్మహామాయనాయందు * నడఁగు
నపుడు । బట్టబయలగు నాస్వరూ * పంబునిలిచి । యుండు నెయ్యెడఁ
బరికింప * నొండు లేక॥ ౧౬॥ ఆ-వె॥ అఖిలమూర్తివర్గ * మడఁగిన
నేనుందు । నిర్మలుండునగుచు * నేనునిట్టి । ప్రళయకల్పములను*
బహుళంబులైనను । నేను జెడను భామినీలలామ॥ ౧౭॥ క॥ మాయే
జగములు యుగములు। మాయేకల్పములుప్రళయ*మాటలు నెల్లన్ ।
మాయాతీతుఁడ నేనే। మాయల నెఱుఁగకయ యుందు * మదగజ
గమనా॥ ౧౮॥ క॥ పాయకమృత్తిక కుంభము । గా నొనరుచు మంటి
యందుఁ గలియనియట్లే । నాయందుమాయపుట్టియు । నాయందునఁ
గలియకుండు * నంబుజవదనా॥ ౧౯॥ ఆ-వె॥ మఱలవిశ్వసృష్టి*మఱి
యెట్టులగునన్న। నిద్రనుండి మేల్కొ * నేగుదెంచు । కోలఁదినే నెఱుంగ*
కుండంగనాయందె । గలిగిమాయజగము * గలుగఁజేయు॥ ౨౦॥ ఉ॥
స్థావరజంగమప్రకర*సంభవనాశములందు నుందు నేఁ। గావునమూఢు
లెవ్వరును* గానఁగఁజాలరు మత్స్వరూపమున్ । బావనమూర్తులున్
విమల * భావవిచారులు జన్మభారముల్ । ద్రోవఁగలేకనన్గని ము*
ముక్షుపదంబునుగందు రెంతయున్ ॥ ౨౧॥ క॥ నేనీ దేహేంద్రియములు ।
గాననిసుజ్ఞానమునను*గాంచెద రార్యుల్ । మానిని దేహేంద్రియము
లె। నేననిజ్ఞానంబులేమి*నెంతురుమూఢుల్ ॥ ౨౨॥ సీ॥ నీరుచలించిన*
నీటిలోఁ బ్రతిబింబ - మైననింగియుఁగదలు * మాడ్కిఁదోఁచుఁ । బరఁ
గనదినినోడ*పరుగిడనదిపొంతఁ - జెట్లుగదలుచున్న*యట్లుదోఁచుఁ ।
బరువడిమేఘంబు*పరువెత్తనభమునఁ - జంద్రుండుపరువెత్తు*చాడ్పు
దోఁచు । నట్లుపుట్టుటపెర్గు * టఖిలకార్యంబులు - నాచరించుట
మఱి * నాశమాట॥ తే.గీ॥ లాదికల్పనలెల్ల దే * హంబునొంద ।
నాత్మయేసర్వమునుబొందు*నట్లుదోఁచుఁ। గానిపరికించిచూడంగఁ *
గానఁబడదు । రమణియాత్మకు నేవికా * రంబు నెపుడు॥ ౨౩॥ ఆ-వె॥
చూపుచెదరినపుడు*చూడవస్తువొకటె । రెండుగాఁగఁదోఁచు చుం
డునట్లు। మానసంబుచలన*మైనవానికిలేని । కల్పనమ్మునిజము*గాను
దోఁచు॥ ౨౪॥ సీ॥ అల్లిబిల్లిగఁదర్గు*నట్టివానికిసిండ్లు-దిశలుభూమియుఁ

జెట్లు*దిరిగినట్లు । గనుపించునటు*ిరు*గనివారికెద్దియుఁ - దిరుగకున్న
ట్లుగాఁ* దెలియుభంగి। నజ్ఞానిచంచలం*బగుమానసముగల - వాఁడు
గావునభ్రాంతి * వలనఁదనకు । సంభవవృద్ధినా*శంబులుసకలంబు -
సత్యమైతోఁచుట* సహజగుణము। తే-గీ। జ్ఞానిసుస్థిరచిత్తుండు*గాస
నతఁడు । నెప్పుడు పరమాత్మతత్వమే * నిశ్చయముగ । నెంచిభ్రమ
రూపమైగాను*పించుమాయ । కల్లగానెంచితన్నుఁదాఁ*గాంచుచుం
డు॥౯౫। క॥ కరిరూపంబునదారువు । గురుతరముగఁదోఁచుచున్నఁ*
గుంజరమగునే। పరమాత్ముఁడిలగఁదోచినఁ। బరమాత్ముఁడెగాకనీ ప్ర*
పంచంబగునే। ౯౬। తే-గీ॥ గజమునుచుఁజూడదారువు * గానఁబడ
దు । దారువనిచూడఁదోఁచదు * దంతియట్లు । జగమునుచుఁజూడఁ
దోఁచదు * సర్వసాక్షి । సాక్షియనిచూడఁగల్పిత * జగములేదు।
క। వరసతివేషముఁదాల్చిన । పురుషుఁడు పురుషుండెగాని * పొలఁ
తుకయగునే। మఱిజీవరూపుఁదాల్చిన । పరమాత్ముఁడుజీవుఁడగునె *
పరికింపంగ౯॥ ౯౮। తే-గీ॥ మాయయీదేహమనియెంచి * మాయ
గాని। యాత్మయేతానుబరమాత్ముఁ* డంచుఁగాంచు। నతఁడుముగ్గు
రుమూర్తుల * కాదిరైన । దేవుఁడనిలోకమునఁబ్రస్తు * తింపఁబడు
ను॥ ౯౯। క। కల్లనిజమందునిజమును । గల్లందునఁగలిగియుండుఁ *
గావుననిజము౯ । గల్లందువెదకియాత్మను । నుల్లంబునఁగూర్చికల్ల*
యుడుపఁగవలయు౯। ౧౦౦। ఆ-వె। కానసీకునేను * గఱపినయట్లు
గాఁ। గాంచవలయునట్లు * గాకయున్న । ఘనతమిాఱనిన్నుఁ*గడతే
ర్చుటకునింక । నెవరితరముగాదు*నిక్కమబల। ౧౦౧। క॥ నీవేయా
పరమాత్మవు । జీవుఁడనేనంచుభ్రాంతిఁ * జెందకుమిఁకనా । జీవగు
ణంబులుమాయయె । నీవెన్నఁడుమాయగావు * నిక్కంబదియు౯।
౧౦౨। ఆ-వె। మాయనీవుగావు * మానసేంద్రియములు। గావునీవు
నెఱుక * గావుమఱుపు । నెఱుకమఱపులేక * యేవేళవెలుఁగొందు।
సర్వసాక్షినీవు * సారసాక్షి॥ ౧౦౩। తే-గీ॥ కాయజీవంబులేనంచుఁ *
గలనునైనఁ । దలఁచఁబోకుముపరమాత్మ*తత్వమీావు । స్త్రీనపుంసక
పురుషాది * స్థితులుగావు। రూపనామంబులునులేవు * రూఢినీకు।
౧౦౪॥ క। ఇంద్రియములెనేనన నా । యింద్రియములటంచునీవు *

నెన్నుటనీకు। న్నింద్రియనువేఱగుటను। నింద్రియములునీవుగావు * హేమలతాంగీ॥ ౧౦౫॥ క॥ మనమే నేననినను నా। మనమని నీవనుట వలన * మానినిమనమా। యనిలపుభాగంబగుటను। మనమరయఁగ నీవుగావు * మంజులవాణీ॥ ౧౦౬॥ ఆ-వె॥ బుద్ధినేననంగ * బొలుపొంద నీవునా। బుద్ధియనుటకతన * బుద్ధియగ్ని। భాగమగుటవలన * భావించిచూడంగ। బుద్ధినీవుగావు * పువ్వుఁబోణి॥ ౧౦౭॥ ఆ-వె॥ చిత్తమే నటంచుఁ * జెప్పిననీవు నా చిత్తమనుటవలనఁ * జిత్తముదక। భాగమగుటఁజేసి * పరికింపఁజిత్తంబు। నీవుగావుభామి * నీలలామ॥ ౧౦౮॥ క॥ అహమేనేనన్నను నా। యహమనినీవనుటవలన * నవనిగతంబై। యహమలరుచుండుఁగావున। నహమెన్నడుగావునీవు * హంసవిహారీ॥ ౧౦౯॥ ఆ-వె॥ నిఖిలమెఱుఁగు తెలివి * నేననినను నీవు। నాదు తెల్వియంచు * ననుటవలనఁ। దెలివినీవుగావు * దెలియంగ సర్వంబుఁ। దెలియుతెల్విఁగాంచు * తెలివిపీవు॥ ౧౧౦॥ క॥ దేహేంద్రియములు నేనని। మోహముఁజెందంగఁబోకు * మున్నుగనీలో। దేహిని గనుఁగొను మెప్పుడు। సోహంబనిపల్కునజప * సూత్రమె నీవుఁగా॥ ౧౧౧॥ ఉ॥ నారమణీయగేహమది * నాధనమంచువచించువానికిఁ। వేఱగుచుండునట్టిగృహ * విత్తములట్లుగనాశరీరము। న్నారయనాదునింద్రియము * లంచువచించెడునీవునింతకుఁ। వేఱగుచుండుగాకమఱి * వీనిలొనెద్దియుగావు చూడఁగఁ॥ సీ॥ కొందఱు పామరుల్ * గురుముఖంబుననిట్టి - పరమహంసమహిమ * నరయలేక। యదిప్రాణవాయువ * యందురు పరమాత్మ - వర్ణింపఁగాఁ బ్రాణ * వాయువగునె। పరగగుదమున న * పానసమీరంబు। నాభియందునసమా * నానిలంబు। దలపఁగంఠమున ను * దానవాయువుసర్వ - మేనునవ్యానస * మీరమెన్న। వరుసహృదయంబునను బ్రాణ * వాయువుండుఁ। బవలు రాత్రియుయంత్రంబు * పగిదినీరు। గుండెలోఁడక్కుటక్కునఁ గొట్టుకొనుచు। నదియెబ్రహ్మంబునానెట్టు * లనఁగవచ్చు॥ ౧౧౩॥ సీ॥ సరవినన్నమయకో * శంబెయాత్మయటంచు - నందురుకొందఱీ * యవనిలోన। సరగఁబ్రాణమయకో * శంబెయాత్మయటంచు - నందురుకొందఱీ * యవనిలోన। మానితంబుగ

మనో * మయకోశమాత్మయం - చందురుకొంవటీ * యవనిలోన । మగువరో విజ్ఞాన * మయకోశమాత్మయం - చందురుకొంపటీ*యవ నిలోన।మఱియునానందమయకోశ*మాత్మయంచుఁ। గొందఱనియెద రీపంచ * కోశములకుఁ। దలఁపఁద్రిగుణంబులగునవ * స్థాత్రయంబు। నకువిలక్షణుఁడగునాత్మ*నరయలేక॥ ౧౧౪॥ చ॥ కలయఁగనెల్లవారు తమ * కైవడిమోక్షముఁజెందునట్లుగాఁ। దలఁపునవెంచియార్యులిల* దైవరహస్యముసాటిచెప్పినన్। దెలియఁగలేరుమాయలను * దేలిమ నుంగుచునుందురెప్పుడున్। జలరుహనేత్రలోకమున*సత్యముఁజెప్పిన నమ్మరెవ్వరున్॥ ౧౧౫॥ ఆ-వె॥ మాయమార్గములను * మనసుంతు రందఱు। నిజమునందు మనసు * నిల్పలేరు । చర్మఖండమెసవు * సారమేయంబును। నిక్షుకోలరుచిని * నెఱుఁగనట్లు॥ ౧౧౬॥ క॥ ఆల పొదుగులనుబిడుదులు। పాలరుగ్రోలకయరక్త * పానమొనర్పున్ । ఆలీలజనులుమోక్షము। కీలెఱుఁగకనేతురెల్ల* క్రియలనుమాయన్ ॥ ౧౧౭॥ తే-గీ॥ అమలవాక్యంబులనులక్ష్య * మమరియుందు । ఛిద్ర వాక్యంబులనుగుఱి * చెదరుగాన । జనులుసద్బోధలనువిన * జనును గాని। చెనఁటిబోధలనెప్పుడు * వినఁగరాఁదు॥ ౧౧౮॥ చ॥ అరయ సమస్తభూతమయుఁడైనపరాత్పరునందుఁదృప్తుఁడౌ । పరమపవిత్రుఁ డన్యమగు * పామరమార్గములందుఁజొచ్చునే। పారిఁబొరికల్పభూజ నిజఃపుష్పమరందమునానిగ్రోలుచున్ । బరువడితృప్తినొందుమధు * పంబులువోవునెవేపచెట్లకున్॥ ౧౧౯॥ క॥ వనధిదరిఁజేరఁజనునెడఁ। బెనుగాలియువిసరినావ*పెడకీడ్చుగతిన్। మునుముక్తిపుణ్యహీనులు। గనఁబోయినఁదొలఁగనీడ్చుఁ * గర్మచయంబున్॥ ౧౨౦॥ ఆ-వె॥ పర ముగనుచుఁజిత్త * పరిపక్వమునుగాక। నరుఁడెవండవైన*నంతలోనె। చచ్చునేనినుగుడిజన్మంబునందైన। బుధులఁజేరిముక్తిఁ * బొందఁగల డు॥ ౧౨౧॥ క॥ పరతత్వచింతలేకయ। చరియించెడుమూఢుఁడెన్ని * జన్మలకైనన్ । దరిఁజేరలేఁడుగావునఁ। బరమార్థమెమాన్పుమందు* భవరోగంబుల్॥ ౧౨౨॥ సీ॥ నిన్నునీవెఱుఁగక * నింతకునిలమాయ- నెన్నెన్నొజన్మంబు * లెత్తుచుంటి। విపుడునాకృపచేత * నెఱిఁగితి నినునీవు-నీనిజరూపమై*నెగడుకతన। నేసుఖదుఃఖంబు * లెఱుఁగవు

పుణ్యంబు-నెఱుఁగవు పాపంబు*నెఱుఁగవీవు । నెపుడుజాగ్రత్స్వప్న*నిద్రలెఱుంగవు-రేయిఁబవలునునొక్క*రీతియగుచు। బంధమోక్షంబులును లేక*పరఁగునీకు।బంధమున్నట్లుదోఁచియు *భ్రాంతిచేత। ముక్తిఁగోరియు నినునీవు *మూలమెఱుఁగ । బంధమోక్షంబులెల్లన*బద్ధమయ్యె॥ ౧౨౩॥ ఆ-వె॥ పుడమిలోన నేను *బుట్టితిఁ బెరిగితిఁ । జత్తునంచు మదిని *శంకపడుచు । నేనునాదినీవు నీదినీవారునా । వారలంచు భ్రమయ *వాఁడెపుట్టు॥ ౧౨౪॥ క॥ సుమతిమనోజవికారము । లమరంగానీకుఁగల్గ *వాత్మవగుటచేఁ । గమలారిక్షీణవృద్ధులు। కమలాప్తునకెన్నఁడేనిఁ *గల్గునెతలఁపఁగ॥ ౧౨౫॥ క॥ తరణికిఁదిమిరంబెన్నఁడుఁ । బొరయనిగతిమాయలేమి *పొందవునిన్నుఁ గ । బరమాత్మవగుటచేతను । బరికింపఁగ లేవునీకు *బంధవిముక్తుల్॥ ౧౨౬॥ క॥ దరికొనిమండెడునగ్నునఁ । బరువడినిలువంగఁగలవె *పక్షిమృగతతుల్ । పరమాత్మవైననిన్నును । బొరయంగా లేవుపాప*పుణ్యములెపుడున్॥ క॥ అలమాన సేంద్రియంబులు । చలియించుచునుండుగాన *సాఁరెకు నేనే। చలియించితినని దలఁచకు । చలనంబును లేదు సర్వ *సాక్షివినీవున్॥ ౧౨౭॥ తే-గీ॥ ఇంద్రియములెల్ల నచలమై *యొప్పఁగు వేళ । నచలమైతిని నేనంచు *నరయఁబోకు । చలనమచలమాదింద్రియ*చర్యలెల్లఁ । దగుల నేరవు నిర్గుణ *తత్వమీవు॥ ౧౨౮॥ క॥ నిలుకడగల్గిననీకును।జలనపునెమ్మనమునకును*సంగము లేద। ట్టులఁగాన శంకనుడుగుము। । యలరఁగనిస్సంగివీవ *యఖిలమునందున్॥ ఆ-వె॥ అనినదేనివలన *నఖిలప్రపంచంబు। దోఁచు నేది లేక *దోఁచకుండు । నిశ్చయముగదీని*నెఱిఁగింపుమన్న నా। మగువకిట్టులనియె*

మిథ్యాజగల్లక్షణము.

మాధవుండు॥ ౧౩౧॥ సీ॥ వనితజాగరమెంత *వఱకుండునంతకుఁ-గలయసమస్తంబు *గల్గితోఁచు ! నమ్మనంబు నవిద్య *యందడంగిన వేళఁ-బరఁగనెద్దియుఁదోఁచఁ*బడకయుండు। తూర్పునభానుండు*తోఁచినతోడ నే-కిరణంబులును దోఁచు*నరసిచూడ। నతఁడస్తమించిన*నాతనికిరణంబు-లతనితోడనెపోవు *నట్లుగాన। నినునివేయంచుఁగిరణంబు *లెంచినట్లు। మనముగలిగినఁగలుగును *మాయలెల్ల। మన

ము లేకున్న నీక నేమి * మాయ లేదు । గాన సర్వంబు మానసీ * కంబె జగము॥ ౧౩౨॥ క॥ నెఱిమానసీక విశ్వము । స్థిరమని పఱవులును బాలు * చెనఁటినరుండుఁ । వరుసమరీచిక జలమని । పరువిడియిలఁ గూలుమృగము * పగిదినశించుఁ॥ ౧౩౩॥ ఆ-వె॥ అనినమనముగల్గి* యమనస్కమోగాక । మనము లేకయగునొ * మర్మమిదియు । నానతి మ్మఁటన్న * నప్పద్మనాభుఁ డా । యిందువదనఁజూచి * యిట్టులనియె॥ ౧౩౪॥ క॥ ఓవనితామణి మధురము । నీవచనము లెల్లఁబాదు * నేర్పునకరయఁ । నీవెట్లు నేర్చియుంటివొ । నీవిధమున నడుగనెవరు* నేర్తురుసఖియా॥ ౧౩౫॥ సీ॥ పొందుగానుసమాధి * యందున మదిఁ జేర్చు - టమనస్కమనికొంద * రందురిలను । సతితత్సమాధినిఁ * జాలించఁగానెయా * మానసేంద్రియములు-మరలఁగల్గుఁ । గాననది యమన * స్కముగాదుభావింప-నాసుషుప్తివిధంబు * నలరుచుండు। నిద్రఁజెందినవేళ * నిఖిలంబు లేకుండు - నిద్ర మేల్కన్నను * నిఖిల ముండు । నట్లుగావుననిద్రయు * నాసమాధి । మూర్ఛలీమూడునొక్కటె * మూఁటినుండి । దెలసియామదిసర్వంబుఁ * దెలియుఁగాన । నాసమాధిని నమనస్క * మనఁగరాదు॥ ౧౩౬॥ క॥ కొందఱుజీవము తోడనె । బొందితొభువిచాటునకును * బోదురదియెసూ । పొందుగజీవసమాధిగ । నందురదియుఁగాదలైన * నమనస్కంబుఁ॥౧౩౭॥ సీ॥ పడతిరో యమనస్క * పద్ధతిఁదెలియంగ - నెఱిఁగింతువినుమింక* నేర్పుతోడ । స్థాణుతస్కరుఁడంచుఁ * దాభ్రమసిపిదపఁ - దెలిసి కొయ్యనిశంక * దీఱినట్లు । పరమాత్మ యందున * భ్రాంతిచేజీవుని - నారోపితముఁజేసి * నరుఁడుగురుని । కరుణచేదారువు * పురుషుండు గానట్లు । పరమాత్మజీవుఁడఁ * భ్రాంతిఁదొలఁగి । యలరుమానస దేహేంద్రి * యంబులెల్ల । లేనివెప్పుడు నాయందు * లేదుమాయ। నిర్వికారుండఁబరమాత్మ * నేనటంచు । భ్రాంతివీడినసమనస్క*భావమమరు॥ ౧౩౮॥ క॥ మనమేనీవును నేనును।మనమే కార్యంబు లెల్ల* మనమేజగముల్ । మనమేమాయలుసర్వము । మనమును లేకున్న లేదు * మఱియొక్కటియుఁ॥ ౧౩౯॥ ఆ-వె॥ బంధ మోక్షములకు* భ్రాంతులకెల్లను । గారణంబుమనము * గానసదియె । బంధమునను

జుట్టు * పడియుండఁగాజాలు । సులభముగనుముక్తి * దెలియఁజాలు॥ ౧౪౦॥ క॥ మనమింద్రజాలుఁడనఁదగు । మనమేగల్పించుమాయ* మనమేగాంచున్ । మనమేభ్రమయుచునుండును । మనమేగనుపించకెందు * మటుమాయమగున్॥ ౧౪౧॥ ఆ-వె॥ మనమునెప్పుడులేని * మాయయటంచును । దానుదానెయగుచుఁ * దలఁపుతోడ। నఖిలమెఱుఁగుచున్న * నతఁడమనస్కుఁడు । గానిమనములేక । గాదుచూవె॥ ౧౪౨॥ క॥ సర్వముఁజూచుచువిడువక । సర్వంబగుకార్యములను * సల్పుచునున్నన్ । సర్వముఁగనిచేయనిగతిఁ । బర్వినమనస్కమనఁగఁ * బడునదికాంతా॥ ౧౪౩॥ ఆ-వె॥ వెలఁదివినుమయొక్క * వృత్తాంతమునునిప్పు।డందువలనసంశ*యములువాయు। దీనిచేతనాత్మ * తృప్తియౌనమనస్క । భావమెల్లఁదెలియఁ*బడును నీకు॥ ౧౪౪॥ భారతయుద్ధాదినిరథ । సారథినేనైతిసవ్య * సాచికినపుడున్ । ఘోరమగుశంకగల్గియుఁ। బోరికినొప్పకయయతని * బుద్ధిచలింపన్॥ ౧౪౫॥ ఆ-వె॥ అపుడునేనుదెలిసి * యర్జునాయిదియేమి। యీవునిజమునింత * యెఱుఁగలేక । భ్రాంతిఁజెందియిట్లు * పామరుకైవడిఁ । దగవిషాదమొందఁ * దగునెనీకు॥ ౧౪౬॥ ఉ॥ నేనెసమస్తజీవులును*నీవునునీయిరువైపుసైన్యముల్ । నేనగుచుండభండనము* నేనునొనర్పఁగనంటివిప్పుడున్ । నేనలయింపఁజేయకయె * నీకునువీరలఁజంపశక్యమే । నేనెహరింతుసైన్యములు * నీవునునింతకుఁగారణంబిలన్॥ ౧౪౭॥ తే-గీ॥ జీవలోకంబులెల్లను * సృష్టిసేయఁ । బోషణమునేయసర్వంబుఁ * బొలియఁజేయ । నేనయైయుండికారణం* బితరముగను । గలుగఁజేతునాదుమహిమఁ * దెలియవశమె॥ ౧౪౮॥ క॥ పరమాత్ముఁడనగునన్నిఁక । నెఱిఁగినసర్వంబునందు * నేనేగాకన్ । బరికింపనితరమున్నదె । పరువడిననుఁగాంచినీదు * భ్రాంతివిడుమిఁకన్॥ ౧౪౯॥ తే-గీ॥ నన్నుసేవించిముక్తులౌ * నార్యులెల్ల । భ్రమసినీవలెనీరీతి* భ్రాంతిపడరు । నిఖిలరూపులునేనంచు*నెంచికర్త । కర్మక్రియలనుజిక్కరే * కాలమునను॥ ౧౫౦॥ క॥ నేనేచేసెదననుచును।మానసముననెంచుటెల్ల * మఱియదియహమే । గాని యిఁక నేమిసేయుదు। వేనునునీలోనలేక * యింద్రతనూజా॥ ౧౫౧॥ ఆ-వె॥ అనయలేక

నన్ను * నజ్ఞానులెల్లను। నహముతోడఁగర్మ * లాచరించి। గాదె
నరకస్వర్గ*కష్టసుఖంబులు। ననుభవించుటెల్ల * నవనిఁబుట్టి। ౧౪౨।
క। ఉన్నదినేనేయెందున। నన్నెఱిఁగిన నింకనేది * నాకన్యముగ।
న్నన్నియునేనేగావున। నన్నెఱిఁగినవారికెందు * నహముగ్ గలదే!
౧౪౩॥ ఆ-వె। తలఁపఁబడియునెనిమి * దక్షౌహిణీలగు। సంఖ్యనొప్పు
రెండు * సైన్యములను। నేను లేకయున్న*నెవ్వఁడాడించును। నాట
కుండ నేను * నఖిలమునకు। ౧౪౪॥ క। నేనును లేనిశరీరము। మూఁక
నీసేనలందు * మఱియున్నయెడన్। గానంగఁజేయుమిప్పుడ। యేను
నులేకున్న దేదొ * యీయిలయందున్। ఆ-వె। దేహికత్తులకును*
దెగఁడుపాశంబులఁ। గట్టువడఁడువహ్నిఁ * గాలిపోఁడు। రాళ్లఁబగు
లఁడెందు * నీళ్లచేతఁదడియఁ। డట్టివానిఁజంప * నలవెనీకు। ౧౪౫।
క। ఇలశిథిలంబగుచేలం। బులు వదలియుఁగ్రొత్తవస్త్ర*ములుదాల్చి
న య। ట్టులదేహిచెడినదేహం। బులు విడినూతనశరీర * ములను
వహించున్॥ ౧౪౭। ఆ-వె। మఱియుఁగాలసమయ*మైనజీవులకునేఁ।
గారణమునసమయఁ * గలుగునట్టి। కారణంబుచేతఁ*గతమగునంతి
యే। గాకనీవుసేయు * కార్యమెద్ది। ౧౪౮। క॥ దేహియుఁజచ్చు
నటంచును। మోహంబునుజెందువాఁడె * మూఢుండవనిన్। దేహం
బులెల్లఁదెగినను। దేహినినగునేనుజెడను * దేననునైనన్॥ ౧౪౯।
ఆ-వె। సర్వరూపములును * సమసిననేనుందు। నాకుఁగల్గదెపుడు *
నాశమరయ। ఘటజలంబులందు * గగనంబుగనుపించి। ఘటమువగుల
నిల్చు*గగనమట్లు। ౧౫౦। ఉ। పుట్టుటవృద్ధినాశములు * పొందుట
డిందుటమేనికైనచోఁ। బుట్టునుగిట్టుదేహికని * పోల్తురులోకము
నందుమానవుల్। పుట్టినవేళమోదమును * బొందుచుఁజచ్చినవేళనే
డ్తురా। పుట్టునుగిట్టునేకమని * బుద్ధిఁదలంచనికారణంబునన్॥౧౫౧।
ఆ-వె॥ పుట్టిపెరిగిమఱలఁ * బోవునదెల్లను। మాయయంచునీదు *
మదినెఱింగి। నిక్కమైననన్ను * నెఱుఁగనీవును లేవు। రూఢినేనె
యొక్క * రుండనైతి। ఉ। చచ్చుటెనిత్యమంచుమఱి * జన్మమనిత్య
మటంచుఁగానకే। చచ్చినవారిఁజూచియిఁకఁ * జావఁగఁబోయెడివార
లందఱున్। జచ్చుటలేనిపోలికలు * జావునకేడ్తురుచావకుందురే।

యచ్చుగవీరలంచఱును * నంచుఁబకాపకనవ్వుఁగాలుఁదుర్॥ ౧౬౩॥
తే-గీ॥ గరిమసంయోగతద్వియో * గములఁగూర్చి। పండితులు మోద
ఖేదముల్ * పడయరెపుడు। వానికైయవెవచ్చును * వానికవియె।
పోవుసర్వంబుదీసికై * పొగలనేల॥ ౧౬౪॥ క॥ ఆయువుమూడినవా
రలె। నీయెదుర్ నిలిచిపోరి* నీల్గుదురరయ। న్నాయువుగల్గినవారల।
నీయధికారమునఁజంప * నేర్తువెవిజయా॥ ౧౬౫॥ ఆ-వె॥ కర్మవశ
ముచేతఁ * గల్గునుదనువులు। కర్మవశముజేతఁ * గల్గువృద్ధి। కర్మ
వశతగిట్టు * గాకజీవులఁజంప। నగునెనోరులుకార * ణంబులేక॥
౧౬౬॥ క॥ వినుపార్థుఁడియధర్మమె। యనిసేయుటరాజధర్మ* మగు
నట్లునుగా। కననీవుముక్కుఃట్టుక। వనమునఁగూర్చుండుమునివె*వల
దనఁబోర్॥ ౧౬౭॥ ఆ-వె॥ యుద్ధమిపుడునీవు * నొనరింపకున్నను॥
మొనసియిపుడుకాల * మునసశించు। జనములెల్లనిపుడు * చావక
మానరు। గనుముపేరునీది * గాఁగఁబరఁగు॥ ౧౬౮॥ క॥ తనుఁదాఁ
గనియేఁజేసెద। ననునహముఁ విడిచిజగము * నంతయునంతం।
బొనరించినఁదద్దోషము। నను జిక్కండాత్మవేత్త * యహముగలు
గమిఁ॥ ౧౬౯॥ ఆ-వె॥ అహముపిడకయట్టు*లజ్ఞానిచేసిన। నతఁడునఘ
ముఁనొందు * నదియునెట్టు। లనినదివ్వెలేని * యతఁడునంధంబునఁ।
బడునుగల్గువాఁడు * వాయుఁదమము॥ ౧౭౦॥ క॥ అజ్ఞానముఁబో
నడఁచియు। సుజ్ఞానముచేతనీవు * సుస్థిరతననిఁ। బ్రజ్ఞాన్వితముగఁ
జేయుము। సుజ్ఞానులుమెచ్చలెమ్మ*శూరతనిపుడుఁ॥ ౧౭౧॥ ఆ-వె॥
అనుచునరునకేను * నమనస్కభావంబు। నిచ్చిబవరమునకుఁ *
జొచ్చునట్లు। చేసినాఁడనాత్మ * సేవితునకుఁబాప। పుణ్యవితతు
లెట్లు * పొందనేర్చు॥ ౧౭౨॥ క॥ అమనస్కయోగమనఁగను।
సమయించుటగాదుమనము * సంగతవృత్తుల్। క్రమమొప్పలేని
వనుచును। నమరంగాఁగాంచునదియె * యమనస్కమగుఁ॥ ౧౭౩॥
ఆ-వె॥ ఎట్టివేళనైన * నేదేశమునసైన। నేమిసేయుచున్న *
నెట్టులున్న। నేనుజేయువాఁడఁ * గా నను నమనస్క। భావమూన
వలయు * బ్రహ్మవేత్త। ౧౭౪॥ ఉ॥ నావుడుఁ బంకజాక్షి యమ *
నస్కప్రభావము నింతయొప్పనే। నావినుతించితాను నమ * నస్క

యున్నై యిటుఁబల్కె దేవనా । భావమునందుసందియముఁ* బాపుము తత్వవిదుండుమాయయే । త్రోవను నంటకెప్పుడును * లోకుల యట్లు నటించునాతఁడుర్ ॥ ౧౭౫ ॥ ఆ-వె॥ అనిన వాసుదేవుఁ * డాయింతిఁగౌఁగిలిఁ । జేర్చి ప్రేమపొదలఁ * జెక్కునొక్కి । ముద్దుపెట్టి తనదు * ముద్దియతోడను । ననియెనిట్టులనుచు * హర్షమొప్ప । ౧౭౬ । క॥ నీపుణ్యఫలమదెట్టిదో । నీపుణ్యసుభాషణములు * నీ సుగుణములు । న్నీపుణ్యులయెడఁగానము । శ్రీపుణ్యాచరిత్రవినుము* శ్రేష్ఠవిధంబుర్ ॥ ౧౭౭ ॥ ఆ-వె॥ ఊరనుండనేల * యుత్తమవేత్తకుఁ । గుడుచ కేలధనముఁ * గూర్చుకేల । సతులుసుతులునేల * సంసార మదియేల । యనుచుఁగొందఱందు * రజ్ఞులగుచు ॥ ౧౭౮ ॥ ఉ॥ కోటి ధనంబుగూర్చినను * కూటికిలేకదరిద్రుఁడైనచో । మేటిసుఖంబు లొందినను * మేనికిరుగ్మతలెన్నివచ్చినర్ । బోటియుబిడ్డలుండినను * భోగముగోరకయొంటనుండినర్ । వీటనుగాననంబునను * వేత్తకును న్నసమంబె మోక్షముర్ ॥ ౧౭౯ ॥ ఉ॥ అన్నములారగించినను*నంబర భూషల నాదిదాల్చినర్ । గన్నియతోడఁగూడినను * గన్నతనూ జులముద్దుసేసినర్ । జెన్నుగబంధులాప్తులను * జేరినటించిన బ్రహ్మవే త్తలు । న్నెన్నడుమాయఁజెందరిఁక * నేమియునూనములేదుముక్తికిర్ ॥ ౧౮౦ ॥ ఆ-వె॥ నీటియందెయుండి * నీరజపత్రంబు * నంటియుండి జలము * నంటనట్టు । లాత్మవేత్తలకును * నఖిలసంసారంబు । దగిలి యుండిమాయ*దగులదెపుడు ॥ ౧౮౧ ॥ ఉ॥ గారడివాఁడుసర్వమును* గల్లగనెంచుచుఁజేయువిద్యలర్ । గారడివిద్యమాయయని* గందురు లోకులుతద్విధంబునర్ । దారక తత్వమాత్మఁగను * ధన్యుఁడురిత్తని సర్వకార్యముల్ । నేరుపుతోడఁజేసినను* నెల్లనుజూచినమాయఁజెం దునే ॥ ౧౮౨ ॥ తే.గీ॥ సర్వపనులింటసల్పుచు * జారకాంత । ప్రియు నిపొందునకుమమతఁ * బెనయునట్టు । లన్నివ్యవహారములుఁజేసి * యాత్మమీఁదఁ । దలఁపుమలువక ప్రచరించుఁ * దత్వవేత్త ॥ ౧౮౩ ॥ క॥ బురదనునంటకకుమ్మర । పురువునుజరియించుచుండు* పోలికనరయర్ । ధరవిజ్ఞానమయుండగు । పురుషుండిలమాయఁబొంది * పొందండెపు డుర్ ॥ ౧౮౪ ॥ ఆ-వె॥ గానసటనతాళ * గతులతోద్బొమ్మరి । నెత్తి

ఘటముద్రొంతి * నిల్చినట్లు । సకలకార్యములును * సల్పుచుంబర
మాత్మ । గుర్తుపీఠం డాత్మ * కోవిదుండు॥ ౧౮౯॥ చ॥ పరువడినాల
మధ్యమునం బాలఘటంబును బెట్టిదానినే । మఱకనుగోవులంబిదుకు *
మానవుకైవడి నాత్మవేత్తయుం । పరగుచుదన్నుఁదాఁగనుచు సర్వ
ముదబ్బరగాఁగఁజూచుచుం । గెగలుచుఁజేయుచుండుగృహకృత్య
ములెల్లనునింపుమీఱఁగ॥ ౧౯౦॥ ఆ-వె॥ ధనమునొక్కచోట *
దాఁచితానెందున్న । దానిమీఁదజ్ఞప్తి * దగులుగతి । నేమిసేయు
చున్న * నెందున్నఁబరమాత్మ । మఱువకుండువేత్త * మానసమున॥
౧౯౧॥ క॥ వరునిచ్చకముగఁజూచుచుఁ । బరపురుషునిపొందుఁజే
యు * భామినివోలెం । మఱితనువునిచ్చకముగాఁ । బరికింపుచుబ్రహ్మ
వేత్త * పరమునుగాంచుం॥ ౧౯౨॥ తే-గీ॥ రవియుఁ బీలిచి కల్మష *
రసములెల్ల । నట్టికల్మషమేమితా * నంటనట్టు । లఖిలసూకష్టసుఖ
ములు * ననుభవించి । దగులఁడాదోషమెద్దియుఁ * దత్త్వవేత్త॥
క॥ ఇలమాయలుసర్వంబును । సలలితముగఁజూచునింద్ర * జాలము
భంగిం । కలిమిని లేమినిఁబొంకియుఁ । గలవిధమున నాత్మవేత్త *
గాంచుచునుండుం॥ ౧౯౪॥ ఆ-వె॥ తనువుదానుగాక * తానుదానై
యున్న । స్థిరునిమాయ లేమి * సేయ లేవు । చలనరహితమైన *
శైలంబుఁగదలింపఁ । గలదెచలనమైన * గాడ్పురయముఁగ॥ ౧౯౫॥ ఉ॥
క్షీరముఁబేరియాపెరుగుఁ * జిల్కఁగఁదేలిననిగ్గుచల్లలో । గారవమొప్పఁ
గల్పినను * గట్టిగవేలుగనిల్చునట్లుగం । ధీరత నాత్మతత్త్వమును *
దేహమునందునఁదేల్చినట్టియా । ధీరుఁడువిశ్వమాయలను * దేలిము
నింగినమాయఁజెందునే॥ ౧౯౬॥ ఆ-వె॥ ముత్తెమైననీరు * ముత్తెం
బుగానుండుఁ । గానిజలమునందుఁ * గలియనట్టు । లాత్మయైనమాంతఁ *
డాత్మగానుండును । గానితిరిగిమాయఁ * గలియఁడెపుడు॥ ౧౯౭॥ క॥
క్షీరములఁగలియునుదకము । క్షీరములేగానిజలము * చిక్కనెమఱి
లం । దారకతత్త్వమునందునఁ । జేరినయాఘనుఁడుమగుడిఁ * జెందు
నెమాయం॥ ౧౯౮॥ ఆ-వె॥ పావకుండుసర్వ * భక్షకుండయ్యును ।
గలుషిగానిభంగిఁ * గలుషమైనఁ । జేసికలుషపదముఁ * జెందరుబ్ర
హ్మజ్ఞు । లగుటవలననార్య * లంబుజాక్షి॥ ౧౯౯॥ క॥ తనువుండి

జ్ఞానియెట్లగు। ననియనిననుదగ్ధపటము*న్యాయముగాగర । గనుపడు చూచెడువారికిఁ। దనువే లేకుండు వేత్త * తనుఁదానగుచుర।౧౯౬॥ తే.గీ॥ తొడరిగారుడమంత్రసి*ద్ధుండుఫణుల।నంటిగఱపించుకొనవిష* మంటనట్లు। మొనసిగురుమంత్రసిద్ధుండు * మోహపాశ। ములను బొందియుఁబొందఁడు * మోహనాంగి॥ ౧౯౭॥ చ॥ అరయసమస్త భూషణము * లంగనబంగరఁటంచుఁజక్కఁగా । నెఱఁగిననామరూప ములు * నెప్పటియట్లుగవచ్చువచ్చినర । మఱితనపూర్వదృష్టికిని * మాఱుపుసెందనియట్లువేత్తకుర । బరిఁరిరీతులర మెఱఁగి * భంగము రాదిఁకనాత్మదృష్టికిర॥ ౧౯౮॥ క॥ అనవినిదా రాసుతులతో । నను వొందుచునిట్టిమార్గ * మందియుఁగడ తే । ఱినవారిఁజెప్పమనఁగాం। తనుగనుఁగొనియిట్టులనియె * దామోదరుఁడుర॥ ౧౯౯॥ సీ॥ పతి జనకుఁడురాజ్య * భారకుండయ్యును - జ్ఞానులలోనఁబ * ఖ్యాతిఁ గాంచె। ధరవసిష్ఠుఁడుపుత్ర*దా రాదియుతుఁడయ్యు - నాత్మజ్ఞులందు గ * ణ్యతనుగాంచె। వరతులాధారుండు * వాణిజ్యవృత్తిచే-నుండి వేత్తలలో న * ఖండుఁడయ్యెఁ। గటికవృత్తినిసల్పి * యటులధర్మ వ్యాధుఁ - డంతటిజ్ఞానిలేఁ డనఁగఁబరఁగెఁ॥ తే.గీ॥ గానవేత్తలు ప్రారబ్ధ * కర్మవశతఁ । గడఁగియెటువంటివ్యవహార * కములునెట్లు। సల్పిననునేమికొదువమో * క్షంబునకును । మఱియుమానంబునను మాత్ర * మైనలేదు॥ క॥ అనవుడుజన్మకుఁబూర్వము । చనిపోయిన వెనుకలేదు*జన్మమెవరికి । న్ననికొందఱందురదియె । ట్లనమాధవుఁ డనియెనిట్టు * లబ్జాననకుర॥ ౨౦౧॥ సీ॥ సరసిజేక్షణవిను * జన్మకుఁ బూర్వంబు - చచ్చినపిమ్మట * జనులకెల్ల । జన్మమే లేకున్న * జని యించువారెల్ల - నొక్కచందంబున*నుండవలదె। మహినేలురాజు నై * మంత్రియైభృత్యులై - ప్రజలునై యుండఁగఁ * బడుటయెట్లు। ధనవంతుఁడొక్కఁడై *దారిద్ర్యతనొకండు-రోగియొక్కండునై *భోగి యొక్కఁ॥ ఆ.వె॥ డగుచునొకఁడుసుఖము * ననుభవించుటయెట్లు। లొకఁడుదుఃఖియగుచు * నుండుటెట్లు। గానసర్వజీవ * గణములు కర్మచేఁ । గలిగికర్మఫలము * గాంచుచుండ॥ ౨౦౨॥ క॥ మునుజే యుకర్మఫలమని । తనయాపత్కాలమందుఁ*దలఁచునునరుఁడ। ట్లనె

నెంతురెల్లవారలు । మునువెన్కనుగర్మజన్మ * ములుగలుటచేఁ। ౨౦౩॥ ఆ-వె॥ మున్నుజన్మలేక * యున్ననునీజన్మ । గలుగుటకును లేదు * కారణంబు । పూర్వకర్మఫలముఁ * బొందనీజన్మయొ్యనిపుడు కర్మపిదప * నిచ్చుజన్మ॥ ౨౦౪॥ సీ॥ ముందువెన్కనుజన్మ * ములు లేకయున్నచో - ననుభవంబిఁకలేని * యట్లగాన । జీవహింసయు నేమి * సేయరాదననేల - దబ్బరలాడరా * దనఁగనేల । జారచోరత్వముల్ * సల్పరాదననేల - మద్యపానముదోష*మనఁగనేల। మాయవాదులపొందు * మానఁగామననేల - నార్యులసేవించు * మనఁగ నేల॥ ఆ-వె॥ శాంతినొందనేల * జనులుసత్కార్యముల్ । సేయనేల దైవ * చింతయేల । ధర్మవృత్తియేల * దలఁపంగ నివియెల్ల । జన్మముంటఁజేసి * సలుపవలసె॥ ౨౦౫॥ ఆ-వె॥ మగుడిజన్మలేని * మాట సత్యంబన । సుజనదుర్జనులును జూడనొకటె । మంచిచెడ్డలొకటె * మఱిసనాతనధర్మ । మెత్తిపోవునుగద * యిట్లనంగ॥ ౨౦౬॥ క॥ ఇల జన్మభయముచేఁగద । సలలితముగసూరిజనులు*చాలాకష్టం । బులు నొందిపరముఁగన్గొని । తొలఁగుదు రాకర్మజన్మ * దుఃఖవిపత్తుల్॥ ౨౦౭॥ క॥ భవముమునువెనుకలేదను । నవివేకులునిపుడుపుట్టు * టదియేల పురా । భవఫలము లేకయున్నను । భువినేలకయందఱన్ని * పోలికలేలా॥ ౨౦౮॥ ఆ-వె॥ కర్మజన్మగతులు * క్రమముగాఁబెద్దల । వలనఁదెలియుటకును * దెలివిలేక । నోటవచ్చినట్లు * మాటలాడెడువార। నేకమందిగలరు* లోకమందు॥ ౨౦౯॥ క॥ జ్ఞానికిఁబాయును దనువ । జ్ఞానిగతికి బేధమేమి * సమమిద్దఱనన్ । జ్ఞానియుముక్తుండగు న। జ్ఞానియుఁగర్మాంకురమున* జన్మములొందున్॥ ౨౧౦॥ ఆ-వె॥ అదియునెట్టులనిన * నమరవేల్చినవిత్తు। నిలనునెందునైన * మొలవ నట్లు। విమలజ్ఞానవహ్ని * వేల్చినకర్మయన్ । విత్తుచచ్చుజన్మ * వేత్తకేది॥ ౨౧౧॥ క॥ ఏవిధబాధలనైనను । నేవేళనునైననిలను * నెచ్చటనైనన్ । జీవన్ముక్తుఁడు కాయముఁ । బోవిడిచినముక్తుఁడగును * బూర్ణేందుముఖి॥ ౨౧౨॥ ఆ-వె॥ దేహమెప్పుడునరుఁడు * దెలియంగవలెనది । గోరితెలియకున్నఁ * గొఱంతగల్గ। దైననీకునిపుడు * నామరణాంకముల్ । కొన్నిదెలియపఱతుఁ * గొమ్మవినుము॥ ౨౧౩॥ క॥

## మ ర ణ చి హ్న ము లు.

ఏవస్తువు తాఁజూచిన। నావస్తువు ఛిద్రముగను * నగుపడుచున్న। నీ
విశ్వమునొకవింతై। భావంబునఁదోపఁగల్గుఁ బంచత్వంబున్॥ ౨౧౪॥
సీ॥ తనదృష్టికిని నరుం * ధతిగనుపడకున్నఁ - దోయంబులశిరము *
దోఁచకున్న। వీనులనాదంబు*వినఁబడకుండిన - నడుగులజాడచూ*
పడకయున్నఁ। దరణిబింబముమధ్య * తెఱపిగాఁదోఁచినఁ-జుక్కలు
నల్లగాఁ * జూడఁబడిన। గరమునిటలముంచఁ * గామణిబంధంబు -
కనులకుమందమై* గానఁబడిన। ఆ-వె॥ నర్కుఁడైనఁజంద్రుఁ*డైనను
విడువక। ననిశమొక్కరీతి * నడచిరేని:। బరఁగమృత్యుభయము*
ప్రాపించునరులకు। వానివానికొలఁది * వనరుహాక్షి॥ ౨౧౫॥ క॥
ఈకరణిని సుజ్ఞానముఁ। జేకొనినటియించుపరమ*సిద్ధునకును నే। లోక
మున సములునధికులు। ప్రాకటముగ లేరువెదకి * పట్టిననెందున్॥
౨౧౬॥ ఆ-వె॥ తరుణి దెలియఁగల్గు * ధర్మమర్మంబులు। దెలిపి
తిప్పుడెల్లఁ * దేఁటపడఁగఁ। గొఱతయేలయింక * గొప్పరహస్యంబు।
మఱియుఁగలుగునచల * మార్గమొకటి॥ ౨౧౭॥ క॥ మిన్నయగుసర్వ
మునకును। బన్నుగనా కేవలాత్మ * భావమరయ కే। యెన్నెన్ని నీవు
దెలిసిన। నన్నియువ్యర్థంబులగును*నబ్జదళాక్షీ॥ ౨౧౮॥ ఆ-వె॥ అరయ
సాంఖ్యతార * కామనస్కములకుఁ। జేరుగడయు నగుటఁ * జేసి
బుధులు। నచలభావమీయ*రతివవానికిఁగ్రింది। భావములను దెలియ*
పఱతురెండు॥ ౨౧౯॥ చ॥ ధరఁ బరి పూర్ణభావమును * దప్పక
పొందుటె యుత్తమోత్తమం। బరుదుగ సాంఖ్యతారకము * లాయ
మనస్కముఁ బొందమధ్యమం। బరుదుగ ముద్రయోగములు * పట్టుట
యున్నధమంబయెంతయున్। సరఁగునఁ బుణ్యపాపములు * సల్పుట
యున్నధమాధమంబగున్॥ ౨౨౦॥ ఆ-వె॥ సుదతిమున్ను నెఱ్ఱఁ*జూపి
చేఁపనుబట్టు। పగిదిముందునెఱుక*భావమెల్లఁ। గఱపినాఁడనుపట్టి *
యెఱుక చేఁబరిపూర్ణ। భావమరసియెఱుకఁ * బాయవలయు॥ ౨౨౧॥ చ॥
అనవుడునత్తలోదరియు * నాదనుజాంతకు నాదయాంబుధిన్। గనుఁ
గొనిపల్కెఁదారకిము * గాంచితిమీకృపచేతనిప్పుడున్। వినఁదగుధర్మ
మర్మములు * వింటినిసంశయమెల్లఁదీఱె నా। మనవివహించి యీ

యచల * మార్గము దెల్పుమి జీవితేశ్వరా॥ ౨౨౭॥ క॥ కర్మాంధకార భాస్కర । మర్త్యామర్త్యావిభేద * మానితబోధా । ధర్మాధర్మవిహీనా। నిర్మల సగుణప్రదీప * నిర్గుణరూపా॥ ౨౨౩॥ మాలిని॥ చలనరహిత గాత్రా * సర్వభూతాత్మసూత్రా । విలయనిలయనాశా * విశ్వదీప ప్రకాశా । కలుషవిగతసంగా * కర్మసంతాపభంగా । సలలితగుణ హర్తా * సర్వలోకేశ భర్తా॥ ౨౨౮॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్య పుత్ర, సాధుజనమిత్ర నారసింహనామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను-సుజ్ఞాన శాస్త్రంబునందుఁ జతుర్థాశ్వాసము - సమాప్తము॥

శ్రీసద్గురవేనమః

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞానశాస్త్రము.

### పంచమాశ్వాసము.

క॥ పరిపూర్ణ కేవలాత్మా।పరహంసనమేతభూత * పంచాతీతా పరమపదనిత్యమంగళ । పరతత్వాధీశముక్త * బంధవినాశా॥౧॥ వ॥ అవధరింపు మక్కంసారి యాహంసయాన కిట్లనియె॥ ౨॥ చ॥ అలికుల వేణిలోకముల*నన్ని చరింపఁగవచ్చుఁగొండలు। న్నలుపుగనెత్తవచ్చు నటు*లంబుధులెల్లను దాఁటవచ్చుభూ । తలమున దూరవచ్చుదివిఁ* దాల్మినిఁ బ్రాకఁగవచ్చుఁగానియా । యిలఁ బరిపూర్ణభావమును *

**అచలభావము.**

నేరికిఁబట్టుటదుస్తరంబగుఁగా॥ ౩॥ ఆ-వె॥ మొనసివివిధయోగ*ముద్రలు గనవచ్చు। దేహతత్వమెల్లఁ * దెలియవచ్చు । నందవచ్చుతార *

కామనస్కంబుల । నంటరాదు కేవ * లాత్మబోధ॥ ౪॥ క॥ భక్తికి
వశ్యముగాదది।ముక్తికిఁజూపడదుబంధ ముడఁదగులదుపో।యుక్తికిఁ
జిక్కదు మఱియే । శక్తికి సాధ్యంబుగాదు * సతియచలంబుల్॥ ౫॥
ఆ-వె॥ భావమునకుఁదగులు * వడదుసూయచలంబు । చూపరాదు
కనులఁ*జూడరాదు । నోటనిట్టిదనుచు * నుతియింపఁగా రాదు।రమణి
మదికిఁగోచ*రంబుగాదు॥ ౬॥ క॥ భామిని యేమనిచెప్పుదు నామము
రూపంబులేక*నంతయుబయలై । కామాదిగుణవికారము। లేమియు
లేకున్నదదియు * నేమనరాకన్॥ ౭॥ ఆ-వె॥ రూపముండెనేని *
రూపింపఁగావచ్చు । నామముండెనేని*నరయవచ్చు। గుణములుండె
నేని*గుర్తెఱుఁగఁగవచ్చు । నేమిలేనిదాని * నెఱుఁగుటెట్లు॥ ౮॥ సీ॥
గాలిచేఁగూలదు * రాలచేఁబగులదు-కత్తికిఁదెగదగ్నిఁ * గాలిపోదు।
అబ్ధిలోమునుఁగదీ * యవనిలోనణఁగదు * నింగిఁబ్రాకదులోక*సంగి
గాదు । ఎండకెండదువాన*కెంతయుఁదడువదు- చలికివణఁకదెందు*
జంకుపడదు । బాధలకందదు * పాశాళిచేఁగట్టు - పడదుమృత్యువు
చేత * భంగపడదు॥ చేతికందదుసూస్వత * స్విద్ధమగుచుఁ। బుట్టినది
గాకనదియెప్డు*గిట్టులేక । బట్టబయలయ్యు నొకభంగిఁ*జట్టువలెను ।
నలరు పరిపూర్ణబ్రహ్మంబు * నరసిచూడ॥ ౯॥ క॥ పొందుగసద్గురు
సూచన।నొందిననితరంబులేక*యుండునుబయలై।యెందునఁజూచినఁ
గనుపడు । సందింతయు లేకసర్వ * సంపూర్ణంబై॥ ౧౦॥ క॥ ఇది
యిదియిదియిదిగానిది।నదియిదియదియనుచు నెఱుఁగు*నదిగానిదియై।
సదనాతీతంబగుచును । గదలకగనుపించునదియె * గనుమచలంబో॥
ఆ-వె॥ పంచభూతగోత్ర*భానుసుధాకిర । ణాబ్ధులమరమూర్తు*లఖిల
జీవ । భువనజాలమెల్లఁ * బుట్టకపూర్వమే । గలదుకేవలాత్మ * కమల
గంధి॥ ౧౨॥ క॥ పుట్టినవెనుకనుజగములు। పుట్టకయున్నప్పుడొక్క *
పోలికనెందున్ । బట్టబయలగుచునుండిన । యట్టిదెయచలంబుగాని*
యాత్మయునగునే॥ ౧౩॥ మ॥ పరమాత్ముండనమాయ బట్టబయలే *
బ్రహ్మంబుభావింపఁగాఁ। బరిపూర్ణంబగుదాని నిట్టిదనుచున్*బల్కంగ
రాదేరికి । స్మరయంగా నది నిర్వికారమతులం * బాధార శూన్యం
బుపో । నిరుపాధికమునిర్గుణంబునజమున్ * నీరంధ్రమైభాసిలున్॥

౧౪॥ సీ॥ ఆత్మదైవంబంచు* నారయవలదింక - నాత్మదేవుండైన*నచల
మట్లు । నిలచియుండవలదె * నిమిషంబులోఁబోవు - నాత్మదేవుం
డెట్టు:లగుఁదలంపఁ । దనువువచ్చినపుడె* తానునువచ్చెను-దానుండు
వఱకును * దనువునుండుఁ । దానుబోయినపుడె * తనువుదగ్ధంబగుఁ-
దనువుఁబాసినపుడె * తాను లేక॥ తే-గీ॥ మాయమైపోవునా యాత్మ*
మాయగాక। దలఁచిచూడంగ నాయాత్మ*దైవమగునె యాత్మయని
ననుబరమాత్మ * యనినఁబరమ । హంసచైతన్య మనసాక్షి * యనిన
మాయె॥ ౧౫॥ సీ॥ అన్నపానంబులా* ద్యఖిలవర్తనములు - నాత్మకు
లేవు దే* హంబునకన । దేహంబునందు నా * దేహియున్నప్పుడే -
యన్నపానంబుల * నారగించు। స్వప్నసుషుప్తులు * జాగరంబును
నొందు-నఖిలకార్యంబుల* నాచరించు। నాత్మయాకాయంబు* నందు
లేనప్పుడు- కలయునిద్రయు మేల్కా*గాంచు టేది॥ తే-గీ॥ యన్నపానం
బులను జేయు * టదియు నేది । సకలకార్యంబులనునింక* సల్పుటేది ।
గానసర్వంబు దేహి దే* గాని దేహ। మేమినేయదు జడమది* మీానవేత్ర॥
౧౬॥ సీ॥ ఆత్మయేగల్పించె*నరయఁద్రిమూర్తుల- నాత్మయేగల్పించె *
నసురసురల । నాత్మయే గల్పించె * నష్టదిక్పాలుర - నాత్మయే
గల్పించె*నర్కవిధుల । నాత్మయేగల్పించె*నక్షత్రవితతుల- నాత్మయే
గల్పించె * నగపయోధు । లాత్మయేగల్పించె * నాపంచభూతంబు-
లాత్మయేగల్పించె * నఖిలజగము॥ తే-గీ॥ లాత్మగల్పించె పశుపక్షు*
లాదివివిధ । సస్యవర్గంబు నరులాది * సకలజీవ । జాల మొనరింప
హరియింప * మూలమాయ । నాత్మయేగాని వేఱొక్క * టరయ
లేదు॥ ౧౭॥ క॥ పుట్టినదిగా దచలమును । బుట్టింపదు దేనినదియుఁ*
బొలియదెప్పుడుఁ దా। నెట్టివికారములొందదు। పట్టదుమఱియెట్టిజోలి*
బయలునకెప్పుడున్॥ ౧౮॥ ఆ-వె॥ తెలివిజగము లెల్లఁ* దెగినను శేషించి।
నిలిచియుండు బయలు * నిక్కముగను । నట్టిబయలు దేవుఁ * డగుఁ
గానినాశమై । పోవు మాయయాత్మ * దేవుఁడగునె॥ ౧౯॥ క॥ అన
వుడునాత్మయె నిజమని । మును జెప్పితిరిప్పుడదియు* ముఖ్యముగాదం
చనిచెప్ప నేమికారణ । మనియడిగినఁగాంతకనియె* మారగురుండున్॥
౨౦॥ ఉ॥ మాయెదలంప నాత్మయును * మాయనిమున్నగ నీకుఁ

జెప్పినన్ । మాయవిచారమేలయని మానుదుఁ ద్మదళాక్షియందుఁ గై। మాయగు నాత్మనిక్కమని * మాటికిఁజెప్పితి బీఱచిక్కఁగా। మాయ విడంగఁబోదనియు మాయవిచారముఁజేయకుండినన్ ॥ ౨౧॥ చ॥ తను వును జూడఁజూడమును * దథ్యముగాఁగను దోఁచుఁదోఁచినన్ ॥ దనుఁ గనుఁగొన్న నాతనువు తానును గానని తోఁచునంతలో। నెనయఁగ గేవలాత్మమది* నెంచియుఁగాంచినతోడతోడనే॥ తనువును దానువిశ్వ మును * దబ్బరగాఁగనుదోఁచుగావునన్ ॥ ౨౨॥ ఆ-వె॥ ముదితయో నమాలు * మొదటిమెట్టుగుగుణి । తంబురెండవదియుఁ * దలఁపలిపుల। నరసికూర్చిపల్కు * నదిమూడవది గ్రంథ । మమరఁజదువునదియు * నవలిమెట్టు॥ ౨౩॥ తే-గీ॥ అట్లుసాంఖ్యంబు మొదటిమె * ట్టగును దారకంబు రెండవమెట్టగుఁ * గాంచఁగనమ । నస్కమునుమూడవది యగు * నచలభావ । మరయనాలవమెట్టగు * నట్లుగాన॥ ౨౪॥ చ॥ తిరముగనాత్మతత్త్వమును * దెల్పకమాయగరోసియున్నగాఁ। బరమప దంబుఁజెప్పినను * బట్టుటదుర్లభమెంతవారికి। న్నిరవుగనోనమాలును జి * నేర్పకమున్నుగఁబెద్దపుస్తకం । బరుదుగఁజేతికిచ్చినను * నాతఁ డునుంజదువంగనేర్చునే॥ ౨౫॥ ఆ-వె॥ చెట్టుమొదలుఁబట్టి * చివరను బోయికూ । ర్చుండువానిభంగి * సూరిజనుఁడు । నాత్మతత్త్వమనెడు * నావృక్షమునుమొదల్ । పట్టిపోవుపరమ * పదమునకును॥ ౨౬॥ ఉ॥ చుక్కలలోననేదొయొక * చుక్కనుజూపెడువాఁడువానిలోఁ । జు క్కనునొక్కటి న్దొలుతఁజూపియుదానికినావలీవలన్। జుక్కలగుత్తుఁ జేసి యల * చుక్కనుజూపినయట్లువేత్తయున్ । బెక్కులుగుత్తులన్ గనిన * పిమ్మటఁజూపును గేవలాత్మనున్॥ ౨౭॥ ఆ-వె॥ మొదలుపట్ట కుండ * మొనసిశాఖాగ్రాన । కెగసిపోవఁగలరె * యెవ్వరైన । న ట్లుమొదలునాత్మ * నరయకపరిపూర్ణ । భావమొందరాదు * బ్రహ్మ కైన॥ ౨౮॥ ఉ॥ ఏటినిదాఁటునంతకును * నేదొకసాధనయుండఁగా వలెన్ । ఏటినిదాఁటిగట్టునకు * నెక్కినపిమ్మటనేలసాధనల్ । ధాటిగ విశ్వమాయలను * దాఁటియునొబయలందువానికి । న్నేటికిసాంఖ్య తారకము * లేటికినాయమనస్కముద్రలున్ ॥ ౨౯॥ చ॥ కరమునఁ దాల్చిదీపమును * గామితవస్తువుఁగాంచి యంత సు । స్థిరముగనుండు

వానికిని * దీపమునక్కఱలేనిచందమా। యెఱుకనువెల్గుచేతబయ *
లెంతయుఁగాంచినవానికావల। న్నెఱుకనుదివ్వెతోడనిఁక నెంతయుఁ
గార్యములేదుచూడఁగన్ ॥౩౦॥ ఆ-వె॥ పొట్టుఁబాయఁదంచి * పొసఁగఁ
దండులములు। సంగ్రహించునట్టి * చందమునను। మాయఁబాయ
మాయ * మదివిచారించియ। మ్మాయఁదొఱఁగియచల * మందవలయు।
౩౧। క॥ సత్యము నచలమునోట న। సత్యము నిలయఁగాటఁజేసి *
శాస్త్రంబులకున్। గృత్యమగులోకమునకును। బ్రత్యక్షవిరోధమచల *
భావంబింతి॥ ౩౨॥ ఆ-వె॥ ఇలకు శాస్త్రములకు * నెంతవిరుద్ధంబు।
నైన నిజముకేమి * హానియేను। శాస్త్రలోకములకు * జడియక
బాహాట। ముగను దెలుపువాఁడఁ * బూర్ణబోధ॥ ౩౩। క॥ పరి
పూర్ణముసేవించుటె। తిరముగజాగ్రతయటంచుఁ * దెలియుమువిశ్వం।
బరయుటెస్వప్నముగావునఁ। బరిపూర్ణముగాంచి కలను బాయుము
నీవున్। ౩౪॥ ఆ-వె। బయలనంతమనినఁ * బరిపూర్ణమనినను। నచల
మనినఁగేవ * లాత్మయనినఁ। బరమగోప్యమనినఁ * బరమపదంబన।
బట్టబయలుకాఖ్య * పరఁగుఁజూవె। ౩౫। చ। గరిమఁబరాచరంబులును *
గానిదిసర్వమునొక్కటైనదై। మఱుఁగునుమాయమర్మములు * మా
టలుమోసములేమిలేనిదై। హరిహరపద్మగర్భులకు * నందఁగరానిది
యెందునున్నదై। యరయఁ బరాపరంబులకు * నావలయైనది కేవ
లాత్మయున్। ౩౬। సీ। అన్నపానంబుల * నాచరింపదుజగా - లేల
దెదురుఁదన్ను * నెఱుఁగ దెపుడు। పుట్టదుగిట్టదు * భోగింపనేరదు-కద
లదుమెదలదు * కర్తగాదు। జాగ్రతనొందదు * స్వప్నంబుఁజెందదు-
నిద్రనుబొందదు * నిమిషమేది। సేయదుచూడదు * చెప్పదువినదేమి-
గూడదువీడదు * గుర్తుపడదు। బాధలొందదుసుఖముల * పాలుపడదు।
మహిమఁజూపదు మాయల * మాటుపడదు। అహముఁజెందదుసూ
కేవ * లాత్మబయలు। నాదిమధ్యాంతములులేక * యలరుచుండు।
ఉ॥ పూనదుమాన దెందునను * బొందదుచెందదు లోకమాయలన్।
గానదున్యూనమానములఁ గందదుడిందదుకర్మభంగుల। న్మానదుహాని
వృద్ధులను * నందదుచెందదు సర్వకాలముల్। రానిదిపోనిదే బయలు *
రాకడపోకడమాయెసర్వమున్॥ ౩౭॥ సీ। అండాండములుమాయ *

పిండాండములుమాయ - బ్రహ్మాండములుమాయ * బ్రహ్మమాయ।
హరిహరాదులుమాయ* యమరేంద్రుఁడునుమాయ- పంచభూతాది
ది * కృతులుమాయ। సూర్యచంద్రులుమాయ * సురలుదైత్యులు
మాయ - తారకాంబుధిగిరి * తరులుమాయ। జగములెల్లను మా
య * జగదీశులునుమాయ - సకలజీవులుమాయ * సాక్షిమాయ॥
యరయనవతారములుమాయ * నరులుమాయ। నరకస్వర్గంబులును
మాయ * నటనమాయ। మాయయేయెంచసర్వంబు*మాయగాని।
దచలపరిపూర్ణమొక్కటే * యరసిచూడ॥ సీ॥ అచలమాహరిగాదు*
అజరుద్రులునుగాదు * శబ్దాదిభూతకం * చకముగాదు। దిగ్గజంబులు
గాదు * దిక్పాలకులుగాదు - నరసురదైత్యవా * నరులుగాదు। తర
ణిందులునుగాదు * తారకంబునుగాదు - తరులతాకులపర్వ*తములు
గాదు। గరుడయక్షులుగాదు * గంధర్వులునుగాదు-సిద్ధవిద్యాధర*
శ్రేణిగాదు। ఉరగకిన్నరపూరుష * యుతముగాదు। శారదాలక్ష్మి
గిరిజాది*పతులుగాదు। ప్రమథులునుగాదునావిఘ్న * పతియుఁగా
దు। పూజలునుగాదు వందనం * బులునుగాదు॥ ౪౦॥ సీ॥ కల్పవృ
క్షముగాదు * కామధేనువుకాదు - హంసపక్షిగరుడుఁ*డాదిగాదు।
ఆదిశేషుండుగా * దష్టవసులుగాదు - నవరత్నలోహపం * చకము
గాదు। సప్తదీవులుగాదు*సప్తాంబుధులుగాదు - సప్తర్షులునుగాదు*
శాంతిగాదు। వరసత్యలోకాది * వైకుంఠములుగాదు-కైలాసదేవ
లో * కములుగాదు॥ వెలయఁగానెల్లయవతార * ములునుగాదు।
జగచతుర్దశశక్తిపం * చకముగాదు। దేశికులుగాదు శిష్యాది* తెగ
లుగాదు। అంతరముగాదు బాహ్యంబు * నరయఁగాదు॥ సీ॥ సకల
వేదపురాణ*శాస్త్రంబులునుగాదు - ఘనభాష్యసూత్రాది * కములు
గాదు। స్మృతియును నితిహాస * శ్రుతిసూక్తములుగాదు - దలఁపఁ
జ్యోతిష్పివి * ద్యలునుగాదు। తెలియనేఁబదియాఁలు * దేశభాషలు
గాదు - నామరూపాఘ పు*ణ్యములుగాదు। నలసాంఖ్యతారక *
లమనస్కమునుగాదు - ముద్రయోగవిశేష* ములునుగాదు॥ స్నాన
సంధ్యాదులునుగాదు * జపముగాదు। సప్తకోటిమహామంత్ర * చ
యముగాదు। తపమునుపవాసవిధినిషే * ధములుగాదు।జ్ఞానకర్మం

బులునుగాదు*సారసాక్షి। ౪౨। సీ। చెలియవెల్గునుగాదు * చీఁకటి
యునుగాదు - అరయనూల్లినుగాదు * అడవిగాదు। అంతరంగము
గాదు * ఆశ్రమంబులుగాదు - అనువొందుకృష్ణాజి * నాదిగాదు।
మహనీయదండక * మండలంబులుగాదు - కాషాయవస్త్రసం * గతు
లుగాదు। ఆసనంబులు గాదు * అభ్యాసములు గాదు - రుద్రాక్ష
తొలిసిపే*రులునుగాదు। ఒనరఁదలలనుబోడిసే * యుటయుఁగాదు।
సొరిదిగడ్డంబుజడలుఁబెం * చుటయుఁగాదు। నామమునువిభూతియుఁ
దాల్చు * నటనగాదు। కట్టుటయుఁగాదునగ్నయుఁ * గాదుబయలు।
సీ। పరఁగఁజుల్కనగాదు * భారంబుగాదు శీ - తోష్ణకఠినమృదు*లో
నరఁగాదు। షడ్రసంబులుగాదు*సద్గంధములుగాదు-షడ్వర్ణకలితసం*
చయముగాదు। పురుషుఁడుస్త్రీయు న* పుంసకంబునుగాదు - జడము
గాదదియు న* జడముగాదు। వరబాల్యయౌవన * వార్ధకంబులుగా
దు - పరికింపదీర్ఘకు * బ్జములుగాదు॥ ప్రాణమునుగాదుఅచలంబు *
బ్రతుకుగాదు। భంగమునుగాదునిశిగాదు*పవలుగాదు। వారతిథిపక్ష
మాసఋతు*వయనవత్స। రములుయుగకల్పకల్పాంత*రములుగాదు॥
సీ। మెలఁతధర్మాధర్మ * ములును వేద్యావేద్య - ములునుజోద్యాచో
ద్య * ములునుగాదు। తలఁపసత్యాసత్య * ములునునిత్యానిత్య -
ములునుఖండాఖండ* ములునుగాదు। కలయసాధ్యాసాధ్య* ములు
చలాచల నిరా - కారసాకారాది * గతులుగాదు। ఎలమిలోకా
లోక * ములునుగాలాకాల - ములునుభావాభావ * ములునుగాదు॥
తే-గీ॥ గోపురములుగాదారయ గుళ్లుగాదు। పరఁగవిగ్రహములు
గాదు * భక్తిగాదు। దానములుగాదుతీర్థయా * త్రలునుగాదు।
యాగములునాదిగాదుసూ*యచలమెన్న। ౪౫। తే-గీ। అఖిలమును
గాదుసర్వశూ * న్యంబుగాదు। దలఁపఁగన్నులకెదుటఁబ్ర * త్యక్ష
ముగను। జూడఁగనుపించునదియెట్లు * శూన్యమగును। లేని దర
యంగ మాయయే * లేదుగాక॥ ౪౬। శా॥ ఫాలాక్షామరవిష్ణు
పద్మజులకుఁ*బ్రత్యక్షదైవంబునై। కాలాకాలములేవిలేకబయలై*
గన్పించునాబ్రహ్మముఁ భావింపఁ బవనాంబుపర్ణఫలముల్ * భక్షిం
చుచుఁ యోగులై। చాలాకాలముకానలందుఁదపముల్ *సాధించరే

గానకర్ణ। ౪౭। తే-గీ॥ ఎందొగలదుసూబయలంచు * నెంచఁబోకు। పంచభూతాదిసర్వప్ర * పంచయుతము। నీవునేనునుగాకను * నిల్చిన దిరయొ। బయలుప్రత్యక్షమగు బట్ట * బయలుచూపె॥ ౪౮। ఆ-వె॥ నీకుముందువెనుక * నిరుపార్శ్వములయందుఁ। జాలుమూలలాది*సర్వ దిశల। దాపుదవ్వులందు * లోపలవెలుపలఁ। గ్రిందమీఁదఁగలదు* కేవలాత్మ॥ ౪౯॥ క॥ ఒరగదుపెరుగదువిఱుగదు। తఱగదుమర్మంబు గాదు * దాఁగదదెందుర్ణ।జరుగదెలుంగదు మొలుఁగదు।పరిపూర్ణంబది గొచూడు*ప్రత్యక్షముగర్ణ॥ ౫౦॥ తే॥ పుట్టిగిట్టెడుమాయలఁ*బట్టు వడదు। అందియందదిందునం*దనఁగరాదు। సర్వపరిపూర్ణమైయెందు * సందులేక। నిండియున్నదిపరికింప * నేమిగాదు॥ ౫౧। క॥ ఖం డాఖండములగుచును। నుండినదేమాయమాయె*హుళ్ళిక్కియగుర్ణ ఖండాఖండములొందక। యుండినదేబయలఁటంచు*నూహింపంగర్ణ। ౫౨। ఆ-వె। తలఁపఁబేరులేని * దానికిబయలని। పేరుమాయపుట్టి * పెట్టినట్టి। బట్టబయలుగన్న * భ్రమరూపమైనట్టి।మాయవాసిపోవు* మధురవాణి॥ ౫౩॥ క। చూచితిమందురుకొందఱు। చూచినదేమి యును లేదు * శూన్యంబునఁదాఁ। జూచినతోఁచినజ్ఞప్తి క। గోచరమై పోవుతానె * కొనకునులేకర్ణ। ౫౪। తే-గీ। తానుబ్రహ్మంబుగనఁ బోవఁ * దానెలేదు। బ్రహ్మమేఁగంటినంచును*బల్కుటెట్లు। సూర్య బింబముంబొడఁగన * శూన్యమైన। చీఁకటేదింకరవిజాడఁ * జెప్పుట కును। ౫౫। క॥ ఉన్నదియున్నదిబయలని। యన్నదిపలుమాఱులె ఱుకె*యాయచలంబుర్ణ।గన్నదిలేకయెపోయె। న్నున్నయచలమెఱుఁ గనేమి * యున్నదియింకర్ణ॥ ౫౬॥ ఆ-వె। ఏమిలేనిదాని * నేనెట్టులె ఱిఁగింతు। నీవునెఱుఁగుటెట్లు * నిక్కముగను। నున్నదేమిగాక * యున్నదేయున్నది। లేనిమాయలేనె * లేదెపుడును॥౫౭॥క॥ తోఁచినది గాదుసర్వముఁ। జూచినదియుఁగాదుసర్వ* శూన్యముగాఁదాఁ। దోఁచి నదెల్లనుమాయే। చూచినదియుమాయెబయలుఁ* జూడఁగవశమే। తే-గీ।బట్టబయలందుఁదోఁచుప్ర * పంచమెల్ల। లేకగనుపించుఁబరికింప* లేకపోవు। నెండమావులఁదోఁచెడు * నీళ్ళకరణి। వెదకిచూచిన లే కుండు * విధముగాను। ౫౮। క॥ భ్రమచేతఁదోఁచుసర్వము। భ్రమ

చేతనెలేకపోవు భ్రమయేగాంచుర్ । భ్రమలేనివారికెప్పుడు। భ్రమ
దోంచదెందుబట్ట * బయలునకంటెర్॥ ౬౦॥ ఆ-వె॥ భ్రమయనంగ
భ్రాంతి * భ్రాంతియన్ననుమాయ । మాయయనఁగస్వప్న మగుఁ
దలంప।స్వప్నమందెనిద్ర * జాగ్రతకలలాదిఁ। బొందునెందులేక।పోవు
భ్రాంతి॥ ౬౧॥ క॥ మాయయెలోకములెల్లను।మాయేపుట్టించుఁబెం
చు*మాయేద్రుంచుర్।మాయేభ్రమయుచునుండును।మాయేకానకే
మిలేక * మటుమాయమగుర్॥ ౬౨॥ ఆ-వె॥ సర్వసాక్షిద్రష్ట*చైత
న్యమనఁబర। । మాత్మయెఱుకపరమ*హంసయన్న । నాత్మజ్యోతిమా
య*హంకారమన్నను । నొక్కటంచుఁగనుమ * యుత్పలాక్షి॥ ౬౩॥
క॥ అంతరబాహ్యముకల్పిత । మంతయుఁబరిపూర్ణమనుచు * నచలం
బనుచుర్ । సంతతముసెఱుఁగఁబడుధీ।మంతులకును లేదులేని*మాయ
దలంపర్॥ ౬౪॥ ఆ-వె॥ ఆత్మకంటెమాయ * యవనిలోనేదింక ।
వేఱుగలుగదాత్మ * విశ్వమునకు । విశ్వమెల్లమాయ*వెదకిచూడఁ
గలేని । దాత్మగానమాయ * యనఁగవలసె॥ ౬౫॥ చ॥ జననము
నామరూపములు * జాతియునీతియుఁబాపపుణ్యముల్ । ఘనమును
నీచమున్ లయము * కష్టసుఖంబులుబంధమోక్షముల్ । మనమును
నింద్రియంబులును * మానమున్యూనముమంచిచెడ్డలుర్ । గనుఁగొ
నఁగేవలాత్మకును * గల్గవుసర్వముమాయకేదగుర్॥ ౬౬॥ సీ॥ ఈ
యుత్తబట్టబై * లెప్పుడునొకభంగి - నున్నదిగానివే*ఱొక్కవిధము।
గాదింతకునుముందు * గానేరదిప్పుడు - గాఁబోవదిఁకమీఁదఁ*గా
దెపుడును । సర్వకాలములందు * సర్వదేశములందు - సర్వవస్తువు
లందు * సందులేక । సర్వసంపూర్ణమై * చలనమించుకలేక-పరిపూర్ణ
మేకమై * పరఁగునెందు॥ తే-గీ॥ జలచరానీకములవెన్ని * జలధి
యందుఁ । బుట్టిగిట్టినెఱుఁగని * పోల్కిఁగాను । నెండమావులరీతి
ని * నుండునగము।లెల్లనుండినఁబోయిన * నెఱుఁగకుండు॥ ౬౭॥ క॥
పుట్టినమాయేమాయను । బుట్టించునుగానిమాయ*పుట్టునుగిట్టుల్।
ఎట్టివొయెఱుఁగనియాబయ । లెట్టులఁబుట్టించుభ్రాంతి*నెఱుకజగం
బుల్॥ ౬౮॥ సీ॥ సత్యంబునందు న*సత్యమేపుట్టు న-సత్యమేగతిఁ
బుట్టు * సత్యమందు । నరులకునరులునే * కరులకుఁగరులునే-ఘోట

కాదులకును * ఘోటకములె । సారమేయములకు * సారమేయంబులే - కీటకాదులకును * గీటకములె । యేజాతిపక్షుల * కాజాతిపక్షులే - యొకజాతియందువే * యొక్కజాతి। తే.గీ। పుట్టకేజాతి కాజాతె * పుట్టుచుండ । సత్యముగుబట్టబయట న*సత్యమైన । జగములేరీతిఁబుట్టును*సర్వజగము । కలయెమేల్కనిచూడ నొ*క్కటియులేదు। ౧౯। ఆ-వె। తోలునోట జనులు * తాలుమాటలుదోఁచి।పలుకుటింతెగాక * భ్రాంతులగుచు । బ్రహ్మమెఱుఁగలేక * బహురీతు లెంతురు । గజమునంధకులును * గన్నయట్లు। ౨౦॥ వ॥ అదియెట్లంటేని వినుము। సీ॥ నలువు రంధకులొక్క * స్థలమునఁగూర్చుండి - కరిఁజూడగోరినఁ * గరుణనొకఁడు । గజముఁదెచ్చియు నిల్పఁ * గాలు తొండముతోఁక - చెవులొక్కొక టొకండు*చేతఁదడవి।వారణంబునుఱోటి * వలెనున్నదనెనొకం - డొకఁడురోకలిభాతి * నున్నదనియె । నొకఁడు చీఁపురుభంగి * నున్నదనివచించె-నొకఁడుచేటనుబోలి*యున్నదనియె। ఆ-వె॥ మించియొకరి నొకరు * మెచ్చక నల్వురు । నైరి నాల్గుదెరువు * లట్టివిధము । నిక్కమైన బ్రహ్మ * మొక్కరు నెఱుఁగక । పరిగణింత్రు వేలు * పద్ధతులను। ౨౧। క। కమఠాకృతి నిలఁగొందఱు । తమకపటముఁ దెలియనీక * తగనచలంబుగా।దమరెటఁగిన క్రియసాధుల । క్రమమున లోకులకుఁజూడఁ*గనిపింతురొగిగా। ౨౨॥ ఆ-వె। ఎలుకపుట్టకయును*నెట్లన్నవినునారి । కేళమందుఁజేరు*నీళులట్టు । లెలుకనాశమరయ*నేనుఁగు మ్రింగిన । వెలఁగపండుగుజ్జు * విధముదెలియ। ౨౩॥ క। బయలన్నదిబయలగునా।బయలనుభావంబునెపుడు * బ్రహ్మంబగునా।బయలనియెడిపల్కగునా । బయలను గుర్తెపుడుగాదు*పరమపదంబుగా॥ ౨౪। తే.గీ॥ ఏమియును లేనిమాయయే * యెలుకజగము । లెలుకకెయెలుక గనుపించు * నిహపరంబు । లెలుకయే సర్వమునుగుర్తు * నెఱుఁగుమఱచు । నెలుకయే లేకపోవుఁడా*నెన్నఁదుదకు। ౨౫। క॥ పరిపూర్ణంబును నెలుకను । నెలుకే గుర్తెఱుఁగునెలుక*నెఱుఁగదు బయలు।న్నెలుకే పరిపూర్ణముగని। యెలుకేమృషయంచు నెలుక * కెలుకేమాయగా॥ ౨౬। తే.గీ। ఎన్నిత్రిప్పలనొందిన * నెలుకెగాని

యచలమేత్రిప్పల నెఱుఁగ* దరసిచూడ। భ్రాంతిమూలమై యెఱుక యే *పరఁగునట్టి। యెఱుకయే భ్రాంతిశూన్యమై * యేగుఁ దరుణి॥ ౭౭। చ। గరిమనుబూర్ణతత్త్వమును*గాంచినయట్టిమహాత్ములెంతయు। న్నెఱుకను లేనిదంచు వచి * యించిరిగావునఁ గేవలాత్మనుఁ। బరు వడిఁగాంచి నీవెఱుకఁ*బాయుము లేనిదియంచు నెప్పుడుఁ। మరలను భ్రాంతిపుట్ట దను * మానములేదిఁక మానినీమణి। ౭౮। క। ఉన్నది యిదియున్నదియిది। యున్నదియిదియనుచు నెఱిఁగి యుత్తదియెఱుకే। యన్నది తాఁగన్నది మది। నెన్నఁగనది లేదులేని* దెఱుకయెసుమ్మీ॥ ౭౯॥ క। మాయబయలందుఁ గలదని।తోయజదళనేత్రనీకుఁ* దోఁచుచు నున్నఁ। బాయకనీవిప్పుడు నా। మాయను జూపింపవలదె*మఱి బయలందుఁ। ౮౦। ఆ-వె। ఎండమావులందు * నుండునేయుద కంబు। లేకతోఁచునట్లు * లోకములును। మాయకేస్వభావ*మైగాను పించును। గాకనిక్కముగను * గలదెమాయ॥ ౮౧। క। ఉన్నది మాయయని గనిన। నున్నదికలగన్నవాని* యొప్పునఁగలమే। ల్గొన్న గతి బయలుఁగాంచిన। యన్నరునకు మాయగల్గ * దంబుజవదనా। ౮౨। ఆ-వె॥ అనుభవంబుఁగంటి * మందు రీభువిఁగొంద। అను భవంబుగలదె * యచలమందు। ననుభవంబు శూన్య * మైపోవు న్నిద్రను। నిలిచియుండవలదె * నిక్కమైన। ౮౩॥ ఉ। తానుశరీరము న్నొకటె *తథ్యమునమ్మినవచ్చుదేహముఁ। గానవశ్యమీ బయలు* గాంచియుజాగ్రత నొందిస్వప్నముఁ। మానియుఁ దాను దేహములు* మాయయటంచుఁదలంచునట్టియా।మానవుఁడెన్నికల్పములు*మాఱి నఁబుట్టునెయేజగంబునఁ। ౮౪ ఆ-వె। మాయదోఁచుచుండు* మాన వునకుభ్రాంతి। స్వప్నముగుణుగాని * జాగ్రతగునె। బయలుగాంచి మాయఁ* బాయంగఁద్రోచిన। ఘనుఁడెజాగ్రతయును * గన్నవాఁడు। ౮౫। క। తెలివిని నమ్మియు నచలముఁ। దెలియక పామరులుమాయఁ* దేలిమునుఁగుచుఁ। దెలియరుసర్వము నెఱిఁగెడు। తెలివేమాయయను చీవు * దెలియుమయల్లీ। ౮౬॥ ఆ-వె॥ రమణివినుము తెలివి * రాక పోకలచేత। దినము రాత్రికరణిఁ * దిరుగుచుండు। నట్టితెలివిచేత * నచలంబుదర్శించి। యట్టితెలివివీడ* నచలుఁడగును॥ ౮౭। క। సరసీ

జాప్తుఁడు చీఁకటి । నెఱుఁగక భాసిల్లునట్లు * నిక్కంబుగనో । తరుణీ
మణియెన్నఁటకినిఁ । బరిపూర్ణంబెఱుఁగ దీప్ర * పంచముజాడన్ ॥ ౮౮॥
ఆ-వె॥ స్వప్నమందుఁగన్న * స్వానుభవంబెల్ల । మేలుకాంచి
చూడఁ * జాలనట్లు । జగముపుట్టి పెఱిఁగి*పమయుటెల్లను । నేమిలేదు
వట్టి * దెల్లభ్రాంతి ॥ ౮౯ ॥ క॥ జీవుఁడె బ్రహ్మంబనుచును । భావిం
చినలేనిమాయ * బ్రహ్మంబగునే । జీవుఁడెభ్రాంతికి మూలము । భావిం
పఁగ బ్రహ్మమునకు * భ్రాంతియుఁగలదే॥ ౯౦॥ ఆ-వె॥ బయలు
గానలేక * బహుజన్మములనెత్తి । గట్టికుడుచుచుండు * కర్మఫలము ।
తనదుజన్మకర్మ * తాను బాయఁగలేని । జీవుఁడెట్లు తమకు * దేవుఁ
డయ్యె ॥ ౯౧॥ క॥ శివుఁడే తనువుకుమూలము । శివుఁడేగినఁ దనువు
కల్గె * జీవుండిల్లే । శివుఁడెట్లు బ్రహ్మమనఁదగు । భవనాశము లేని
బయలె*బ్రహ్మముగాకన్ ॥ ౯౨॥ ఆ-వె॥ బయలుగగనమంచుఁ* బామ
రుల్ కొందఱు । పల్కుచుందురట్లు * భ్రాంతిపడకు । చదలుబయలు
గాదు * శబ్దమేగుణము ని । శ్శబ్దమగును సార*సాక్షి బయలు ॥ ౯౩॥
క॥ బయలందె పుట్టుసర్వము । బయలందే యడఁగునంచుఁ*బల్కుదు
రజ్ఞుల్ । బయలందుఁ బుట్టగిట్టిన । బయలేపెనుమాయ యనఁగఁ* బడు
నటుగానన్ ॥ ౯౪॥ ఆ-వె॥ పుట్టుగిట్టు లేని * బట్టబయలందునఁ । బుట్టు
టెట్టుమాయ * గిట్టుటెట్లు । మాయవచ్చినట్లు * మగుడిఁ బోయిన
యట్లు । దోఁచుటెల్ల భ్రాంతి * తోయజాక్షి ॥ ౯౫॥ క॥ అనవుడు జగ
ములునిజముగఁ గనుపడుచుండంగనెట్లు*కల్లనియెంతున్ । వనజాక్షు
నాదుసందియ । మునుదీర్చు మటన్నసతికి * ముక్తిమఁ దనియెన్ ॥
౯౬॥ ఆ-వె॥ కలయస్వప్నమందు * గజములు గుఱ్ఱాలు । రథము
లొంటెలధిక * రథికవరులు । సేనలెన్న రాని*సేనాధిపతులును । నెట్లు
దోఁచెమేల్క * నెట్లుపోయె॥ ౯౭॥ చ॥ సరసిజనేత్ర యాశశ వి *
షాణముచొప్పున రజ్జుసర్పమా । కరఁశినిఁ గొయ్యతస్కరుని * కైవడి
వంధ్యతనూజుచాడ్పునన్ । దిరముగశుక్తిరౌప్యమగు । తీరునమృగ
తృష్ణనీరుగాఁ । బొరిఁబొరియేమిలేనిపరి*పూర్ణమునందునఁదోఁచువిశ్వ
మున్ ॥ ౯౮॥ ఆ-వె॥ నెలఁతవినుమునభము*నీలమైగాన్పించు । పొల్క
నరయుగగన*పుష్పమట్లు । స్వప్న సానుభవము * చందంబు మఱియు

నా। యింద్రజాలముగను * నిలయుఁదోఁచు। ౯౯। క॥ కనుపడు
సర్వముభ్రమయే। గనుఁగొన్నది భ్రమయెగాని * గా దచలంబున్।
గనుపడునదిగనుఁగొన్నది। గనుఁగొనఁగా లేనిదంచుఁ * గాంచుము
నీవున్॥ ౧౦౦। ఆ-వె। లేనిమాయఁజూచి * లేదనఁదగుఁగాని। యచల
మెపుడు లేద * నంగఁదగదు। బయలుచూడ నెందుఁ * బ్రత్యక్షమై
యుండుఁ। గానిమాయఁజూడఁ * గానఁబడునె। ౧౦౧॥ క॥ ఇక్కడ
నక్కడఁదోఁచియు। నెక్కడఁగన రాదుమాయ * నిక్కంబైనన్। ని
క్కడనక్కడనెక్కడ। నొక్కటియై యచలమట్టు * లుండఁగవలదే।
౧౦౨। ఆ-వె। పట్టిరజ్జుఁజూచి * బిట్టులుక్కుటేగాని। పరఁగఁద్రాటి
యందుఁ * బాముగలదె। భ్రమసిలేనిపోని * భ్రాంతినొందుటెగాని।
తలఁప నచలమందు * నిలయుఁగలదె। ౧౦౩। క॥ దారు నదాటునఁ
జూచియుఁ। జోరుండని భ్రమసితిరిగి * చూచిననదియున్। దారు
వగునట్టు లచలము। నారయఁగా లేనిమాయ * యగుపడ దెందున్।
౧౦౪॥ ఆ-వె। మరుమరీచికలను * మంచిజలంబని। పోయిచూడ
లేక * పోవునట్లు। భ్రాంతిచేతఁదోఁచఁ * బడువిశ్వమెల్లను। నరయ
లేకపోవు * నచలమందు। ౧౦౫। క॥ కమలాక్షీశుక్తిరజత। భ్రమఁ
జెందినశుక్తియందు * రౌప్యంబే దా। క్రమమున లేకయదోఁచిన।
భ్రమజగములు లేవుబట్ట * బయలున నెపుడున్। ౧౦౬॥ ఆ-వె। నెమ్మి
శశకమునకుఁ * గొమ్ములునున్న వే। గొడ్డురాలునకును * బిడ్డగలదె।
నాకసమునఁబుష్ప * మమరంగనుండునే। పట్టిదేమి లేని * బట్టబయ
లు। ౧౦౭। చ। ఘనముగస్వప్నమందునను * గాంచినవెల్లనునిక్క
మట్లుగాఁ। గనుపడుచుండుజాగ్రతను * గాంచినయంత నెస్వప్నమందు
నన్। దనుఁగనుఁగొన్న సర్వమును * దబ్బరయైజనునట్టులాబయల్।
గనుఁగొనిమేల్కనొందినను * గన్పడుటెట్లికస్వప్నలోకముల్। ౧౦౮।
ఆ-వె॥ జగము లెల్లనిజమె * జాగ్రతయందున। స్వప్నమందుఁగొంత *
సత్యమయ్యె। నిద్రయందుమునిఁగె * నిలయును దానును। నింకనేమిగల
దు * నీరజాక్షి। ౧౦౯॥ క॥ మెలఁకువెజాగ్రతయనినను। గలయం
దున జాగ్రతయును * గలదెట్లనినన్। గలయందునెఱుకలేకయె। కల
విధమును జెప్పఁగలదె * గాఢసుషుప్తిన్। ౧౧౦। ఆ-వె॥ జగమెసత్య

మంచు * జాగ్రతదెల్పెను । నిలయుస్వప్నమంచుఁ * గలయుఁదెల్పె। మెలఁకువయునుగలయు * మిథ్యయంచుసునిద్రఁ। దెల్పెనింకమాయ* దెలియనేది॥ ౧౧౧॥ క॥ మెలఁకువనిక్కంబైనను । గలయునునిక్కంబెగాని * కల్లనఁదగునే । మెలఁకువఁగనికలమిథ్యన । మెలఁకువయును సుషుప్తియందు * మిథ్యయగాదే॥ ౧౧౨॥ ఆ-వె॥ ఎన్నజాగరమున*నున్నంతవఱకును । సత్యముగనుదోఁచు * జాగరంబె।కలనుగాంచు తఱినిఁ * గలనిక్కమైతోఁచుఁ। గానజాగ్రతయును * గలయునొకటె॥ ౧౧౩॥ క॥ మెలఁకువనుండునుసుషుప్తియుఁ । గలయందునసుషుప్తిగలదు* గావునమేల్కన్ । గలయొక్కటిగాకున్నను । గలయునుజాగ్రతయు నేది*గాఢసుషుప్తిన్॥ ౧౧౪॥ ఆ-వె॥ నీవునన్నుఁగనుట * నేనిన్నుఁ గాంచుట । నేనుజెప్పుటయును * నీవువినుట । నీవునేనుజగము * నిఖిలంబుకలయని । దెలియుబట్టబయలు * కలయుఁగాదు॥ ౧౧౫॥ సీ॥ ఇలలోనఁదిరిపంబు * నెత్తిజీవించెడు-నెఱిపేదయొకచోట*నిమ్మళించి యంగదకోటీర * మాదిభూషాంబర - తతులెల్లఁదనమేనఁ * దాల్చినట్లు । కోమరైననొకకొల్వు*కూటంబులోరత్న-సింహాసనమున వ*సించినట్లు । హితులుమంత్రులుపురో * హితులుసేనాధిప - వందిమాగధభట * వర్గమన్య । రాజులెల్లనుసేవింప * రాజ్యమెల్ల । నేలినట్లుగఁగలగాంచి * మేలుకొనినఁ । గల్లయయ్యెనురాజ్యంబు * కొల్లవోయె । రక్షలేదాయెనెప్పటి * భిక్షగాఁడె॥ ౧౧౬॥ క॥ కలలోఁ దోఁచినసర్వము। మెలఁకువయందుననుజూడ * మిథ్యయగునటుల్। మెలఁకువనుబయలుఁగాంచినఁ । గలజగములులేకపోవుఁ*గనుఁగొనుచుండన్॥ ౧౧౭॥ ఆ-వె॥ పోదుబట్టబయలు * పోఁగొట్టవలెనన్న । రాదదిందునందు * రాఁదలంప । బహుళయత్నమునను*బ్రహ్మాదులునుబట్టి । నిల్పవలెనఁటన్న * నిలదుమాయ॥ ౧౧౮॥ క॥ సర్వముగుర్తెఱుఁగుదునని గర్వంబునఁగేవలాత్మ*గాన కలయునా। సర్వజ్ఞుకంటెమేలగు । సర్వముగుర్తెఱుఁగునట్టి * శ్వానంబరయన్॥ ౧౧౯॥ తే-గీ॥ ఉన్నదీబట్టబయలు సు * మ్మెన్నఁటికిని । నున్నదనరాదుమాయయు* నున్నగాన । జగమువెల్లనుదోఁచుట * స్వప్నభాతి । నెన్నివిధములఁ జూచిన * నేమిలేదు॥ ౧౨౦॥ చ॥ తడయకదారుగుర్తెఱుఁగఁ *

దస్కరభ్రాంతియు లేనిచొప్పునన్ । విడువకను క్త్రిగన్గొనిన * వెంటనె రౌప్యము లేనిపోలికన్ । దొడరినరజ్జునారసినఁ * దోడనెసర్పము లేని చాడ్పునన్ । గడువడిఁబూర్ణతత్వమును * గాంచినయంతనె లేదువిశ్వ మున్॥ ౧౨౧॥ తే॥ బట్టబయలం దుజగములు * పుట్టుగిట్టు । ననుట కంటెను లేదంట * ఘనముదంధ్య । సతికిసుతుఁడునుదయించి * చచ్చిపోయె। ననుటకంటెనుబుట్టలే * దనుటమేలు॥ ౧౨౨॥ క॥ జల జాతిలేనిమాయను । గలదని పిమ్మటను లేదు * కల్లనుటెల్లన్ । బలు వుగమేనన మేధ్యము । నలఁదియునదిగడిగికొన్న * యట్టివిధమగున్॥ ౧౨౩॥ ఆ-వె॥ కాన లేనిమాయ * కలయనిదలపోయఁ। గలయఁటన్న మాయ * దొలఁగిపోయె । మాయశూన్యమైన * మఱియేమి లే దాయె । యేమిలేనిబయలె * యేకమాయె॥ ౧౨౪॥ క॥ మేలఁకువ నొందినవెంటనె । కలనిలువకపోయినట్లు * గనుపడుమాయల్ । నిలు చునెయచలముఁగాంచిన। మేలఁకువయునునిద్రభంగి * మిథ్యయయి చనున్॥ ౧౨౫॥ ఆ-వె॥ ఎన్నలేనిమాయ * యెఱుకఁబాసినమీఁద । నున్నబట్టబయలు * నెన్నుటకును । నెఱుకలేకపోయె * నేమున్న దామీఁదఁ। దోఁచుచుండుటకును * జూచుటకును॥ ౧౨౬॥ ఉ॥ ఆరయవిశ్వమీబయలు * నందునఁదోఁచుచునుండలేనిదే। యూరక లేనిభ్రాంతియును* నుండినకై వడినుండుటేమనన్ । దారువునందుఁద స్కరుఁడు * త్రాటినిఁబన్నగమెండమావులన్ । వారివిధంబుగన్పడుట * వానికినెన్నస్వభావజన్యమా॥ ౧౨౭॥ క॥ పరిపూర్ణంబేశాశ్వత । మ రయంగాలేనిమాయె*యఖిలజగంబుల్ । పరిపూర్ణమందుఁదోఁచినఁ। బరికింపఁగవలయు లేని * భ్రమయదియనుచున్॥ ౧౨౮॥ సీ॥ పంచ ముద్రలుపట్టి * బాధలువడనేల - యష్టాంగయోగంబు * లవియు నేల। సాంఖ్యతారకముల* సాధింపఁగానేల * యమనస్కభావంబు * నందనేల । పరఁగనెమ్మనమును * బట్టినిల్పఁగనేల - యింద్రియాదుల గుది * యింపనేల । శాంతసూనృతములఁ* జరియింపఁగానేల.చదువు లెల్లనుమించి * చదువనేల॥ తే-గీ॥ చీఁకుఁబడి కానఁ దపములఁ * జేయనేల। సంతతంబునుజపములు * సల్పనేల । కనులుమూసినఁదెఱచి నఁ *. గానఁబడుచు । నచలమేసాధనము లేక * యలరుచుండ॥ ౧౨౯॥

సీ॥ బూటకవేషముల్ * పొట్టకూటికెగాని - పొందుగాముక్తికె *
ప్పుడునుగావు । ముద్రలన్నియుదేహ * మునకవస్థకెగాని - మొనయ
జన్మవినాశ * మునకుగావు। అఖిలయోగంబులు * నలజడికేగాని -
కర్మరాహిత్యసం * గతికిఁగావు । బహుమహత్వంబులు * ప్రజలమె
ప్పుకెగాని - యారయజన్మశూ * న్యతకుఁగావు॥ సాంఖ్యమును
దారకామన * స్కంబులాది । త్రిప్పలకుఁగానిజన్మసి * ద్ధికినిఁగావు ।
మొదలు కర్మలుభవనాశ * ములకెగాని । కోరితమ్మును దరియించు*
కొఱకుఁగావు॥ ౧౩౦॥ తే.గీ॥ అవనిబూరుగు ఫలముల * కాశఁజేసి।
పక్షులునుగాని నిష్ఫలం * బందినట్లు । నిజముఁగానక బహుమాయ*
నిష్ఠలందుఁ । బరఁగుచుండుట నిష్ఫలం * బగునుగాదె॥ ౧౩౧॥ క॥
అనలంబెగాని నిఖిలం । బును నెద్దిదహింపలేని * పోలికమాయన్ । జనఁ
జేయునచలభావం।బునుగాక యయన్య మొకటి*పుడమింగలదే॥ ౧౩౨॥
క॥ నేనను నహమువహించిన । మానవులకు నెల్లనిక్క * మైతోఁచు
నిలన్ । నేననునహమే మాయగఁ । గానెడు వాఁడెల్లమిథ్య * గాభా
వించున్॥ ౧౩౩॥ క॥ నీవును నేనే లోకము । నీవును నే లేకయున్న *
నిర్లోకమగున్ । గావున లేకయదోఁచిన। యీవును నేలేదుసుమ్మి* యీ
బయలందున్॥ ౧౩౪॥ ఆ.వె॥ నీవు నేననియెడు * నీవిశ్వమాయను। లేని
దంచుభ్రాంతి * మానినపుడె । ప్రతియు లేనిబట్ట * బయలన్న నేకమై ।
యుండుదానినెఱుఁగ * నొందు లేక॥ ౧౩౫॥ క॥ సర్వముతానని చూ
చిన । సర్వంబును దనకుఁదానె * సత్యంబగు నా । సర్వంబుతాను
మిథ్యయె।సర్వంబునుగానిబయలు* జాడనుగనినన్॥ ౧౩౬-ఎ॥ ఆ.వె॥
ఎప్పుడైనఁజూచి * యెఱుఁగకయుండిన । హరినిఁ గలనుగాంచి*హస్తి
మడియు । కరణినెఱుక యనెడు * కలలోన నచలంబుఁ । గన్నయపుడె
మాయ* గతమునొందు॥ ౧౩౬-బి॥ క॥ తోయజమిత్రునిఁ బొడఁగని ।
యేయెడలన్ లేకతిమిర * మేగినయటుల । న్నాయచలము సేవిం
చిన। మాయే తానిల్వకేగు * మటుమాయముగన్॥ ౧౩౬-సి॥ తే గీ॥
అన్నమునుదిన్న నాఁకలి*యడఁగినట్లు। తృష్ణ యుదకంబుఁగ్రోలినఁ *
దీఱుభంగి । బయలుఁజూపించి శిష్యుని * భ్రాంతిమాన్పు ।
గురుఁడె దైవంబు పరుఁడు నా * గురుఁడె గురుఁడు॥ ౧౩౬-డి॥

క॥ పరిపరి మాయలచేతను । బరిపూర్ణం బెఱుఁగలేక * భ్రమగొని
తామే । దరియింప లేనిగురువులు । పరులను గడతేర్పఁగలరె భ్రాంతి
యగాకన్॥ ౧౩౫-౬॥ ఆ-వె॥ గురుఁడు శిష్యునకును * గుర్తుగాఁ గను
పించి । బయలుబ్రహ్మమంచుఁ * బరఁగఁజూపి । మాయశూన్యమైన *
మార్గంబుఁదెల్పక । భ్రాంతివీడఁగలదె * బ్రహ్మకైన॥ ౧౩౭॥ క॥ బట్ట
బయలనుచు బ్రహ్మము । గుట్టెఱిఁగిన వాఁడెగురుఁడు * గురువులకెల్ల ।
న్నట్టిఘన మర్మమెఱుఁగక । పొట్టకునై దిరుగువాఁడు * భువిగురుఁ
డగునే॥ ౧౩౮॥ ఆ-వె॥ కేవలాత్మగుర్తు * భావింపవేత్తకు । నిలయుఁటన్న
గుర్తు * నేమిలేదు । మాయజనులకెల్ల * మాయవిశ్వమె గుర్తు ।
కోరి చూడబయలు * గుర్తులేదు॥ ౧౩౯॥ క॥ గురుఁడని శిష్యుండని
యీ । యెఱుకనుగలఁదోఁచియచల * మెఱిఁగించితుద । న్నెఱుకను దెరఁ
దోలఁగించిన । గురుఁడేడీ శిష్యుడేడి * గుర్తేదింకన్॥ ౧౪౦॥ తే-గీ॥
బట్టబయలందు గురుశిష్య * భావములును । నేకమైనను గురుశిష్యు *
లెవరులేరు । కర్పూరాగ్నులు వేర్వేఱఁ * గానుపించి । యేకమైరెండు
లేక ల * యించినట్లు॥ ౧౪౧॥ క॥ అనలంబువొడమి దారునఁ । దన
రంగా దానిఁగాల్చి * తాఁజెడినగతిన్ । దనువందు జ్ఞానవహ్నియుఁ ।
దనువునుదగ్ధంబుఁజేసి * తానునుసమయున్॥ ౧౪౨॥ తే-గీ॥ జ్ఞాన మ
జ్ఞానములునాది * లేనిబయలు । దెలియ కేజ్ఞాని నేనంచుఁ * దిరుగనేల ।
యచలభావంబు నొందిన * యట్టివాఁడు । జ్ఞానియును గాఁడు నరయన *
జ్ఞానిగాఁడు॥ ౧౪౩॥ చ॥ పరమపదంబుగానకను * భ్రాంతినివీడకయున్న
మానవుల్ । సరవిసుషుప్తి నుండియును * జాగ్రత యేగతివచ్చునా
గతిన్ । బొరిఁబొరిచావుపుట్టువులఁ * బొందుచునుండుదురట్టిగోష్య
మున్ । మరణమురాకమున్నెఱుఁగు * మాన్యులెధన్యులుజన్మశూన్యు
లున్॥ తే-గీ॥ దేవుఁడే లేఁడటంచును * దెలివిలేని । పామరులుకొంద
అందురు * పాటిదప్పి । పరఁగసర్వంబు మిథ్యయై * బ్రహ్మమెందు । నిండి
నిబిడీకృతంబునై * నెగడుచుండ॥ ౧౪౪॥ ఆ-వె॥ బ్రహ్మమేడి మా
కుఁ * బట్టిచూపుఁడియంచుఁ । బరఁగఁ గొందఱంద్రు * పట్టిచూపు । నది
యునెల్లమాయ * యగుఁగేవలాత్మను । బట్టిచూపవశమె * బ్రహ్మకైన ।
౧౪౫॥ ఉ॥ కాయముతోడ స్వప్నమునఁ * గన్పడు దేవుఁడఁటంద్రు

కొందఱుర్ । గాయము రాకపోకలును * గల్గినమాయయు దేవుఁ డెట్లు గుర్ । మాయనెఱుంగ శెప్పుడొక * మాడ్కిని నాబయలుండఁ గాన కా । మాయను నమ్ము వారలకు * మాటికి సమ్మతిమాయమాటలుర్ ॥ ౧౪౭॥ ఆ-వె॥ తమకుఁగల దఁటంచు * దైవంబునకు మేను । గలదఁ టంచు నెట్లు * దలఁపవచ్చు । దనువులెల్లఁగర్మ * తంత్రంబు చేశయ్యె । దైవమునకుఁగర్మ * తనువుగలదె॥ ౧౪౮॥ చ॥ కనుఁగొన బ్రహ్మకైన మఱి*గానఁగ రాకయె యుండ దేవుఁడుర్ । గనుఁపడు నెట్లు మర్త్యులకుఁ గన్పడెనేనియు లోకమేటికం । చని యిటుకొంద అందు రిలఁ నజ్ఞులె ఱుంగని కారణంబునర్ । ఘనముఁగ బూర్ణతత్వమును * గాంచినవారికి లోకమున్నదే॥ ౧౪౯॥ క॥ తనువలచినదే రంభగ । ఘనముగఁదా మునిఁగినదియె * గంగగలోకం। బున ఘనము నెంచరల్పులు । గనుఁ గొని నీచస్వభావ * క్రౌంచముల ట్టుల్ ॥౧౫౦॥ వ॥ అదియెట్లనిన॥ సీ॥ ఒక్కెడ నంచల * నొకకొన్ని ట్టిఁగని బ - కంబులిట్లని వానిఁ * గదసి పల్కె । నెవరొ కాళ్లుమొగంబు * లెఱ్ఱనమీనివా - సంబెద్దియటవిశే * షంబు లెవ్వి । నఁగను నంచలముమా* నససరోవరమున్కి - కమ నీయ రత్నముల్ * గలవనినను । నత్తలోనావుడు * నవియెఱుంగ మఁటన్న - నత్తలుశూన్యమై * నట్టికొలను॥ తే-గీ॥ పర్ణవర్జితమైనట్టి* పాదపంబు । కరణిఁదలపోసి చూడంగ * గాదెయహహా । యంచున వ్వంగ సాగెను * గొంచలెల్ల । నట్లునిజమును దూషించి * నరులు వారి। వారి మతము లె హెచ్చని * వాదుకొంద్రు॥౧౫౧॥ ఆ-వె॥ అ జునకైన హరున*కైనను హరికైన। సురలకైన ధరణి*నరులకైన। గురుఁ డు లేక దెలియఁ*గూడు నే బ్రహ్మంబు। దెల్ప నెవరికైనఁ*దెలియుఁగాక॥ ౧౫౨॥ క॥ పరిపూర్ణమెఱిఁగి యెఱుకను । సరిపుచ్చిన వేత్తవేత్త * జాడ నెఱుంగుర్ ।గుఱుతేమియితరజనులకు। నరయంగానాతఁడుండు* నందఱివలెనే॥ ౧౫౩॥ ఉ॥ పుట్టువు గిట్టుకర్మమును * బొందఁడు చెం దఁడు నామరూపముల్ । గట్టిగ దేవుఁ డెవ్వరికిఁ * గానఁగ రాఁడను లోక సామ్యముర్ । వట్టిదిగాదు సర్వమును * వర్జితమైన దె కేవలాత్మయిా। గుట్టునెఱుంగ రాదు గురు*గోప్యముగావున నెంత వారికిర్ ॥౧౫౪॥క॥ ఎన్నెన్ని చిత్రములకును। నున్నది నేనను చుమాయ*యుత్తరిబయలే।

యున్నదనిజాడఁదెలిసిన। నన్నిఁటికినిమూలమైన * యది శూన్యమగుఁ౯॥ ౧౫౫॥ చ॥ కరిగతిరూప మారయఁగఁ * గన్పడుచున్నను భ్రాంతి జన్యమై। కరియునుగల్పితంబనుచుఁ గాంచినదారువుసత్యమైనయా। కరణినివిశ్వరూపమును * గల్పితమంచుఁదలంచిసర్వముఁ౯। నిరతము పూర్ణతత్వమిది * నిక్కమటంచును గాంచఁగాదగుఁ౯॥ ౧౫౬॥ క॥ ఎఱుకజగంబులు మిథ్యగఁ। బరిపూర్ణం బెఱిఁగి యెఱుకఁ * బాసిన మీఁద। న్నెఱుకేది యెఱుకజాలం। బెఱుకతో సరిపోయెమాయ * యేమున్నదిఁక౯॥ ౧౫౭॥ ఆ-వె॥ రూపునామక్రియలు * రూఢిగా లేనిది। కేవలాత్మయంచుఁ గీలెఱింగి। నామరూపక్రియలు * నఖిలంబు మాయగ। నెఱిఁగినపుడె భ్రాంతి * నిరసనంబు॥ ౧౫౮॥ చ॥ తిరముగనామరూపములు * దేవునకెన్నఁడు లేవఁటంచు నే। నెఱిఁగియు రూపనామములు * నెల్లనశించు నఁటంచు నెంచుచు। న్నరుదుగనామ రూపముల * యందునభ్రాంతినిఁ జెందుపామరుల్। ధరఁ బరిపూర్ణ మున్నదని * తాము నెఱుంగరు మాయదక్కఁగ౯॥ ౧౫౯॥ తే-గీ॥ తా మెఱుంగనివోపాన * దైవమిలను। నెవ్వరికిఁ గానరాఁడని * నెంతురెల్ల। గురుఁడుసూచింపబ్రహ్మంబు * మఱుఁగు లేక। గానఁబడుచుండునిఖిలంబు * కల్లయగుచు॥ ౧౬౦॥ క॥ వినియెయొరులు సెప్పబయలని। గని యునుగనలేరుమాయ * గప్పియుజనముల్। వినివినియును జెవుడ య్యెను। గనికనియును గ్రుడ్డియయ్యెఁ * గానరుదీని౯॥ ౧౬౧॥ ఆ-వె॥ సత్యమైనబయలు * జాడనుగానక। దబ్బరైనమాయఁ * దగులు కొనియు। మాయతోడఁ జచ్చి * మాయతోఁ బుట్టుచు। మాయఁ గానలేరు * మాయనరులు॥ ౧౬౨॥ క॥ సత్యంబు ముష్టిపండు న। సత్యంబందఱికి రుచియుఁ * జక్కెరభంగి౯। సత్యంబుజనవిరోధ మ। సత్యము జనరంజకంబు * సత్యంబిదియుఁ౯॥ ౧౬౩॥ ఆ-వె॥ ఇంతినీవు నింక * నేమాయ లేదని। ప్రతియు లేనిబట్టబయలుఁ గాంచి। భ్రమను ద్రొబ్బఁజేయ * భవనాశములదిర్గు। నావమునిఁగిపోవు * నచల వార్ధి॥ ౧౬౪॥ క॥ ఎన్నివిధంబులఁ జెప్పిన। నున్నది యీబట్టబయలు * నొక్కటెయొందుఁ౯। సున్నని దెలియుము విశ్వం। బెన్నఁటికిని భ్రాంతి పుట్ట * నేరదునీకుఁ౯॥ ౧౬౫॥ తే-గీ॥ స్వప్నమందునఁ దోఁచిన *

చందమునను । లేనిదే జగంబున్నట్లు * గానఁబడును। గాననఖిలంబు
భ్రమయని * గాంచిమాయ । భ్రాంతిపిడినసర్వంబు * బట్టబయలు॥
౧౬౬॥ చ॥ నెలవుగ నెండమావులను * నీళ్లనులేక యెఱుంగఁబిమ్మ
టన్ ।జలములపోల్కిఁదోఁచినను * సత్యముగాదనిచూచుకైవడిన్।
వెలయఁగఁబూర్ణతత్వమున * విశ్వములేదని నిశ్చయించియున్। గల
వలెలోకజాలములు* గన్పడుచున్ననునమ్మరార్యులున్ ॥౧౬౭॥ఆ-వె॥
భ్రమసిలేకతోఁచు * భ్రాంతియున్నదియంచుఁ । బల్కరాదుబట్ట *
బయలునందు । నేమిపుట్టుచున్న * దేమిపెంపగుచున్న । దేమిపోవు
చున్న * దేమిలేదు॥ ౧౬౮॥ ఆ-వె॥ లేనిమాయయెందు * లేదని
చూచిన।నున్నదేమిలేని*యుత్తబయలె । బయలునున్నదన్న *భ్రాంతి
యులేదాయె । భ్రాంతిలేనిబయలె * బ్రహ్మమాయె॥౧౬౯॥ సీ॥ పరమ
రహస్యమే * బట్టబయలనియు - సూక్ష్మంబులోననే * మోక్షమని
యు । వచియించుపెద్దల * వాక్యమేసత్యంబు - గానియేసాధనల్*
గాదుతలఁప । సాగరంబులుదాఁటి *చనుదెంచుటయుఁగాదు - కొండ
లుతలకెత్తి * కొనుటగాదు ; భూమిలోనికిఁజొచ్చి * పోవుటయును
గాదు - అంబరంబునకెక్కు * టదియుఁగాదు ॥ ఇంకనేకష్టములును
గా * దెవ్వరైనఁ । బరమగురుమూర్తికరుణను * బడసిరేని । పరమ
గుహ్యమైనట్టియీ * బట్టబయలు । సూక్ష్మముననుండునదిమోక్ష*
సూచనరయ॥ ౧౭౦॥ క॥ లయమైన సర్వజగములు । బయలుండు
నఁటంచుఁదెలిసి * బ్రహ్మాదిసురల్ । బయలునకు మ్రొక్కుచుందురు।
బయలేప్రత్యక్షమైన * బ్రహ్మంబనుచున్॥ ౧౭౧॥ తే-గీ॥ ఎఱుకచేత
నుగల్గునీ * రేడుజగము। లకును కర్తయహానదియునె*ఱుకయెగాని।
అచలమనరాదుకర్తయు*నచలమునకు।మొదలెకర్తృత్వభోక్తృత్వ*
ములునులేవు॥ ౧౭౨॥ క॥ లక్షితలక్ష్యాలక్ష్యవి । లక్షణమగుబట్ట
బయల*లఘుగురుకృపచే । లక్షులుగనిశాస్త్రంబులు । లక్షింతురుకర్మ
విదులు * లయమగుమాయన్॥ ౧౭౩॥ క॥ మనమునునిల్పినదా
కను।నవుగ మోక్షంబులేదఁ * టందురుయోగుల్ । మనమెట్లుతా
మునిల్పిరో । మనమును నిల్పంగవశమె * మహినెవ్వరికిన్॥ ౧౭౪॥
తే-గీ॥ గగనభాగంబుగాలినిఁ *గలసిమనము। నాయెదానికిఁజలనంబు*

నణఁగు లెట్లు। బయలునందునిల్పుటె భంగిమనము । నినుని చెంగటఁ దిమిరంబు * నిలువఁగలదె॥ ౧౭౫॥ సీ॥ ఈయుత్తబట్టబై * లేమియు లేదని-ద్వాదశాక్షరినాత్మఁ * దలఁపవలయుఁ। గొమ్మమూలము లేని* గుఱ్ఱెఱింగెడు కాయ - మేమి లేనిపదాఱు*నెన్నవలయుఁ। గలలోనఁ దోఁచిన * కాయమేలాగో యా-లాగెపంచదశాక్ష * రనఁగవలయు। మఱువకఋ మూఁడు * మంత్రముల్ నిరతంబు - పఠియించి వానితా* త్పర్యములను । దెలిసిమూలంబు లేనిదీ * దేహమనుచు । భ్రాంతిపీఠి యుపర్వంబు * బయలఁటంచు। నెఱిఁగియెంతయు నెఱిఁగిన * యెఱుక విడుచు। నట్టివారలె యశరీరు * లనఁగవలయు॥ ౧౭౬। ఆ-వె॥ నెలఁత వినుమయింక * నీస్వస్వరూపంబు। బట్టబయలుగాని * భ్రాంతిచేత। వెలయఁదోఁచుచుండు*విశ్వరూపంబైన। మాయనీవుగావు * మధుర వాణి। ౧౭౭। క। పరిపూర్ణంబె నేనని। యెఱిఁగియు నీదేహమాత్మ* యేఁగాననుచుఁ। బరికింపుము నీకన్యము। మఱియేమియు లేదఖిలము* మాయతలంపుఁ। ఆ-వె। భ్రాంతి లేనిబట్ట * బయలైననీకును । బ్రాణమరయ లేదు* బ్రతుకు లేదు। బ్రతుకు లేనినీకుఁ* బరఁగఁజావును లేదు। చావు లేనినీకు * జన్మ లేదు। ౧౭౯। క। జననంబు లేనినీకును। మనమాత్మ యుఁగల్గ దెఱుక*మఱపులు దేహం। బును లేదు కష్టసుఖముల। యనుభవమును గల్గ దెఱుఁగ *వఖిలము నీవుఁ॥ ౧౮౦॥ ఆ-వె। దేహియుండెనేని* దేహంబునుండును। దేహముండెనేని * తెల్వియుండుఁ। దెల్వియుండెనేని* తిరిగిచావునునుండుఁ। జావుగలుగెనేని * జన్మముండు। ౧౮౧॥ క॥ ఏమియుఁగాకయు బయలును। నేమియునన రాకయుండు * నీయం దెపుడు। న్నే మేమి పుట్టుచున్నదో। యే మేమియు నాశమౌనో * యెఱుఁగవు నీవుఁ। ౧౮౨। ఆ-వె॥ ఎఱుక నేనటంచు * నెన్నకుమెఱుక చే। నెఱిఁగి కేవలాత్మ*యేయటంచు । నెఱుఁగు నెఱుక నాకు * గురుదక్షిణగనిప్పు । డిమ్ముతడవు లేక * యిందువదన। ౧౮౩। క। గురునకు నొసఁగిన యెఱుకను । మఱలను గైకొనఁగఁబోకు * మదియే దలఁపుఁ। గురుద్రోహమంచుఁ దెలియుము । యెఱుకను సరిపుచ్చిపిదప * నెఱుకై యున్నఁ। ౧౮౪॥ ఆ-వె॥ కలనువట్టిదంచుఁ * గాంచినమీఁదట । ననుభవములుదబ్బ*రైనయట్టు। లెఱుక లేనిదంచు * నెఱిఁగినపిమ్మట।

నెఱుకచేష్టలెల్ల * నిక్కమగునె॥ ౧౮౪॥ క॥ ఎఱుకనుజాలము
మృషయని। యెఱుఁగకనిక్కంబుగాఁగ*నెంచెదరజ్ఞుల్ । ఎఱుకనఁగ
మాయగావున । నెఱుకెప్పుడులేనిదంచు * నెంచుమునీవుః॥౧౮౫॥
తే-గీ॥ పరగఁగొందఱుపరిపూర్ణ * భావమెఱిఁగి। యెఱుకవిడువకయే
యుందు * రెప్పటట్టు । లెఱుకవిడువకపరిపూర్ణ * మెఱిఁగియున్న।
నేమికార్యంబు వారలు * నెఱుకవారె॥ ౧౮౬॥ క॥ ఎఱుకనఁగస్వ
ప్నమంచును । నెఱిఁగిప్రవర్తించునదియె యెఱుకవిడుచుటొ। నెఱుక
పను లెల్లనిజమని । గుఱుతెఱుఁగు టెయెఱుకవిడువ * కుండుటయర
యఃః॥ ౧౮౭॥ సీ॥ కలలోనఁదోఁచిన * కాయంబులకును నీ-తనువు
లకునునెచ్చు * తగ్గుగలదె । వానినెవ్వరుగొంచు * వచ్చిరిమఱల
ను - నెవ్వరుగొనిపోయి * రేమిలేదు । తమకుఁదామేవచ్చి * తమకుఁ
దామేదోఁచి - తమకుఁదామే లేమ * దలఁచిచూడ । నిజముగారా
లేదు * నిజముగాఁబోలేదు- సర్వంబుభ్రాంతిచే * సంభవించె॥ గాన
నీకును దేహంబు * గానియెఱుక । గానియింద్రియములుగాని * గల
వఁటంచు । నెన్నఁడైననుభ్రమఁజెంది * యెంచవలవ। దట్టులెంచుటెస్వ
ప్నంబు * నగుఁదలంప॥ ౧౮౯॥ ఉ॥ కొందలపందనేలయికఁ * గో
మలిచించినవెన్కపత్రము । న్నెందుననున్నబాధ్యనకు * నేమిభయం
బును లేనిపోలికః । ముందుగురూక్తిచే నెఱుక * మూలముద్రుంచిన
వాఁడుజన్మముః । బొందెదనంచుసందియముఁ * బొందునెయెందున
నైననెన్నఁడుః॥ ౧౯౦॥ ఆ-వె॥ తానునుండుటయును దానులేకుం
డుట । నవనిఁదనదువర్త * నంబులాది। లేనికలయటంచుఁ * గానక
కలనుండు । మనుజుఁడొందుజనన * మరణములను॥ ౧౯౧॥ క॥
కలయందెపుట్టిపెరుఁగును । గలయందేయనుభవించుఁ * గష్టసుఖం
బుల్ । కలయందెనాశమొందును । గలఁబాసినజన్మమేది * కలయే
దింకః॥ ౧౯౨॥ సీ॥ కలలోనఁదాఁబుణ్య * కథలెల్లవిన్నట్లు - వివిధ
తీర్థములుసే * వించినట్లు । యజ్ఞాదివ్రతముల * నాచరించినయట్లు -
చెలఁగిదానములెల్లఁ * జేసినట్లు । సకలసత్పుణ్యముల్ * సల్పియుస్వ
ర్గాది - భోగంబులనుదాను * బొందినట్లు। తిరిగిపుట్టియనేక*నరులఁ
జంపినయట్లు - మించియన్యలతోర * మించినట్లు॥ తే-గీ॥ కోరిపర

విత్తములుచాలఁ * గొన్నమాడ్కి । నఖిలపాపంబులొనరించి * నరక
లోక । మనుభవించిన యట్లుండి * మగుడిమేల్కి । వడసి చూడంగ
సర్వంబు * వట్టిదయ్యె॥ ౧౯౩॥ క॥ కలయేసత్కర్మంబును । కల
యే దుష్కర్మమగును* గావుననెఱుకే। కలయనిమేల్కొనువారికిఁ।
గలయనుభవమెట్లుదోఁచుఁ* గలదామీఁదన్॥ ౧౯౪॥ ఆ-వె॥ ఎఱుక
యున్నవఱకు * మఱపును నుండును । మఱపు గలుగువఱకు *
నెఱుకయుండు । నెఱుకయనెడుజ్ఞప్తి * యెప్పుడుదోఁచిన । నది
యు లేనిదంచు* నరయుమీవు॥ ౧౯౫॥ క॥ కలలేనిదిజాగ్రతయును।
గలదని భావించువాఁడె* కలమనుజుండున్ । గలవంటిదెజాగ్రతయ
ని । దలపోసినయతఁడె కలను * దాఁటినఘనుఁడౌ॥ ౧౯౬॥ క॥
కలదనిచూడకుమెఱుకను । గలదనిచేయకుమయెట్టి * కార్యములిల
యున్ । గలదనిదలఁచకుసర్వము । కలయనిభావింపజన్మ * గలుగదు
నీకున్॥ ౧౯౭॥ సీ॥ ఎఱుకయేస్వప్నమౌ * యెఱుకయేజాగ్రత -
యెఱుకలేకున్నను * నేమిలేదు । స్వప్నంబుచిన్నయు * బద్ధంబుసర్వ
ప్ర- పంచంబుపెద్దయ * బద్ధమయ్యె । జాగరంబునులేదు *స్వప్నమే
మియులేదు - నిద్రఁబోవుటలేదు * నిర్ణయములు । సేయుటయును
లేదు * చిత్తవృత్తియెగాని - యంటవింటయుఁగంట * తింటలేదు॥
తే.గీ॥ బంధమోక్షంబులును లేదు * భవము లేదు । నాశములులేదు
సంసార * నటనగల్గ । దరయనెఱుకయున్గలలోన * నచలమనెడు ।
జాగ్రతనుగన్నయశరీర * జన్మలకును॥ ౧౯౮॥ క॥ వేదాంతమనఁగ
నేమని । వాదింతురుకొందఱెపుడు * వసుధనలచతు। ర్వేదాతీతంబ
గుటను । వేదాంతంబనుచుబుధులు * వీక్షింతురొగిన్॥ ౧౯౯॥ క॥
వీక్షించికాంక్షనందని । నిక్షేపమునైనరోయ * నేర్తురుమూఢుల్ ।
ద్రాక్షఫలంబులుదినుట క॥ వేక్షించినజంబుకంబు* విధముదలంపన్॥
౨౦౦॥ వ॥ అదియెట్టిదనిన॥ సీ॥ నక్కయొక్కటిమూఁడు * నాళ్ల
కాహారంబు - చిక్కకనాఁకట * సొక్కుచునుచు । నటగోస్తనీలత *
లల్లిబిల్లిగనల్లి - పండికై వ్రాలిన * ఫలములరసి । యాఫలంబులుదిం
దు * ననిహర్షమునవాని - నందుకోఁబోనవి * యందకున్న। నపుడు
తానెన్నియ * త్నములుగావించిన - నవి లభింపమిఁజేసి * యాత్మ

విసిగి। తే.గీ। పరఁగనీపండ్లుదిన్ననా * పండ్లుపులియు । నంచునొక
సొద్దుపైఁబెట్టి * యరిగెనట్టు । లచలభావంబులోకులు * నంద లేని।
కతనఁజుల్కఁగఁజూతురు * గాదెజగతి॥ ౨౦౧॥ చ॥ జననవినాశశూన్య
మును*సర్వమునిండినపూర్ణభావముల్ । ఘనముఖులాత్మ మెచ్చెదరు*
గాకనునల్పులు మెచ్చనేర్తురే । వనజవిరోధి రాకకును* వారిధులే చెల
రేగుఁగూపముల్ । దొనలుకొలంకులేఱులును * దుచ్ఛపుఁగాల్వలుఁ
బొంగనేర్చునే॥౨౦౨॥ చ॥ హరికరికుంభముల్ చిదుప * నాటవిరాలిన
దంతమౌక్తికా । లెఱుకలుగూర్చి పేరులుగ* నెంతయుఁదాల్తురుశుక్తి
ముత్యము । ల్లెఱుఁగరువానివీనికిని * నింతకుఁగల్గినతారతమ్యముల్ ।
సొరిదినిజస్వభావమును * సూనృతభావముఁగానలేరొగిన్ ॥ ౨౦౩॥
తే.గీ॥ అరయనేభ్రాంతి లేనిదీ*యచలమార్గ । మునకుమించిన దే
లోక * మునను లేదు । నిదురవచ్చెడివఱకును * నీవుచచ్చు । వఱకు
దీనినినీమది * మఱవకుండు॥ ౨౦౪॥ క॥ ఏవంకమనముపాఱిన । నా
వంకకునింద్రియంబు * లన్నియునేగున్ । గావునసద్గోష్ఠినిమన। సేవిధ
మునసైనఁజొరఁగఁ * జేయఁగవలయున్ ॥ ౨౦౫॥ క॥ ఇదియేపరమ
రహస్యం । బిదిసత్యమునమ్ముసంశ * యింపకుమికనా । హృదయము
న నింతకంటెను । గుదురగుమార్గంబు లేదు * గురుసాక్షిసతీ॥ ౨౦౬॥
ఆ.వె॥ ఇదియుబ్రహ్మవలన * నెఱిఁగెవసిష్ఠుండు । అతనివలనజనకుఁ *
డతనివలన । శుకుఁడుశుకునివలన * సొరదిసాందీపులు । గనియెనతని
వలనఁ * గంటినేను॥ ౨౦౭॥ క॥ పరిపూర్ణ మెఱుఁగమునులకు । సుర
లకుదుర్లభమునీకు * సూటిపఱచితిన్ । నర నృగు దూర్వాసులకును।
దిరముగనుద్ధవునకేను * దెల్పితినిదియున్॥ ౨౦౮॥ ఆ.వె॥ పరమపద
మునందు * భ్రమయందఱికిఁగల । దందుఁజేరవశమె*యందఱికినిఁ ।
గలయనచలగురుని * కరుణకన్యంబగు । వాంఛ లేకయుండు * వారు
దక్క॥ ౨౦౯॥ శా॥ ఏమార్గంబులుదొంగత్రోవలరయన్ * హేయం
బులౌవానిచే। సామాన్యంబగుఁదప్పిపోవుభవముల్ * సంకెళ్లగా నే
ర్పడున్ । రామాదీనినినమ్మిజన్మమునకున్*రా రెవ్వరున్ గావున। న్నే
మార్గంబులుసాటిగావుధరలో*సీరాజమార్గంబుతోన్ ।౨౧౦।ఆ.వె।
అనుచుఁదెల్పుశౌరి * యదుగుదమ్ములకును । ప్రొక్కిహస్తములను*

మొగిచినిలిచి। కాంతరుక్మిణియును * ఘనమైనభక్తితో। దేవదేవు
సన్ను * తించెనిట్లు॥ ౨౧౧॥ దండకము॥ శ్రీవాసుదేవాయచింతస్వభా
వాపరబ్రహ్మా నిష్కామసర్వేంద్రియాతీతసంసార తాపత్రయాభంగని
స్సంగనిర్మోహనిష్కర్మ నిత్యాత్మభక్తాంబుజవ్రాత మార్తాండసర్వప్ర
భూతాంతరాత్మాచిదాత్మాపరాత్మా పరంజ్యోతిరూపాపరేశాపరంధా
మసద్రూపచిద్రూప లక్ష్మీవిలక్షాక్ష రాండాండ పిండాండ బ్రహ్మాండ
భాండోదరా సర్వసంపూర్ణ సర్వజ్ఞసర్వేశసర్వోత్తమా సత్యసంకల్ప
సద్వేదవేదాంత సిద్ధాంతశ్రీశౌనకాగస్త్యకౌండిన్యమైత్రేయవాసిష్ఠ
వాల్మీకికణ్వాత్రి గార్గేయ శ్రీనారద వ్యాస శ్రీవత్స మార్కండ
మాండవ్య శాండిల్య నానామునిస్తోమ హృత్పద్మ సంధానరూపా
నిరాకారనిర్వేద్య నీరంధ్రనిర్బంధ నిర్ముక్తనిష్కార్య మానావమా
నావిహీనాత్మతద్భూతపంచ ప్రపంచాది శూన్యాభవన్నాశహీనాపరః
కేవలాత్మాభవద్దివ్యరూపంబవాచ్యంబవేద్యంబసాధ్యంబచోద్యంబ
భేద్యంబబాధ్యంబబోధ్యంబవిశ్వంబరూపంబనంతంబచింత్యం
బవర్ణంబనాకారమాద్యంతరాహిత్యమైయొప్పు నీరూపుబ్రహ్మాదిదేవేం
ద్రబృందారకుల్ గూడఁగీర్తింపలేరయ్య నీమూర్తిఁగీర్తింపనేనెంతదాన
న్భవద్దివ్యమౌనసత్కృపా వీక్షణముం జేసినీస్వస్వరూపంబు నాస్వస్వరూ
పంబుగాఁగంటి మేల్కాంటిస్వప్నాభవిశ్వాది భ్రాంతుల్ సమస్తంబున
న్బాసిపోనయ్యె నేవేళనుఁ నొక్కరీతిఁగనఁ నిర్గుణంబెందు నేకంబు
గానుండు నీబట్టబైలందు నేభ్రాంతియుఁ లేదు నాస్వస్వరూపంబు
పూర్ణాచలంబౌటనేఁగంటినాకల్మషాల్ పాటెనాశంకయుఁ దీరెనా
భ్రాంతిపోకారెనాయిష్టమొప్పారెనానోముప్రాప్తించెనాజన్మమిూదే
రెధన్యత్వముఁ గంటిసుంతైననాకుఁ గొఱంతేమియుఁ లేదు శ్రీకృ
ష్ణదేవానమస్తే నమస్తే నమస్తేనమః॥ ౨౧౨॥ క॥ అనియిట్లువేఁ
డుసతిఁగని। వనజోదరుఁడప్పుడధిక*వాత్సల్యమునఁ । వనజాక్షిని
దీవెంచెను। మనమలరఁగజన్మరహిత*మగునీకనుచుఁ॥ ౨౧౩॥ తే.గీ॥
దీవనయుఁగాంచిరుక్మిణీ * దేవిచక్రి। పాదసేవయొనర్చుచు * భక్తి
పదముఁ। దెలియగురుశిష్యధర్మంబుఁ* దెల్పుమనిన। నింతిఁగనుఁగొని
కంసారి*యిట్టులనియె॥ ౨౧౪॥ చ॥ గురుఁడరుదేరమ్రొక్కకయె* గూరు

చునుండఁగరాదు శిష్యుఁడుఁ । గురుండును దాను నేకముగఁ * గూడి
పరుండఁగరాదు శయ్యపై॥ గురునకుమున్ను తాను గను * గూర్కఁగ
రాదుభుజింపరాదుపో । గుఱియునుదప్పరాదితర * గుర్వులఁజేరఁగ
రాదుభక్తుఁడుఁ॥ ౨౧౫। చ॥ పరమునుజూపునాగురుఁడు * బంధుగుఁ
డైనహితుండునైనఁదా । నరయగఁదన్ముఁడైనఁదన * నందనుఁడైనమతం
గుఁడైనఁబో । నరసఖసోదరాత్మజులు * నాకనునీచుఁడునాఁగ నలక్ష్య
ముంచకఁ । గురుఁడెపరాత్పరుండనుచుఁ * గొల్వకముక్తుఁడుగాఁడు
భక్తుఁడుఁ । ౨౧౬। ఆ-వె। జననియు జనకుండు * సకలబుణంబులు ।
పరముఁగన్నయపుడె * పాసిపోవు । నట్టిపరముఁదెల్పు * నట్టియాగురు
సేవ । జేయకున్నబుణముఁ * బాయరాదు॥ ౨౧౭। క। గురుకరుణవడసి
నిరతము । మఱిమఱియాపరమునందె * మదినిల్పనగుఁ । గురుభక్తి
లేకయుండిన । నరునకుదూరంబుముక్తి * నలినదళాక్షీ । ౨౧౮ ॥
ఆ-వె॥ గురుఁడుదెలిసినంత * యెఱిఁగితిగురుఁడునా । కెక్కువేమి
యంచు * నిక్కరాదు । యడుగుకీటువిడచి * యామీఁదగోడను ।
బెట్టినిల్పఁగలరె * దిట్టలైన । ౨౧౯। క। పరమునకంటెను దెల్పిన ।
గురుఁడేయధికుండుగాన * గురుభక్తుండుఁ । గురుఁడేబ్రహ్మయువిష్ణువు ।
గురుఁడేశివుఁ డింద్రుఁడంచుఁ * గొల్వఁగవలయుఁ॥ ౨౨౦ । ఆ-వె।
వెలఁదిపరులుదూఱ * వినరాదుగురునిఁదా । దూఱరాదు. ఆజ్ఞ * మీఱ
రాదు । గురుఁడుమదినినొప్ప * కుండునదెద్దియుఁ । జేయరాదుమంచి *
శిష్యుఁడైన॥ ౨౨౧। చ। గురుఁడునను గ్రహంబొసఁగఁ * గోరినకా
లముఁ బుచ్చరాదు స । త్వరగతినీయకుండినను * దత్తరబెట్టఁగ రాదు
సూగుణుం । డిరవుగబోధఁజేయునెడ * నెంతటి కార్యములున్నఁబోవరా ।
దరయఁగఁదెల్పకుండినను * నాతనినొక్కఁగ రాదుశిష్యుఁడుఁ । ౨౨౨।
ఆ-వె॥ వెలయనితరమైన * వేడుకలెవ్వియుఁ । గోరిచేయరాదు * గురుని
యింట । మంచమెక్కరాదు * మద్యపానంబాది । కృత్యములను జేయఁ *
గూడదెపుడు । ౨౨౩। క॥ గురుఁడుండు నాశ్రమమునకుఁ । గఱితుర
గము లెక్కిపోవఁ * గారాదెపుడుఁ । వరభక్తిపాదచారిగ । నరుగంగా
వలయుశిష్యుఁ * డతివినయమునఁ । ౨౨౪ ॥ ఆ-వె। పరఁగధరణి
కెల్లఁ * బ్రభువుతానైనను । దనప్రభుత్వమేమి * తనదుగురుని ।

యెదుటఁ జూపఁగదగ * దెంతవాఁడైనను । గురునిభృత్యు పగిదిఁ*
గొల్వవలయు॥ ౨౨౫॥ క॥ గురుమూర్తికిఁగనుపించక । మఱుఁగింగా
రాదుదొంగ * మార్గములందుఁ । పఱికపటవినయభక్తులు।గురున
కునొనరింపరాదు * గురుభక్తుండుఁ ॥౨౨౬॥ ఆ-వె॥ ఒనరఁగురుఁడు
తనకు * నొసఁగు ప్రసాదంబు । నెవ్వరికినిఁ దాను * నీయఁదగదు।
తానెగుడువవలయుఁ * దనకుమహాప్రసా।దంబుగాఁగశిష్యుఁ*డాదర
మున॥ ౨౨౭॥ క॥ గురుఁడొసఁగిన తృణమైనను । బరమధనంబది
యటంచు*భావింపఁదగుఁ।గురుఁడీయకున్న నెద్దియుఁ।బరగంగాముట్ట
రాదు * భక్తుండెపుడుఁ॥ ౨౨౮॥ ఆ-వె॥ గురునిఁబాసియొంటిఁ *
గూర్చుండఁగారాదు । ఆజ్ఞచేయఁగదగ*దరయగురుని । మోసపుచ్చ
రాదు * గాసిపెట్టఁగరాదు । ప్రజ్ఞదెల్పరాదు*భక్తుఁడబల॥ ౨౨౯॥
క॥ గురువును నేరము లెన్నెడు।నరపశువును భక్తుఁడనఁగ * న్యాయం
బగునే । గురుఁడే దైవంబనుచును।స్థిరముగసేవించువాఁడె*శిష్యుఁడు
గాకఁ॥ ౨౩౦॥ ఆ-వె॥ కల్లలాడరాదు * గర్వించిగురునితో । నెదిరి
పల్కుటదగ * దెన్నటికినిఁ । బగనుబూనరాదు * భక్తునిదండించి।
గురుఁడుగీము వెడలఁ*గొట్టినేని॥౨౩౧॥క॥గురునకు సరియగు దైవము।
ధరణినిఁదనుఁగన్న తల్లి*దండ్రులుననుజుల్। వరబంధుజనములాప్తులు।
పరమాత్ముఁడు గాదుకాదు * పరమపదంబుఁ॥ ౨౩౨॥ తే-గీ॥ కుల
మునభిమానమునులజ్జ*గలిగిగురుని।చెంతవర్తింపఁగఁదగదు * శిష్యు
నకును । గులమునభిమానమునుసిగ్గుఁ * గూలఁబెట్టి । సల్పఁదగు సేవ
కింకరు*చందమునను॥ ౨౩౩॥ క॥ ఇలసర్వతీర్థయాత్రలు । పలుమఱు
సేవించి నంత * ఫలమునరునకుఁ । గలుగును సద్గురుమూర్తినిఁ ।
దలఁపంగా నొక్కమాఱు * దర్శించుటచేఁ॥ ౨౩౪॥ తే-గీ॥ ఘన
తరంబుగ భయభక్తి * గల్గిగురుని । పాదుకాసన శయ్యల * భక్తుఁ
డెలమి । వందనంబులుగావింప * వలయుఁగాని। పాదముల్ వానికిఁ
దగుల్ప*రాదెపుడును॥ ౨౩౫॥ క॥ గురుఁడును బోవుచునుండఁగ ।
గురువెనుకనె పోవవలయు * గురుభక్తుండుఁ । గురునీడఁ ద్రొక్కి
మున్నుగ । నరుఁగదగదు భక్తుఁడెంత * యధికుండైనఁ॥ ౨౩౬॥
ఆ-వె॥ ఆసనములుశయ్య * లంబరభూషణ । వాహనంబులాది *

వస్తువులను భక్తినొసంగవలయు * భక్తుండు గురునకుఁ । జిత్తమందు సంత * సించునట్లు॥ ౨౩౭॥ క॥ మఱి దేహమున్న వఱకును । స్మరియింపుచునుండవలయు*సద్గురుమూర్తిన్ । దురితప్రవర్తనుఁడై నను । గురునకు లోభంబుఁజేయఁ * గూడ దెదియున్॥ ౨౩౮॥ ఆ-వె॥ పరమగురునిస్వామి * ప్రభుదేవయంచును । జేరిపిల్వవలయు* శిష్యుఁడెపుడు । నరుఁడటంచు నెంచి * నరులనందఱివలెఁ । బేరుపెట్టి తాను*బిల్వదగదు॥ ౨౩౯॥ క॥ గురువును గురుమంత్రంబును । మఱచియుగురునింద(ఁ)జేయు * మంకుజనుండున్ । తరణిను ధాకరులుండెడి । వఱకును యమలోకమందు వాసముఁజేయున్॥ ౨౪౦॥ ఆ-వె॥ గురునివలనఁ బరము*గుర్తుగాఁ దెలిసిన । గురుఁడు శిష్యునందుఁ*గూర్మిలేక । గాంచరాదుముక్తి * గావునభక్తుండు । గురుని ప్రేమరాగఁ * గొల్వవలయు॥ ౨౪౧॥ క॥ గురునాజ్ఞఁబొందని దెతా । గురువై భువి శిష్యజనులఁ*గూర్చియుబహుగా । గురుబోధఁ దెల్పువాఁడే । గురువంచకుఁడనఁగఁ బరఁగుఁ*గుంభినిలోనన్॥ ౨౪౨॥ తే-గీ॥ చెలఁగిసద్గురు సేవయుఁ * జేయుటెట్టు । లనినస్థానాంగభావాత్మ * లనఁగనాల్గు । విధములైనశుశ్రూష * వేసరకను । జేయవలయును భక్తుండు * చెలువుమీఱ॥ ౨౪౩॥ క॥ హరినిర్జరదిక్పాలక । సరసిజగర్భాదులిచ్చు*శాపములైనన్ । గురుమూర్తిదీర్పఁజాలును । గురుశాపముమాన్పలేరు * కుంభినినెవరున్॥ ౨౪౪॥ ఆ-వె॥ గురుఁడుతన్ను మిగులఁ * గొట్టి తిట్టుటెల్ల । తన్నురక్షఁజేయఁ * దలఁచిగాని । శిష్యువలనఁ దాను*సిద్ధిఁబొందుటకునై । గాదతనిని జెలుపఁ * గాదుచూవె॥ ౨౪౫॥ క॥ శిక్షింపఁదలఁచువాఁడే । శిక్షించు భయంబుఁజెప్పి * చేయించుఁ బనుల్ । శిక్షింపఁదలఁపకుండిన । శిక్షింపఁడు పేక్షఁజేసి * చెప్పండెదియున్॥ ౨౪౬॥ ఆ-వె॥ మధువువలయునతఁడు * మధుమక్షికములకు । జడిసిపాఱమధువుఁ * బడయఁడట్లు । గురుఁడుశిష్యవరునిఁ * గొట్టినఁదిట్టిన । నోర్చిబోధఁగొనుట * యొప్పుధాత్రి॥ ౨౪౭॥ సీ॥ అలకాశియాదిగా* నఖిలతీర్థములకు - గురుపాదతీర్థమే*గొప్పగాఁగ । వరస్వర్గకైలాస* వైకుంఠములకంటె - గురునిలయమెమహా * గొప్పగాఁగ । హరిహరబ్రహ్మాదిసురసంఘమునకంటె - గురుమూర్తియేమహా*గొప్పగాఁగ।

ధరసను స్త్రప్రసా * దంబులకంటెను - గురుసుప్రసాదమే గొప్పగాఁగ ।
బరమగురుమూర్తి సేవించు * భక్తునకును । బదవు లేటికి మూర్తుల *
భ్రాంతి యేల । సకలతీర్థంబు లేటికి * జన్మఁదెచ్చు । జన్మరహితంబు
గురుపద * సంభవంబు ॥ ౧౨౮ ॥ క ॥ గురుపాద తీర్థమునకును । సరి
వేయవ పాలుగాదు * జగతిసకలసా । గరపర్యంతముగల్గిన । వరతీర్థము
లందుఁ గ్రుంకు * వలనిఫలంబుల్ ॥ ౧౨౯ ॥ చ ॥ విడువగవచ్చు రాజ్య
మును * విత్తము గేహము బంధువర్గముల్ । విడువఁగవచ్చు సోదరుల *
వేగమెయాప్తులఁ దల్లిదండ్రులన్ । విడువఁగవచ్చు సౌఖ్యమును * వేడ్క
జెలంగఁగ నాలుబిడ్డలన్ । విడువఁగవచ్చుఁ బ్రాణమును * వీడఁగరాదిల
భక్తిమార్గముల్ ॥ ౧౩౦ ॥ చ ॥ సతిగుఱిగల్లు దూరమునఁ * జందన
వృక్షములున్న వానిపై । తీతినవెవంటకట్టియలు * నేతురు చేరువనున్న
యట్లుగన్ । సతతము నింటనుండినను * చౌకదనంబు బుధాళికెంత
యున్ । హితవుగ గొప్పపూజ్యతవ * హింతురుదూరమునందునుండి
నన్ ॥ ౧౩౧ ॥ ఆ-వె ॥ అనుడుసద్గురూత్త * మునియందు భక్తియు । నౌర
యెంతయొప్పు * ననుచునాత్మ । నెన్నికొనుచు మిగుల * నీగ్రంథ
ఫలమును । జెప్పుమనినఁజక్రి * చెలియఁజూచి ॥ ౧౩౨ ॥ క ॥ ఎఱిఁగితివి
యెఱుఁగఁ గలిగిన । పరమార్థంబైన సూక్ష్మ * భావములెల్లన్ । గొఱఁ
తయ్యేనేమొ వినుమిఁక । నెఱిఁగించెద గ్రంథఫలము * నిందునిభా
స్య ॥ ౧౩౩ ॥ ఆ-వె ॥ భక్తి దెల్పుచోట * ముక్తిమార్గమునుండు ।
ముక్తిదెల్పుచోట * భక్తియుండు । భక్తిముక్తిదెలియఁ * బడనిగ్రం
థంబులు । చదువనేల పెక్కు * చదువులెల్ల ॥ ౧౩౪ ॥ సీ ॥ సతిమన
యిరువుర * సంవాదరూపమౌ - నీమోక్షగ్రంథంబు * నింపుమీఱఁ ।
జదివి వ్రాసినవిన్న * జనులకు సుగుణంబు - లాయురారోగ్యంబు *
లతిశయిల్లు । నిష్టంబులీడేరు * నిఖిలాఘచయములు - పాయుసంకట
ములు * వాసిపోవు । పుత్రపౌత్రాద్యష్ట * భోగముల్ చేకూఱు -
దారిద్ర్యరుగ్మతల్ * దలఁగుఁదుదకుఁ ॥ తే-గీ ॥ బుణ్యలోకంబులొందు
దుర * పొలుపుమీఱ । దేశికుని కృతసర్మంబుఁ * దెలిసిదీని । యను
భవంబును దెలసిన * యట్టివారు । ముక్తులగుదు రెవ్వారైన *
మోహనాంగి ॥ ౧౩౫ ॥ క ॥ ఎందాఁకఁ బంచభూతము । లెందాఁకస
గాబ్ధితార * లినశశిజగముల్ । ఎందాఁకనుండు నీకథ । యందాఁ
కిలఁ జెలగుఁగాత * మార్యస్తుతమై ॥ ౧౩౬ ॥ చ ॥ అనపుడు భక్తి

ముక్తులను * సంపగఁజేయుట మీకటాక్షమహా । ననిమది నెంతు
నీవరయ * నాకువిభుండవు సద్గురుండవై । ననుగురుబోధ దేర్చు
టకు * నాదగుభాగ్యము గా దె దేవకీ । తనయ విముక్తిఁ జేయ సను*
ధారుణి మీరలు పుట్టులెంతయుఁన్ ॥ ౨౫౭ ॥ క ॥ పరహితము సేయు
సదులును । బరహిత మొనరించునప్రభ * పాదపతతు లా । కరణిని
నీలోకంబునఁ । బరహితమే యాచరించు * ప్రాజ్ఞులుమీరల్ ॥ ౨౫౮ ॥ వ ॥
క ॥ అని వినుతించుచు రుక్మిణి । తననాథునిఁగొల్చి భక్తిఁ * దప్పక
పూజల్ । ఒనరించుచుసేవించుచు । ననుపమమోదాబ్ధి వాల*లాడెడి
వేళన్ ॥ ౨౫౯ ॥ సీ ॥ తరుణివిడిది కేగు*తఱిఁజెప్పవచ్చిన-చొప్పున వే
నుపఁ*జుక్కవాడిచె । బడఁతికిదేహాది*భ్రమలూడెననుభంగిఁ - గలువ
లంతంతఁజో*క్కముగముడిచె । ముదితకజ్ఞానాంధ * మునువిచ్చిచనె
సను - భాతినంతంతకుఁ బానెఁదమను । రమణికిగుణవికా*రములెల్ల
డిందిన - సరణిచుక్కలవిలా * సంబుమానె ॥ తే-గీ ॥ జ్ఞాననేత్రంబు విక
సించె*చానకనిన । గతినిఁదామరలెల్లవి * కాసమొందె । నాతిజన్మం
బు తెలవాఱె*ననినపోల్కి । దినకరుండును బొడిచెఁబ్రా*గ్దిక్కునందు ॥
క ॥ అంతటఁబతియాజ్ఞను దన । యంతఃపురమునకు నేగి * యనయము
సతి బల్ । వింతగ సముచితకృత్యము । లెంతయుసల్పుచునుభక్తి *
సేమజుకుండెన్ ॥ ౨౬౦ ॥ క ॥ వేదాంతవేద్యనామా । వాదద్వైధాంతధీ
మ * వర్జితకామా । ఖేదామోదాంతసీమా । నాదద్రూపాంతసీమ *
నామవిరామా ॥ ౨౬౧ ॥ మాలిని ॥ భ్రమచయలయయుక్తా *
భావవిఖ్యాతిరిక్తా । యమరనికరమాన్యా*యాదిమధ్యాంతశూన్యా ।
నిమిషవిజితపాపా * నిర్గుణానంతరూపా । సమహితకులదూరా *
సర్వహీనావికారా ॥ ౨౬౨ ॥ క ॥ మంగళముపరమగురునకు । మంగ
ళముచిదాత్మునకును * మంగళముభవా । భంగవిగతునకుస్థిరునకు ।
మంగళమజరుద్రవినుత * మగుబయలునకున్ ॥ ౨౬౩ ॥

గద్య ॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్య పుత్ర, సాధుజనమిత్ర
నారసింహనామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను సుజ్ఞాన శాస్త్రంబునందు
సర్వంబును బంచమాశ్వాసము.

స్వస్తి.

---

# పంచపాదిసీసము.

మంగళగిరితూర్పు * వఱియిప్పటములోని -
దైనమల్లెంపూడి * యనెడువీట
ఘనుఁడుబొమ్మారెడ్డి * కిన్నయవరగర్భ -
జనితుఁడైసత్పుణ్య * చరితుఁడగుచు
నలపెదకోటయ్య * యనునామమున గ్రామ -
మునసబు నధికార * మును వహించి
జనులెల్లసద్ధర్ముఁ * డనఁగ న్యాయాన్యాయ -
ములనుగణించి తీ * ర్పులు నొనర్ప
సజ్జనోత్తముఁడంచు * సర్కారు జనములు -
ప్రస్తుతింపమెలఁగు * భవ్యమూర్తి

తే.గీ॥ రుక్మిణీ కృష్ణ సంవాద * రూపమగుచుఁ
బరఁగు నీమోక్ష గ్రంథంబుఁ * బ్రౌఢమెఱయ
ధనసహాయంబు వలనను * ధర్మరీతి
నచ్చువేయించె బుధజనుల్ * మెచ్చ మొదట.

సీ॥ అస్మద్గురుఁడగుచు * నలరు శ్రీపోకల - శేషాచలార్యుల *
జ్యేష్ఠపుత్త్రుఁ। డగు వేంకట నృసిం * హారావునాముండు -
భవ్యచరిత్రుఁడా * పండితునకు। క్షితి నేరచించిన * శ్రీ
కృష్ణరుక్మిణీ - సంవాదమనెడు సు*జ్ఞానశాస్త్ర। మనెడు
నీ సద్గ్రంథ * మును సరిచూడంగ - నవల రిజిష్టరు *
నాదిగాఁగ॥

తే.గీ॥ సర్వకర్తృత్వ మొసఁగితి*సత్యముగను। గండుకూరను
సీమలోఁ*గలుగు పమిడి।పాటి పుర వాసుఁడను నేను*
భాసురముగఁ।బోలకం నారసింహా నా * ముండనొగిని॥

# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA120B155 |
|---|---|
| పుస్తకం పేరు | శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను సుజ్ఞాన శాస్త్రము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 140 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Prasannamma |
| పేజీలు విడదీసినది | Haseena |
| స్కాన్ చేసినది | PRATHYUSHA |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |